# చతుర



ఆగస్ట్ 1999

రూ : 7/-

## స్వాములోరు...

— మొలకలపల్లి కోటేశ్వరరావు

# చతుర ప్రపంచం

## మదర్స్ ఆఫ్ ఇన్‌వెన్షన్

'ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్...' అని ఇప్పుడైతే అనుకోవలసిన అవసరంలేదు. ఏ ఫీల్డ్‌లో చూసినా మగవాళ్ళతో సమానంగా ఆడవాళ్లు కూడా ఎంతో నేర్పుగా తమ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. అసలు ఇప్పుడే కాదు, పూర్వకాలంలో కూడా విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలని కనుక్కోవడంలో స్త్రీల పాత్ర కూడా వుందని చాలామందికి తెలియదు.

సైంటిస్ట్ అనగానే మనకి గడ్డం, బట్టతల, కళ్లజోడు గల 60 ఏళ్ల వృద్ధుడు స్ఫురిస్తాడు. వాస్తవానికి ఆడవాళ్లలో కూడా చాలామంది సైంటిస్టులు వున్నారని తెలుస్తోంది. వాళ్లు కనిపెట్టిన వాటినెన్నింటినో మనం నిత్యజీవితంలో వాడుతున్నాం.

రేడియం కనిపెట్టింది స్త్రీయేనని చాలామందికి తెలుసు. మైక్రోవేవ్ ఓవెన్‌ని 1960లలో జెస్సికార్డ్ వైట్ అనే ఆవిడ కనిపెట్టింది. ఇంకా ఐస్ క్యూబ్స్ తయారుచేసే యంత్రాన్ని కూడా ఆవిడే కనిపెట్టింది. కార్డ్‌లెస్ టెలిఫోన్‌ని ఫిజిస్ట్ మిస్ టెరిపాల్ అనే మహిళ కనిపెట్టి 1969లో దాని హక్కులను ఓ ఫోన్ కంపెనీకి అమ్మింది. కంప్యూటర్‌ని కనిపెట్టడంలో కూడా ఓ మహిళకి భాగముంది. ఛార్లెస్ బార్బేజ్ అనే సైంటిస్ట్‌తో కలిసి మిసెస్ లవ్‌లేస్ అనే ఆవిడ 'అనలిటికల్ జీన్స్' అనే మొదటి కంప్యూటర్‌ని 1830లో కనిపెట్టింది. అది కూడికలు, తీసివేతలు మాత్రం చెయ్యగలిగేది.

జీగర్ కౌంటర్ అనే రేడియేషన్‌ని కొలిచే యంత్రాన్ని మేరియాక్యూరీ అనే జర్మన్ ఫిజిస్ట్ మొదటి ప్రపంచ యుద్ధకాలంలో కనిపెట్టింది. రేడియంని కనుక్కొన్నది కూడా మేరియా క్యూరీనే. ఇంతదాకా రెండు నోబుల్ ప్రైజులు పొందిన ఏకైక వ్యక్తి కూడా ఆవిడే.

1965లో కెమిస్ట్ స్టెఫినికొలెక్ కాలిబర్ అనే పదార్థాన్ని కనుగొంది. తక్కువ




బరువు, ఎక్కువ నాణ్యత గల దాంతో బుల్లెట్ ప్రూఫ్‌లెస్ట్‌ని తయారుచేసింది. అటుపైన ఈ పదార్థం కార్ల తయారీలో, రేడియోలో, టైర్లలో, రాకెట్లలో కూడా ఉపయోగించారు.

కార్లముందు అద్దాలకుండే వైపర్స్‌ని ఉపయోగించి వర్షం కురుస్తున్నప్పుడు కూడా ప్రయాణిస్తూవుంటాంకదా! ఆ విండ్‌షీల్డ్ వైపర్స్‌ని 1900లో మేరీ యాండర్‌సన్ అనే మహిళ కనుక్కుంది. జోరున వాన పడుతున్నప్పుడు కారు ఆపనక్కర్లేదు. దుమ్ముపడుతుంటే మాటిమాటికీ కారు దిగి విండ్‌షీ

కవర్‌ఫోటో: వి. సత్యమూర్తి

ల్డ్‌ని తుడవనవసరంలేదు. ఎందుకంటే మదర్స్ ఆఫ్ చిల్డ్రనేకాక మదర్స్ ఆఫ్ ఇన్వెన్షన్ కూడా వున్నారు మరి.

# అమెరికాలో సినిమా సర్టిఫికెట్లు

సినిమా ఓ ఆకర్షణీయమైన ప్రపంచం. చూస్తున్న 3 గంటలూ అది కథలాకాక వాస్తవమే అన్న భ్రమను కల్పిస్తుంది. కొందరు అందులోని పాత్రలు ఏడ్చినప్పుడు ఏడ్చి... నవ్వినప్పుడు నవ్వి... ఆ ప్రపంచంలో తల్లీనమయిపోతారు.

కానీ ఇప్పుడొచ్చే సినిమాలలో అంతగా




మనసుకు హత్తుకునేలా కథ, కథనం వుండటంలేదన్నది కూడా అబద్ధంకాదు. కేవలం ఒక వర్గం ప్రజలు మాత్రమే ఇవి చూసి సంతోషిస్తున్నారని చెప్పకతప్పదు. అనవసరపు హత్యలు, మారణహోమాలు, రక్తపాతం, హింస, జుగుప్సాకరమైన సంఘటనల మసాలాతో ఇప్పటి సినిమాలు నిర్మించబడుతున్నాయి. అప్పుడప్పుడు వచ్చే పాత సినిమాలు వయసులో పెద్దవారికి రిలీఫ్ నిచ్చి సినిమా చూసిన తృప్తిని మిగుల్చుతున్నాయి.

మనదేశంలో సినిమాలకి 3 రకాల రేటింగ్స్ వున్నాయి. 1 ఎ- అడల్ట్స్ సినిమాలు. 18 ఏళ్ళు పైబడ్డవాళ్ళు మాత్రమే చూసేవి. 2. యు- యూనివర్సల్- అన్ని వయసుల వాళ్ళూ చూడదగ్గవి. 3. యు-ఎ. పెద్దవాళ్ళతోపాటు 18 ఏళ్ళలోపు వాళ్ళు చూడదగ్గ సినిమాలు. అయితే ఇవన్నీ అందరూ అంత ఖచ్చితంగా పాటించడం లేదన్నది అందరికీ తెలిసిన విషయమే. అమెరికాలో ఈ రేటింగ్స్ 5 ఉన్నాయి. అవి జి- జనరల్ ఆడియన్స్- కుటుంబం యావత్తూ కలిసిగానీ, విడివిడిగా గానీ చూడదగినవి. 2. పి.జి.- పేరెంటల్ గైడెన్స్- విధిగా పెద్దవాళ్లతోనే చూడదగ్గ సినిమాలు. 3. పి.జి.- 13 పేరెంట్స్- స్ట్రాంగ్లీ కాషన్డ్. అంటే 13 ఏళ్లలోపు పిల్లలు వీటిని చూడవచ్చో చూడకూడదో నిర్ణయించి అప్పుడు పిల్లలను చూడటానికి అనుమతించాలి. 4. ఆర్.-రెస్ట్రిక్టెడ్- పెద్దవాళ్ళు మాత్రమే చూడవలసిన దృశ్యాలు గల చిత్రాలు. ఆ చిత్రం గురించి తాము తెలుసుకున్న తర్వాతే తమ పిల్లలను తమతో తీసుకు వెళ్లదగ్గ సినిమాలు. 5. ఎన్.సి.-17, నో చిల్డ్రన్ అండర్ సెవెంటీన్ ఎడ్మిటెడ్. పెద్దవాళ్ళు మాత్రమే తప్ప చిన్న పిల్లలు చూడదగ్గ చిత్రం కాదిది.

ఆ దేశ ప్రజలు ఈ రేటింగ్స్‌ను ఖచ్చితంగా అనుసరిస్తారు. అమలు చేస్తారు. ఇండియాలో ఎ. సర్టిఫికెట్ సినిమాకి పిల్లల్ని అనుమతించినట్లుగా అక్కడ ఆ చిత్రానికున్న సర్టిఫికెట్‌కి సంబంధంలేని వారిని అనుమతించరు.

సెక్స్, క్రైమ్, వయొలెన్స్‌లతో విసిగిపోయిన అమెరికన్స్ ఇప్పుడు జి. సర్టిఫికెట్ సినిమాల్ని విపరీతంగా ఆదరిస్తున్నారు. 'హోమ్ ఎలోన్' అందుకు మంచి ఉదాహరణ. 2 కోట్ల డాలర్ల ఖర్చుతో నిర్మించిన ఆ




చిత్రం ఒక్క అమెరికాలోనే 25 కోట్ల డాలర్లు కలెక్ట్ చేసింది. గతంలోలా వ్యక్తిగత స్వతంత్రత, విడాకులు, సింగిల్ పేరెంట్‌హుడ్ పద్ధతులు మారి తిరిగి ఇండియాలోలా కుటుంబ సభ్యుల మధ్య ఆదరణ, ప్రేమ చోటు చేసుకోవడం కూడా ఓ కారణం.

## మొలకల విలువలు

**మొ**లకెత్తిన పెసలు, శనగలు వగైరా పప్పు ధాన్యాలు ఆరోగ్యానికి ఎంతో మంచిదని ఎందుకంటున్నారంటే అందులో సంపూర్ణ ఆహార విలువలున్నాయి కాబట్టే. ఇవి ఏవైనా మొలకెత్తాలంటే నీళ్లలో బాగా నానిన తరువాత ఆ నీటిని పూర్తిగా తీసేసి ఓ తడిగుడ్డలో మూటగట్టి వుంచాలి. బట్టను కొద్దిగా తడపాలిగానీ ఎక్కువ నీరుండకూడదు. అలా వుంటే మొలకరాదు సరికదా, గింజ కుళ్లుతుంది. పూర్తి బలవర్ధకమైన ఆహారం కేవలం ఈ మొలకల్లోనే ఉందంటున్నారు వైద్యులు. గింజ మొలకెత్తే సమయంలో ఎంజైములు ఉత్పత్తి అయి పిండి పదార్థం గ్లూకోజ్‌గా మారి, ప్రొటీన్లు అమినో ఆసిడ్లుగా మారి ఆ ధాన్యాల పోషక విలువలను నిముషాలమీద పెంచుతుంది. మన శరీరంలో జరిగే ఈ మార్పులు బయటే జరిగి ఆ ఎంజైములను, అమినో ఆసిడ్లను మనం డైరెక్ట్‌గా లోపలకు తీసుకుంటున్నామన్న మాట. శరీరంలో జరిగే అనవసర రసాయనిక చర్యలను ఇవి అరికడతాయి. ఈ ఎంజైములు అరుగుదలలో తోడ్పడి తిన్న పదార్థంలో గల ప్రొటీన్లు సత్వరం రక్తంలో కలిసేందుకు దోహదం చేస్తాయి.

అయితే మొలకలు 50 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రతవద్ద నిర్వీర్య మవడం ప్రారంభిస్తాయి. కాబట్టి ఈ మొలకలను వేయించుకునో లేక ఉడికించుకునో తినడంకన్న పచ్చిగా తింటేనే ఫలితమెక్కువ. వాటిని ఫ్రిజ్‌లో కూడా పెట్టరాదు. అతి శీతలం కూడా అందులో ప్రొటీన్లను నష్టపరుస్తుంది. గోధుమ గింజల మొలకల్లో అన్నిటికన్నా ఎక్కువ ప్రొటీన్లున్నాయంటున్నారు. సోయాబీన్స్ మొలకలు రావాలంటే చాలా ఎక్కువ సమయం పడుతుంది. అలాగే అవి నానడానికి కూడా ఎక్కువ సమయం తీసుకుంటుంది. రకరకాల ధాన్యాలను కలిపి కూడా మొలకలు చేసుకుని తినవచ్చు. మొలకల్ని తినడానికి 2 గంటలముందు కాసేపు ఎండలో పెడితే అవి ఆకుపచ్చగా, ఆకర్షణీయంగా కనిపిస్తాయి. వాడేముందు ఒక్కసారి కడిగితే అదనపు తేమ వుంటే పోతుంది. ఎదిగే పిల్లల ఆహారంలో మొలక ధాన్యాలుండటం అవసరం, ఆరోగ్యకరం. ప్రొటీన్లని, అనేక బలవర్ధకాల్ని సత్వరం




శరీరానికి అందచేస్తాయవి. గర్భిణీస్త్రీలకు కూడా చాలా మంచివి ఇవి. అన్ని పప్పు ధాన్యాల్లోనూ ఎన్నో బలవర్ధక విటమినులు సమానంగా వున్నా మళ్ళీ ఒక్కొక్క ధాన్యంలోనూ వేరువేరు విలువలుగల ప్రొటీన్లున్నాయి. దేనికదే ప్రత్యేకం. డయాబిటిస్‌తోను, సమతౌల్య ఆహారలేమితోను బాధపడేవారికి మొలక మినుములు ఎంతో మేలు చేస్తాయి. అన్నిటికన్నా బలవర్ధకమైనవి మొలక పెసలు. ఇవి త్వరగా మొలకెత్తడమేకాక త్వరగా అరిగిపోతాయి కూడా. ★

సంపుటి: 22 సంచిక: 7 ఆగస్ట్: 19

# చతుర

అనన్య సామాన్యమని ప్రచారమైన ఆ స్వామి మహిమకు ఆకర్షితులై సుదూర ప్రాంతాలనుంచి కూడా భక్తులు తండోపతండాలుగా ఆ ఆశ్రమానికి రకరకాల కోరికలతో వస్తూంటారు.

స్వామి మహిమంతా ఆయన చేతి వేలులోనే వుందనీ ఆ వేలు ముంచిన నీళ్ళు తాగితే గర్భసంచీ తొలగించబడిన స్త్రీలు సైతం గర్భవతులవుతారని చెప్పుకుంటారు. ఇవన్నీ విని పెళ్ళయి పధ్నాలుగేళ్లయినా తన కడుపు పండలేదనే బాధతో వున్న ఆ యువతి భర్తను ఒప్పించి స్వామి సన్నిధికి బయలుదేరింది.

అనుకూల దాంపత్యం, సుఖసంసారం, లోటులేని సంపాదన అన్నీ వున్నా సంతానలేమి కుంగదీస్తుండటంతో నమ్మకాలు లేకున్నా భార్యను కాదనలేక స్వామి ఆశ్రమానికి తీసుకువెళ్ళాడతడు. వారికి అక్కడెదురయిన అనుభవాలెలాంటివి?

ప్రజల నమ్మకాల్ని సొమ్ముచేసుకునే దొంగ స్వాముల కోవలోనివాడేనా ఈ స్వామి కూడా? లేక భక్తులు నమ్మి చెబుతున్నట్లు దైవాంశ సంభూతుడా? అడుగడుగునా ఉత్కంఠతో చదివించే

**మొలకలపల్లి కోటేశ్వరరావు** రచన

**'స్వాములోరు'** ఈ నెల

చతుర సమగ్ర నవల.

"ఏమండీ.."

"...."

"మిమ్మల్నే"

"చెప్పండి మేడం ఏమిటో?" ఆఫీసు ఫైల్స్ చూసుకుంటూ తల ఎత్తకుండానే అన్నాడు రామక్రిష్ణ.

"ఎప్పుడూ మీకు మీ ఫైల్స్‌తోనే సరిపో తోంది. ఆఫీసులో చేసే పని సరిపోకనా అవి ఇంటికి కూడా మోసుకొచ్చుకునేది! ఇంతకీ నా మాట ఒకటి వింటారా లేదా?"

"చెప్పు ఏమిటో?" ఫైల్ మూసి రాధిక వైపు చూస్తూ అన్నాడు రామక్రిష్ణ.

"మీరు వింటానంటేనే చెపుతా!"

"చెప్పమంటున్నాకదా!"

"ఏం వింటారోలెండి. ఇంతసేపటినుంచీ పిలుస్తుంటే తల ఎత్తి కూడా చూడకుండా అంత నిర్లక్ష్యంగా వున్నారు. నేను చెప్పను" మూతి మూడు విధాలుగా తిప్పి అంది రాధిక.

"చెప్పు రాధీ... వింటానంటున్నా కదా!"

"చెప్పిన తరువాత కాదూ కూడదనకూడదు. మీరు గట్టిగా వింటానంటేనే చెపుతా"

"గట్టిగా ఏమిటీ, పోటిగా ఏమిటీ? నీవు చెబితే ఎప్పుడైనా నేను కాదన్నానా కాదంటానా?"

"నాకూ... నాకూ... జోలాలీ కావాలండీ!" రాధిక సిగ్గుపడిపోతూ తలవంచుకుని నెమ్మదిగా, పొత్తిళ్లలో పాపాయిని చేతుల్లో పట్టుకున్నట్లుగా, రెండు చేతులూ వూపుతూ అంది.

ఆ మాట వినడంతోనే రామక్రిష్ణ తలదించుకున్నాడు. కొద్ది క్షణాల తరువాత నెమ్మదిగా తల ఎత్తి అన్నాడు.

"అవును రాధీ... నాకూ పిల్లలు కావాలనే వుంది. పిల్లలంటే నాకూ మంచి ఇష్టమే! అందుకే గదా చాలా మంది డాక్టర్లకి చూపెట్టుకున్నాం. ఇద్దరం ఎన్నో టెస్టులు చేయించుకున్నాం. సంతాన సాఫల్య కేంద్రాల చుట్టూ తిరుగుతున్నాం. ఇంతకంటే ఇంకేం చేద్దామంటావు?"

"ఏం చేసినా ప్రయోజనం కనబడటం లేదు గదండీ! ఉదయం మీ అమ్మగారు ఏమంటున్నారో విన్నారా?"

"ఏమంది?"

"ఎదురింటి విమలగారు వచ్చారు. మాటల్లో పని అయిందా అని అడిగారు. ఇక మీ అమ్మగారు లేచారు. ముగ్గురి మనుషులకి ఎంత పనీ, ఏం పనీ అని మొదలు పెట్టి చాలా మాటలు అన్నారు. నేను గొడ్రాలిని అవుతానేమోనని తనకి భయంగా వుందట. మనవడ్ని ఎత్తుకుని ఆడించి పాడించే అచ్చటా ముచ్చటా తనకి వుండదేమో అని బెంగపెట్టుకుందట. పిల్లలు లేని ఇల్లూ ఒక ఇల్లేనా దెయ్యాలకొంపలాగ అని ఇంకా చాలా మాటలు అన్నారు. నేను చెప్పలేకపోతున్నాను" కళ్లలో నీళ్లు సుడులు తిరుగుతుండగా అంది రాధిక.

"పోనీ రాధీ... ఏం చేస్తాం? మనవణ్ణో, మనవరాల్నో ఎత్తుకోవాలనే కోరిక ఆవిడకి వుంటుంది. ఆ కోరిక తీరకపోవడంతో అలా మాట్లాడి వుంటుంది"

"నేను ఏం అనలేదు కదండీ! ఆవిడ అన్న మాటలు మీకు చెపుతున్నాను. అత్త తిట్టినందుకుకాదు తోడికోడలు నవ్వినందుకు బాధగా వుందన్నట్లు, పిల్లలు లేనందుకు కాదు, ఇతరుల మాటలు పడలేకనే! మనకి తొందరగా పిల్లలు పుడితే బాగుంటుందనే కోరిక పెరిగింది. మనకే గనుక పిల్లలు వుంటే ఇతరుల సూటీపోటీ మాటలూ, సాధింపులూ వుండవుకదా! నాకు చాలా బెంగగా వుందండీ"

"బెంగపడి ఉపయోగం ఏముంది రాధీ? నిరాశపడితే ఏదీ జరగదు. ఈసారి ఇంకా




పెద్ద డాక్టర్లకి చూపెట్టుకుందాం. ఎంత ఖర్చయినా వెనుకాడకుండా ఎంత దూరం అయినా వెళ్లి చూపెట్టుకుందాం! మనకి డబ్బు లేదు అనే బాధలేదుకదా! డబ్బు పోయినా తరువాత సంపాయించుకోగలం కానీ వయసు దాటిన తరవాత పిల్లల్ని సంపాయించుకోలేం కదా? "

"అంత దూరం పోవాల్సిన పనిలేదండీ! ఏదో వూళ్లో నీళ్ల స్వామి అని ఒక స్వామి వారు వున్నారట! ఆయన ఇచ్చిన నీళ్లు తాగితే ఎవర్నికైనా పిల్లలు పుడుతున్నారటండీ! నిన్న సాయంత్రం మా ఫ్రెండ్ సుజాత వచ్చి చెప్పింది. ఈ రోజు మా అమ్మ దగ్గరనుంచి కూడా వుత్తరం వచ్చింది. మన ఇద్దర్నీ తప్పనిసరిగా ఆ స్వామి వారి ఆశ్రమానికి వెళ్లిరమ్మని పదే పదే రాసింది. మా వూరినించి ఒక బస్సు ఏర్పాటు చేసుకుని చాలామంది వెళ్లారట"

"నేనూ విన్నాను రాధీ... మన టౌనులో కూడా నీళ్లస్వామిని గురించి చాలామంది చెపుతున్నారు. ఆశ్చర్యంగా వుంది. ఆ స్వామి ఇచ్చిన నీళ్లు తాగితే ఎలాంటి జబ్బులైనా తగ్గడమే కాకుండా పిల్లలు లేని వాళ్లకి పిల్లలు పుడుతున్నారని కూడా చెపుతున్నారు. విషయం పూర్తిగా తెలుసుకుని మనం కూడా ఒకసారి వెళ్లివద్దాం!"

"మీరు కాదంటారేమో అని మీకు చెప్పడానికి భయపడ్డాను. తప్పనిసరిగా వెళ్దామండీ! మనం ఎంతమంది డాక్టర్లకి చూపెట్టుకోలేదూ, వాళ్ల ముఖాన ఎన్నివేలు తగలెయ్యలేదూ? నీళ్లస్వామి దగ్గరకి కూడా ఒకసారి వెళ్లివస్తే తెలుస్తుంది. పిల్లలు పుట్టినా పుట్టకపోయినా వెళ్తేమనకి నష్టం ఏమీలేదుకదా!"

"అలాగే వెళ్దాం రాధీ, నేను కాదనడం లేదు. ముందుగా అన్ని వివరాలూ ఒకసారి కనుక్కుని వెళ్తే బాగుంటుంది"

"మా వూరు వెళ్తే చాలా విషయాలు తెలుస్తాయండీ! మా వూరినించి చాలామంది వెళ్లి వచ్చారట. ఇంకా వెళ్తున్నారట కూడా. రోజూ మా వూరినించి ఎవరో ఒకరు వెళ్తూనే వున్నారని మా అమ్మ రాసింది. వుత్తరం చూడండి" అని రాధిక వాళ్ల అమ్మ రాసిన వుత్తరాన్ని రామక్రిష్ణకి ఇచ్చింది.

రామక్రిష్ణ ఆ వుత్తరం చదివాడు.

"మా వూరు వెళ్లివస్తానండీ!"

"అలాగే వెళ్లిరా రాధీ.. చాలా రోజుల నించీ మీ వూరు వెళ్లాలంటున్నావుకదా! రెండు పనులూ కలిసి వస్తాయి. మీ వూళ్లో నీళ్లస్వామి వద్దకి వెళ్లి వచ్చిన వారితో మాట్లాడు. నిజం ఏమిటో అబద్ధం ఏమిటో తెలుస్తుంది. ఇప్పుడు నాకు మీ వూరు రావడానికి వీలుకాదు. నువ్వు వచ్చిన తరువాత ఇద్దరం ఆస్వామి వద్దకి వెళ్దాం" రామక్రిష్ణ అన్నాడు.



ఉత్తరం అయినా రాయకుండా హఠాత్తుగా వూరినుంచి వచ్చిన రాధికని చూసి తల్లిదండ్రులు ఎంతో సంతోషించారు.

ఏవైనా శుభకార్యాలకి లేదా పెద్ద పండగలకు ఎప్పుడో ఒకసారి తప్ప రాధిక ఎక్కువగా తల్లిదండ్రుల వద్దకిరాదు. రాకరాక వచ్చిన కూతుర్ని ఆప్యాయంగా ఆదరించారు.

పిల్లలు లేరనే ఒక విషయంలో తప్ప రాధిక తల్లిదండ్రులకి కూతురి కాపురం విషయంలో ఎలాంటి చీకూచింతాలేదు.

రాధికది ముచ్చటైన కాపురం!

భర్త ఇంజినీరు. ఒక ప్రభుత్వశాఖలో పనిచేస్తున్నాడు. జీతమే గాకుండా ఇతర ఆదాయం కూడా ఎక్కువగా వచ్చే శాఖ అది.

రామక్రిష్ణ మనిషి మంచివాడు. బుద్ధిమంతుడు. తనేమిటో తన పనేమిటో చేసుకుపో

యేరకం.

అత్తమామల్ని పీడించడం భార్యని రాచి రంపాన పెట్టడంలాంటి లక్షణాలు ఏమీ లేవు.

డబ్బు బాగా సంపాయిస్తాడు. బాగా ఖర్చు పెడతాడు. ఎంత ఖర్చుపెట్టినా దుర్ వ్యసనాలకి దూరంగా వుంటాడు.

అన్నీవున్నా పిల్లలు లేకపోవడంతో రాధిక తల్లిదండ్రులకి కూడా విచారంగా, దిగులుగా వుంది.

వాళ్ల వూరు వెళ్లిన రాధికకి రెండు రోజుల్లోనే ఎన్నో విశేషాలు తెలిశాయి. ఆ వూరి నించి నీళ్లస్వామి ఆశ్రమానికి చాలామంది భక్తులు వెళ్లివచ్చారు. కొందరితో రాధిక మాట్లాడింది ఆ భక్తులకు నీళ్లస్వామిని కోరిన కోర్కెలు అన్నీ తీరిపోతున్నాయి.

పిల్లలు జన్మించాలనే కోరికతో అంతకు మూడువారాల ముందే దాదాపు పదిమంది స్త్రీలు స్వామి వారి ఆశ్రమానికి వెళ్లివచ్చారు.

ఆ పదిమందిలో ప్రస్తుతం ఎనిమిది మంది తల్లులు కాబోతున్నట్లు రాధికకి తెలిపారు. వాళ్లు ఎంతో ఆనందంగా సంతోషంగా వున్నారు.

మిగతా ఇరువురు స్త్రీలు మాత్రం తమకి అనుమానంగా వుందన్నారు. స్వామివారు చెప్పిన నియమం తాము పాటించలేదనీ, అందువలనే తమకి అనుమానంగా వుందనీ లేకపోతే ఖచ్చితంగా తమ కోరిక తీరి వుండేదని ఆ ఇద్దరు స్త్రీలు అన్నారు.

చివరికి అందరూ కలసి రాధికని నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లి రమ్మనీ, వెళ్తే తప్పకుండా తల్లివి అవుతావనీ గట్టిగానూ, నమ్మకంగానూ చెప్పారు.

రాధిక ఎంతో సంతోషించింది. అప్పటికప్పుడే తను తల్లి అయినట్లే భావించింది.





ఎప్పుడెప్పుడు స్వామి ఆశ్రమానికి వెళ్దామా అని రాధిక మనసు ఉవ్విళ్లూరింది.

అంతకు రెండురోజులముందే ఒక బస్సు ఏర్పాటు చేసుకుని ఆ వూరినించి చాలా మంది భక్తులు నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లారు.

బస్సు మాట్లాడి, భక్తుల్ని స్వామి ఆశ్రమానికి పంపించింది నాగభూషణం అనే ఆయన.

ఆ వూళ్లో ముందుగా నీళ్లస్వామిని గురించి పరిచయం చేసిందీ, ప్రచారం చేసిందీ నాగభూషణమే!

అతను ఆశ్రమానికి నెలకి రెండుసార్లు వెళ్లివస్తుంటాడు.

స్వామికి మంచి భక్తుడు. స్వామితో సన్నిహిత సంబంధాలు కూడా ఆయనకి వున్నాయి.

ఆయన భక్తుల్ని బస్సులోపంపించి ఇంటి వద్దనే వున్నాడు. ఆయన కూడా వాళ్ల వెంట వెళ్లేవాడేకానీ స్వంత పనులు వుండటంతో ఆగిపోయాడు.

నాగభూషణం కోసం రాధిక వాళ్ల నాన్న మూడుసార్లు మనిషిని పంపించాడు. అతను ఎక్కడికి వెళ్లాడో తమకి తెలియదని ఇంట్లో వాళ్లుచెప్పారు.

నాగభూషణం మరుసటి రోజు వుదయం రాధిక వాళ్ల ఇంటికి వచ్చాడు.

"ఏంటండీ.. మనిషిని పంపించారట? పనిమీద టౌనుకి పోయి వచ్చేసరికి అర్ధ రాత్రి అయింది. నేను వచ్చిన తరువాత మా ఇంట్లో వాళ్లు చెప్పారు మీరు మనిషిని పంపించారని"

"అవున్రా అబ్బాయి! వూరినుంచి అమ్మాయి వచ్చింది. నీళ్లస్వామి ఆశ్రమానికి అమ్మాయి కూడా వెళ్లివద్దామనుకుంటున్నదిలే!" అని రాధిక తండ్రి విషయం అంతా చెప్పాడు.

"స్వామి వారి గొప్పదనం ఇంతా అంతా

అని చెప్పడానికి వీల్లేదండీ! నిజంగా ఆయన అవతార పురుషుడు! ఆయన వద్దకి వెళ్తే తప్పకుండా పిల్లలు కలుగుతారు. స్వామి ఇచ్చిన తీర్థం సేవిస్తే ఎంత గొడ్రాలు కూడా తల్లికావడం ఖాయం!" తన్మయంగా మైమరచి చెప్పాడు నాగభూషణం.

"నిజంగానా? "

"మరేమిటనుకున్నావమ్మా! పెద్దపెద్ద నాయకులూ, మంత్రులూ, అధికార్లూ, జడ్జీలూ ఎంతోమంది స్వామి వారి దగ్గరకి వస్తున్నారంటే ఎందుకనుకుంటున్నావు? స్వామి వారి మహిమలు అలాంటివి. ఆయన గురించి చెప్పడానికి మాటలు సరిపోవు. వెళ్లిరండి, మీకే తెలుస్తుంది"

"మావూరు వెళ్లిన తరువాత మేం ఇద్దరం వెళ్లివస్తాం!"

"అలాగే వెళ్లిరండి. ఎలాగూ వున్నన్ని రోజులు వున్నారుకదా! ఈ నెల 20వ తేదీ స్వామి వారి జన్మదినం. ఆ రోజున ప్రత్యేక పూజలు జరిపి తీర్థం ఇస్తారు. ఆ రోజు వెళ్లండమ్మా! ఆ రోజు సేవించిన తీర్థానికి ఇక తిరుగు వుండదు"

"అలాగే!" అంది రాధిక ఆనందంగా.

రెండు రోజులు తల్లిదండ్రుల ఇంటివద్దే వుండి, ఇంకా కొన్ని విషయాలు తెలుసుకుని సంతోషంతో పొంగిపోతూ భర్త వద్దకు తిరిగి వచ్చింది రాధిక.

★ ★ ★

రామక్రిష్ణ తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు.

ఆస్తిపాస్తులు బాగానే వున్నాయి. వాళ్లు వుంటున్న పట్టణంలోనే రెండు మేడలు వున్నాయి. వాటి మీద అద్దెలు బాగానే వస్తుంటాయి.

రామక్రిష్ణకి ఇంజినీరింగ్ కోర్సు అయిన తరువాత ఉన్న టౌన్‌లోనే ప్రభుత్వశాఖలో వుద్యోగం వచ్చింది.

రాధిక తల్లిదండ్రులు కూడా బాగా స్థితిమంతులే! చాలా ఎక్కువ కట్నకానుకలతోనే రాధిక వివాహం రామక్రిష్ణతో జరిగింది.

రాధికా, రామక్రిష్ణల దాంపత్యం అన్యోన్య దాంపత్యం!

చక్కటి రంగూ, ఒంపులేని నిండైన విగ్రహం, తీర్చిదిద్దినట్లు వుండే కనుముక్కు తీరుతో రాధిక అందం అపురూపంగా వుంటుంది.

ఒక్కమాటలో చెబితే నిస్సందేహంగా రాధిక అసాధారణ సౌందర్యవతి, ఆమెని తొలిసారిగా చూడటంతోనే రామక్రిష్ణ మరో ఆలోచన లేకుండా ఆమెని చేసుకోవాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు. బిడ్డలు లేరనే విషయంలో మినహా వాళ్ళకి జీవితంలో ఏ విషయంలోనూ అసంతృప్తి అనేది లేదు.

నీళ్లస్వామి వద్దకి వెళ్దామని రాధిక చెప్పిన తరువాత రామక్రిష్ణ ఆ విషయమై చాలామందితో సంప్రదించాడు.

ఆ పట్టణంలో కూడా నీళ్ళస్వామి భక్తులు చాలామంది తటస్థపడ్డారు. వాళ్ళు ఆ స్వామి మహిమల్ని గురించి చిత్ర విచిత్రంగా చెప్పారు.

స్వామి ఇచ్చిన నీళ్ళు సేవిస్తే ఎలాంటి వారికైనా బిడ్డలు పుడతారనే విషయంలో మాత్రం అందరూ ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు.

అందరూ అలా చెప్పిన తరువాత రామక్రిష్ణ వీలైనంత త్వరగా వెళ్దామని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

"ఈ నెల ఇరవైన స్వామివారి జన్మదినమటండీ! మనం అంతకుముందు రోజే చేరుకుందాం! ఒకరోజు ముందు చేరుకుంటే విశ్రాంతి తీసుకుని ఆరోజు ఫ్రెష్‌గా వుండొచ్చు" అంది రాధిక.

తరువాత నాగభూషణం చెప్పిన విషయాలు కూడా వివరించింది.

"సరే" అన్నాడు రామక్రిష్ణ.

సూట్‌కేసులో బట్టలూ, కొంత డబ్బూ సర్దుకుని రామక్రిష్ణ, రాధికా నీళ్లస్వామి ఆశ్రమానికి ప్రయాణం కట్టారు.

ఒంగోలుకి వంద కిలోమీటర్ల దూరంలో వున్న శంకరాపురం అనే గ్రామంలో ఆ స్వామివారి ఆశ్రమం వుంది.

ఉదయానికి ఒంగోలు చేరుకున్నారు. అక్కడి ఆర్టీసీ డిపోవాళ్లు స్వామి వారి భక్తులకోసం ప్రత్యేక బస్సులు ఏర్పాటు చేశారు.

బస్సులు తాళ్లూరు గ్రామం వరకూ వెళతాయి. అక్కడనించి శంకరాపురం మైలు దూరం.

శంకరాపురం గ్రామం మారుమూలన వున్న అతి చిన్న పల్లెటూరు.

స్వామి ఆశ్రమం నెలకొనడానికి ముందు ఆ వూరు ఎక్కడ వుందో ఎవరికీ తెలీదు కూడా.

ఇప్పుడు కూడా ఆ వూరికి సరైన రోడ్డు లేదు. అతుకుల గతుకుల రోడ్డు చిన్నది వుంది.

బస్సులు తాళ్లూరు వరకూ వెళ్తే అక్కడనించి శంకరాపురం నడచి వెళ్లాల్సిందే. ఒంగోలులో తాళ్లూరు వెళ్లే బస్సు ఎక్కారు రాధికా, రామక్రిష్ణా.

గంటన్నర ప్రయాణానంతరం తాళ్లూరులో బస్సు ఆగింది.

బస్సులోనించి భక్తులు దిగారు. కొందరు కొంపలు అంటుకుపోతున్నట్లే నెత్తిన సూట్‌కేసులు పెట్టుకుని స్వామిని ఎప్పుడెప్పుడు చూద్దామా అనే ఆతృతలో శంకరాపురానికి పరుగులు మొదలుపెట్టారు.

రాధికా, రామక్రిష్ణా ప్రయాణ బడలికతో బస్టాండులో వున్న చిన్న హోటల్లో ముఖం కడుక్కుని టీ తాగి నడవడం ప్రారంభించారు.

చిన్నదారి అది. జీపు అతి కష్టం మీద వెళ్తుంది. భారీ వాహనాలు ఏవీ ఆ దారిన వెళ్లలేవు.

దారినిండా చాలామంది భక్తులు తారసపడ్డారు.

కబుర్లు చెప్పుకుంటూ శంకరాపురం స్వామి ఆశ్రమానికి చేరుకున్నారు. అప్పటికే ఆశ్రమానికి కొన్ని వేల మంది భక్తులు వచ్చి ఉన్నారు. అంతా కోలాహలంగా వుంది.

చాలామంది కూలీలు సువిశాల స్థలంలో ఇంకా పందిళ్లు వేస్తూనే వున్నారు.

స్వామివారి పెద్ద కొడుకు బుల్లిస్వామీ, ఆశ్రమ ప్రధాన నిర్వహణా కార్యదర్శి మార్కండేయులు ఏర్పాట్లని పర్యవేక్షిస్తున్నారు.

వచ్చిన భక్తులకి కొందరు మంచినీళ్లు సప్లయ్ చేస్తున్నారు.

భక్తులు ఆ రాత్రి పందిళ్ల కిందనే దుప్పట్లూ, చాపలూ పరుచుకుని పడుకున్నారు.

★ ★ ★

భక్తులతో ఆశ్రమం కిక్కిరిసిపోయి కిటకిటలాడిపోతోంది.

అసంఖ్యాకంగా భక్తులు!

ఎక్కడెక్కడనించో స్వామి వారి దర్శనానికి విచ్చేశారు వ్యయ ప్రయాసలకు ఓర్చి ఆ రోజు స్వామివారి జన్మదిన మహోత్సవం!

ఆశ్రమం పక్కనే వున్న పొలాల్లో విశాలమైన పందిళ్లు వేశారు.

ఆ పందిరి గుంజలకు కొబ్బరి మట్టలూ, అరటి మట్టలూ కట్టారు. మామిడి ఆకులతోనూ, నేరేడు ఆకులతోనూ తోరణాలు వేలాడదీశారు.

రంగురంగుల కాగితాలతో పందిళ్లని





అపూర్వంగా అలంకరించారు.

స్వామివారిని దర్శించుకోవడానికి మంత్రి గారు కూడా వస్తున్నారు.

రాష్ట్రంలో కీలకమైన శాఖలు నిర్వహిస్తున్న మంత్రి ఆయన. ముఖ్యమంత్రికి అతి సన్నిహితంగా మెలుగుతుంటాడు.

జిల్లాకు సంబంధించి ఏ విషయం అయినా ఈ మంత్రి ప్రమేయం లేకుండా జరగదు.

మంత్రిగారు రాకముందే ఆ మంత్రిగారికి రక్షణగా వచ్చి అడుగడుక్కీ ఒక పోలీసు లెక్కన తుపాకుల్తో కాపలా కాస్తున్నారు.

కిక్కిరిసిన ఆ రద్దీలో జేబు దొంగలు హస్తలాఘవాన్ని ప్రదర్శిస్తున్నారు.

ఆశ్రమ ప్రధాన నిర్వాహక కార్యదర్శి మార్కండేయులు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతూ హైరానా పడిపోతున్నాడు.

"ప్రియాతి ప్రియమైన భక్తులారా... మహా శక్తి సంపన్నులూ కలియుగ దైవం, సాక్షాత్తూ ఆ మహా పరమేశ్వరుని ప్రతిరూపం, భక్తులు కోరిన కోర్కెల్ని ఈడేర్చే దివ్యపురుషులూ శ్రీశ్రీశ్రీ నీళ్లస్వామి మహరాజ్ వారి జన్మదినం ఈ రోజు.

"నేడు సుదినం, శుభదినం, మహా పర్వదినం, మహా పవిత్రదినం ఈ రోజు స్వామివారి తీర్థం సేవించిన భక్తుల కోర్కెలు ఖచ్చితంగా నెరవేరుతాయి"

వేదిక మీదనించి స్వామివారి ప్రధాన శిష్యుడు కంచుకంఠంతో మాట్లాడుతున్నాడు. గొంతు గంభీరంగా, పెద్దగా వుంది. భక్తుల భజన గోలలో ఆ మాటలు శృతికలిసిపోతున్నాయి.

మిట్టమధ్యాహ్నం... వేసవి కాలపు ఎండ చండప్రచండంగా నిప్పుల్ని వెదజల్లుతోంది.

భక్తులకి ఇంకా స్వామి వారి దర్శనం కాలేదు.

"ఇప్పుడు స్వామివారు తమ ఆత్మతో దేవలోకంలోని ఆ మహాపరమేశ్వరునితో సంభాషిస్తున్నారు. ఇంకొద్దిసేపట్లో స్వామివారు వైకుంఠంలోని దైవ సన్నిధినించి ఇహలోకం లోనికి ప్రవేశించి మనకి దర్శనం ఇస్తారు. ఈ రోజు స్వామివారి దివ్యమంగళ రూపాన్ని దర్శించిన భక్తులు మహా అదృష్టవంతులు. వారి జన్మ సఫలమవుతుంది. వారి జీవితం ధన్యమవుతుంది. వారికి సర్వసుఖాలూ సమకూరుతాయి"

దాదాపు రెండు గంటలనించీ అతను పెద్ద కంఠంతో చెప్పిన మాటల్నే మళ్లీమళ్లీ చెపుతున్నాడు. మైకు వదిలిపెట్టడానికి మనసు ఒప్పడం లేదుగాబోల్ను అద్భుతంగా అలంకరించిన వేదిక మీదనించి అలా మాట్లాడుతూనే వున్నాడు.

ప్రజలకి స్వామివారి దర్శనం తేలికగా లభించడానికి వీలుగా బాగా ఎత్తుగా వేదికని నిర్మించారు. వేదికమీద స్వామి కూర్చోవడానికి రాజుల సింహాసనాల్ని తలపించే రీతిలోవున్న భారీ సింహాసనం ఏర్పాటు చేశారు.

స్వామివారు దీవిస్తున్నట్లూ, సుఖిస్తున్నట్లూ, కూర్చునీ, అలవోకగా పడుకునీ వివిధ భంగిమల్లో వున్న ఫొటోల్ని వేదిక మీద అలంకరించారు.

స్వామి పాదాలమీద పడి సాష్టాంగ నమస్కారం చేస్తున్న ప్రముఖుల ఫొటోలు కూడా వాటిలో వున్నాయి. పెద్ద పెద్ద అధికార్లూ, న్యాయాధిపతులూ, మంత్రులూ లాంటివాళ్లు ఆ ఫొటోలలో వున్నారు.

"ఈరోజు స్వామివారి తీర్థం పుచ్చుకున్న భక్తుల కోర్కెలు ఫలిస్తాయి. ముఖ్యంగా తమకి పిల్లలు కావాలని కోరుకునే మహిళల ఆశలు తప్పక తీరుతాయి. అంతేకాదు, స్వామివారి తీర్థం కారణంగా గర్భం ధరించి



జనించే శిశువులు మహర్జాతకులవుతారు. వాళ్ళకి ఇక ఎదురుండదు. వాళ్ళు రాజ్యాల్ని ఏలతారు. దేశాల్ని పాలిస్తారు. అంతటి మహోన్నతులవుతారు.

"వెయ్యినూటపదహార్లు కౌంటర్లో చెల్లిస్తే రశీదు ఇస్తారు. ఆ రశీదు తీసుకున్నవారికి స్వామివారి తీర్థం, ఆశీర్వచనం లభిస్తాయి. మీ కోరికలు, ఆశలు అన్నీ తీరతాయి.

"స్వామివారు ప్రత్యేకపూజలు జరిపి, సాక్షాత్తూ కైలాసంలోవున్న పరమేశ్వరునితో మాట్లాడి ఇస్తున్న తీర్థం ఇది. శని చుట్టుకున్నవాళ్ళు ఎవరైనా ఈ తీర్థం సేవిస్తే వాళ్ళకి చుట్టుకున్న శని విరగడైపోతుంది. ఇక శని వాళ్ళ దరిదాపులకి రాదు.

"అలాగే గాలి సోకినవాళ్ళూ, దెయ్యం, భూతం ఆవహించిన వాళ్ళూ ఈ తీర్థం సేవిస్తే వాళ్ళని ఆవహించిన దుష్టశక్తులు ఇరవైఆరు ఆమడల దూరం పారిపోతాయి. ఇక అవి జన్మజన్మలకీ మీ జోలికి రావు. కౌంటర్‌లో డబ్బు చెల్లించి రశీదులు తెచ్చుకున్నవారికే ఈ వరాలు లభిస్తాయి"

కాషాయవస్త్రాలు ధరించిన స్వామి ప్రధాన శిష్యుడు మైకులో చెపుతూనే వున్నాడు.

"మనం కూడా త్వరగా రశీదు తెచ్చుకుందామండీ" రాధిక అంది.

"అలాగే, వెళ్ళి తెస్తాను"

"పదండి నేనూ వస్తాను. ఇక్కడే కదా!" అని రాధిక అనుసరించింది రామక్రిష్ణని.

ఒక చిన్న గదిలో కిటికీలోనించి డబ్బు తీసుకుని రశీదులు ఇస్తున్నారు.

ఇంతలో స్వామివారు వస్తున్నట్లు మైకులో ప్రకటించారు.

జనంలో హాహాకారాలు, ఒక్క పెట్టున పెద్దగా స్వామివారిని స్మరిస్తూ జనంలేచి నిలబడ్డారు. ఒకరిని ఒకరు నెట్టుకుంటున్నారు.

స్వామివారు ఠీవిగా, హుందాగా వేదికమీదకు వచ్చి భక్తులకి చేతితో ఆశీస్సులందచేసి ఆసీనులయ్యారు.

జనం అక్కడ వున్న వాలంటీర్లనీ, పోలీసుల్నీ అందర్నీ ఛేదించుకుని తోసుకుంటూ వేదికమీదకి దూసుకుపోయారు. కొందరు ఎగిరి వేదిక ఎక్కారు.

భక్తజనాల్ని అదుపు చేయడం వాలంటీర్లకి సాధ్యం కాలేదు.

పోలీసులు రంగప్రవేశం చేశారు. లాఠీలతో భక్తుల్ని వెనక్కి నెట్టేస్తూ ఐదు నిముషాల్లో కంట్రోలు చేశారు. వేదికమీదకి ఎవరూ ఎక్కకుండా కట్టడిచేశారు.

రాధికా, రామక్రిష్ణా రశీదు తీసుకువచ్చారు.

రశీదులు తీసుకున్నవాళ్ళు క్యూ కట్టారు.

వాళ్ళలోనించి ప్రధాన శిష్యుడు ఐదుగుర్ని సెలక్ట్‌చేసి వేదికమీదకి తీసుకువచ్చాడు.

"స్వామివారి గొప్పదనాన్నీ, మహాత్మ్యాల్నీ సహించలేని కొందరు స్వార్థపరులు స్వామివారికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారు. అయితే తొందరలో వాళ్ళ పాపం పండుతుంది. వేలాదిమంది భక్తులు ఇక్కడ వున్నారు. మీ అందరి సమక్షంలోనే ఇప్పుడు స్వామివారు మహాత్మ్యాల్ని చూపెడతారు. మీరు అందరూ ప్రత్యక్షంగా స్వామివారి మహాత్మ్యాల్ని తిలకించండి. మంటల్ని నీళ్లు చల్లబరుస్తాయి. అయితే స్వామివారి తీర్థం మంటల్ని సృష్టిస్తుంది. స్వామివారి తీర్థానికి అంతటి శక్తిసామర్థ్యాలు వున్నాయి. అందరూ జాగ్రత్తగా చూడండి!" శిష్యుడు చెప్పాడు.

సింహాసనం మీద ఆసీనులైన స్వామి వేదికమీద నిలబడి వున్న ఐదుగురి వద్దకు వచ్చాడు. స్వామివారి చేతిలో ఒక చెంబు లాంటి పాత్ర వుంది.





"మీరు దోసిలి పట్టండి" అని శిష్యుడు ఇద్దరికి చెప్పాడు.

"మీరు మీ చీర చెంగుని చేతితో పట్టుకోండమ్మా! స్వామివారు మీ చెంగులో తీర్థం పోస్తారు" అని మిగతా ముగ్గురికీ చెప్పాడు.

ఇద్దరి అరచేతిలోనూ, ముగ్గురు చీరచెంగు దోసిట్లో పట్టుకోగా అందులో స్వామి తన చేతిలో వున్న పాత్రలోని తీర్థం పోశాడు.

"ఇప్పుడు అగ్గిపుల్ల వెలిగిస్తాను. ఆ తీర్థం మండుతుంది. మీరేమీ భయపడకండమ్మా! మీకు ఏమీ కాదు. మీ చీరలకి కూడా ఏమీ హాని జరగదు. మీరు నిర్భయంగా వుండండి. మంట మిమ్మల్ని ఏమీ చేయదు అని శిష్యుడు అగ్గిపుల్ల వెలిగించి ఆ ఐదుగురికీ స్వామివారు పోసిన తీర్థంలో అగ్గిపుల్ల పెట్టాడు.

తీర్థం మండసాగింది.

వాళ్ళలో ఇద్దరు ఆ మంటకి భయపడి స్వామివైపు చూశారు.

స్వామి చిరునవ్వులు చిందిస్తూ ఏమీ కాదన్నట్లుగా చేయి అడ్డంగా వూపుతూ అభయహస్తం చూపెట్టారు.

అలా సుమారు మూడు నిముషాలు ఆ మంట వాళ్ళ చేతిలోనూ, చీర చెంగుల్లోనూ మండుతూనే వుంది.

"మీకు ఏమైనా సెగకానీ, వేడిగానీ తగిలిందా?" శిష్యుడు ఆ భక్తుల్ని ప్రశ్నించాడు.

"మాకు ఏమీ కాలేదండీ! కొద్దిగా కూడా వేడి తగల్లేదు" చెప్పారు భక్తులు.

"చూశారా, స్వామివారు ఎంత గొప్ప శక్తి సంపన్నులో! అంతటి మంట కూడా వాళ్ళని ఏమీ చేయలేదు. స్వామివారు ఇస్తున్న తీర్థం ఈ అగ్ని అంత స్వచ్ఛమైనదీ, శక్తివంతమైనదీ, గొప్పదీ!"

భక్తులు మహాసంతోషంతో పెద్దగా స్వామివారి స్మరణ చేశారు.

"స్వార్థపరుల మాటలు ఆలకించకండి. స్వామివారిమీద ఎవరైనా లేనిపోని ప్రచారం చేస్తే వాళ్ళని తరిమి తరిమి కొట్టండి" శిష్యుడు ఆ అశేష భక్తజనావళికి మైకులో బోధించాడు.

భక్తులు ముందుకి నెట్టుకుంటున్నారు.

"రశీదులు వున్నవాళ్ళు నెమ్మదిగా ఒక్కొక్కరూ రండి. స్వామివారి తీర్థం స్వీకరించండి!"

వాలంటీర్లు వేదికమీదకి ఒక్కొక్కర్నే పంపిస్తున్నారు.

వేదిక మెట్ల వద్ద ఒక గంగాళం వుంది. దాన్నిండా నీళ్లు వున్నాయి.

బావి వద్ద తలారా స్నానంచేసి, ఉతుకుపడని నూతన వస్త్రం ధరించి, గంగాళంలోంచి ఒకగ్లాసు నీళ్లు ముంచుకుని భక్తితో స్వామి వద్దకి వస్తున్నారు.

అలా గ్లాసు తీసుకుని వచ్చిన వాళ్ళని స్వామివారు ఆశీర్వదించి, ధ్యానం చేస్తున్నట్లు కళ్ళు మూసుకుని ఆ నీళ్ళలో వేలు ముంచుతున్నారు.

స్వామివారి వేలు ఆ నీళ్లలో పడగానే అవి పవిత్ర తీర్థం అవుతాయి.

శిష్యుడు స్వామి పక్కనే నిలబడి వచ్చిన వాళ్ళతో మాట్లాడుతున్నాడు.

"ఎన్నో వారం అమ్మా రావడం?"

"మూడో వారం స్వామీ!"

"అమ్మాయి కావాలా, అబ్బాయి కావాలా?"

"అమ్మాయి కోసమేనండీ!"

"సరే. ఇక నీవు రానవసరంలేదు. నీ కడుపులో ఇప్పుడు పిండం కదలాడుతోంది. ఇంకో తొమ్మిది మాసాలకి నీవు పండంటి పాపాయిని కంటావు. నిన్ను ఎవరైనా అడిగితే, స్వామివారి తీర్థం కారణంగా నెలతప్పినట్లు చెప్పాలి. ఒకవేళ నెల తప్పకపోయినా

తప్పినట్లే చెప్పాలి"

"గర్భం రాకపోతే వచ్చినట్లు ఎలా చెప్ప మంటారు స్వామీ? " అమాయకంగా ప్రశ్నించింది ఆ ఇల్లాలు.

"అంతేనమ్మా! నీకు ఇప్పుడు నెలతప్పిందని చెపుతున్నాంకదా! మనసులో ఎలాంటి అనుమానాలూ, శంకలూ పెట్టుకోగూడదు. మనసులోనికి ఏమాత్రం అనుమానం వచ్చినా నిజంగానే నీకు నెల తప్పదు! కడుపులో పిండం కడుపులోనే మాయమైపోతుంది. స్వామివారికి అపచారం జరగడం ఆ పరమేశ్వరునికి ఇష్టం వుండదు. అందుకే అనుమానపడినవారి పిండాన్ని మాయం చేస్తాడు" స్వామి శిష్యుడు ఆ మహిళమీద కోపగిస్తూ అన్నాడు.

భక్తులతో మాట్లాడేటప్పుడు మాత్రం మైకు ఆపుతారు.

"నాకు ఎలాంటి అనుమానం లేదు స్వామీ"

"అయితే నీకు తీర్థం కారణంగా నెలతప్పినట్లు అందరికీ తెలియచేయి"

శిష్యుడు మాట్లాడుతుంటే, స్వామివారు మౌనంగానే తల వూపుతున్నారు, 'అలాగే చేయాలి' అన్నట్లు.

అమ్మాయి కావాలనుకునేవారు మూడు వారాలు రావాలి. అబ్బాయి కావాలనుకునే వారు నాలుగు వారాలు రావాలి.

క్రమంగా రాకున్నా, మూడు నెలల వ్యవధిలో వాళ్ళు వారాలు పూర్తి చేసుకోవాలి.

రాధిక కూడా వేదికమీదకి స్వామి వద్దకి వచ్చింది. రాధిక ముందు ఒక భక్తురాలు వుంది.

మొదటిసారి చూస్తే పిల్లలూ, కొత్తవాళ్ళూ భయస్తులూ జడుసుకునే ఆకారం స్వామిది.

పెద్ద పెద్ద కళ్ళూ, తీక్షణమైన చూపులూ! మనిషి భారీ విగ్రహం!

తలజుట్టు బారెడు పొడవునా, గడ్డం జుట్టు మూరెడు పొడవునా పెరిగివుంది.

ఇవ్వాళ స్వాములకీ, సన్యాసులకీ ముఖ్య చిహ్నం జులపాలూ, మీసాల జుట్లూ, గడ్డాల జుట్టూ పెంచుకోవడమే!

పెద్ద పెద్ద దేవుళ్లకి కూడా కావాల్సింది-భక్తులు వాళ్ళ తలనీలాల్ని సమర్పించుకోవడం! అలా తలనీలాలు సమర్పించుకుంటే సమస్త పాపాలూ పరిహారం కావడమే గాకుండా బోలెడు పుణ్యం కూడా ప్రాప్తిస్తుంది.

రాధిక ముందు వున్న భక్తురాలు బూచాడికిమల్లే వున్న స్వామివారి పాదాలమీద బోర్లాపడింది.

స్వామి ఆమెని చేతుల్తో దీవించాడు.

"లేమ్మా! లే... నీ కోరిక ఏమిటో చెప్పుకో స్వామివారికి" శిష్యుడు అడిగాడు.

"నాకు బిడ్డలు కావాలి స్వామీ"

"తప్పకుండా కలుగుతారు తల్లీ! అమ్మాయి కావాలా, అబ్బాయి కావాలా? "

"ఎవరైనా పర్లేదు స్వామీ! నాకు ఇంతకు ముందు ఇద్దరు పిల్లలు వున్నారు. వాళ్ళు పెళ్ళికి వెళ్తూ జీపు ప్రమాదంలో పోయారు స్వామీ! ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత ఇక వద్దనుకుని పెద్దాపరేషను చేయించుకున్నా స్వామీ! గర్భసంచి తీసివేశారు. నా కడుపుశోకం చెప్పలేను స్వామీ! నాకు ఒక్క బిడ్డని అయినా ప్రసాదించండి స్వామీ" ఆమె పెద్దగా రోదిస్తూ స్వామివారి పాదాల మీద పడుతూ, లేస్తూ అంది.

"తప్పకుండా నీకు స్వామివారు బిడ్డని ప్రసాదిస్తారమ్మా! అయితే నువ్వు ఎనిమిది వారాలు రావాలి"

"ఎనిమిది వారాలు కాదు, మీరు ఎన్ని వారాలు రమ్మంటే అన్ని వారాలు వస్తాను స్వామీ!"





"ఎన్నో వారాలు వద్దమ్మా! ఎనిమిదివారాలు చాలు. అయితే ఎవరు అడిగినా మాత్రం గర్భం వచ్చిందని చెప్పాలి. అన్నిటి కంటే అది ముఖ్యం! గర్భం వచ్చిందనే నమ్మకం నీకు ఏర్పడితేనే ఆ గర్భం నిలుస్తుంది. భక్తితో కళ్ళు మూసుకుని ఈ తీర్థం స్వీకరించమ్మా! వెళ్ళిరా"

ఆమె సంతోషంతో వేదిక దిగి వెళ్ళిపోయింది.

రాధికకి ఆ మాటలు వింటే ఎంతో ఆశ్చర్యం వేసింది.

బిడ్డలు ఇక కలగకుండా పెద్దాపరేషను జరిగిందంటోంది. అలాంటి మనిషికి మళ్ళీ ఎలా పిల్లలు పుడతారు?

మొత్తానికి స్వామివారు ఘటికులు, చాలా గొప్పవారు అనుకుంది రాధిక.

తరువాత వంతు రాధికదే.

ఆమె కూడా స్వామివారి పాదాలకి వంగి నమస్కరించింది.

వంగి కాళ్ళకి దండం పెడుతున్న రాధికని స్వామి రెండు చేతులూ పట్టుకుని పైకి లేవతీశారు. స్వామి ఎవర్నీ అలా పైకి తీయరు. నెమ్మదిగా వాళ్ళే లేస్తారు. రాధికని లేపి అలాగే కళ్లు ఆర్పకుండా ఆమెవైపు చూడసాగాడు స్వామి.

"ఏమిటమ్మా కోరిక? "

"బిడ్డ కావాలి స్వామీ"

"అమ్మాయా, అబ్బాయా? "

"అబ్బాయి కావాలి స్వామీ"

"అయితే నాలుగు వారాలు రావాలమ్మా! ఈ వారంగాక ఇంకా మూడు వారాలు రావాలి"

"వస్తాను స్వామీ"

"వచ్చే ఏడాది మళ్ళీ స్వామివారి జన్మదినం నాటికి నీవు పండంటి బిడ్డని చంకన వేసుకుని ఇక్కడికి రావాలి"

"అంతకంటే మహాభాగ్యం ఏముంది స్వామీ!" ఆనందంగా అంది రాధిక.

"నియమనిష్ఠలతో ఇంకా మూడు వారాలు స్వామివారిని దర్శించుకుంటే తప్పక మీకు బిడ్డ కలుగుతాడు. అయితే నీవు ఒక్కదానివే కాదు. నీతోపాటు మరొకరికి కూడా స్వామివారి కటాక్షం లభిస్తుంది. అదృష్టం అంటే అదే! ఈ మూడు వారాల్లో మరో భక్తురాలిని కూడా తీసుకురావాల్సిన బాధ్యత నీమీద వుందమ్మా!"

"అలాగే ప్రయత్నిస్తాను స్వామీ"

"అపచారం అమ్మా అలా అనకూడదు. ప్రయత్నించడం ఏమిటీ, తప్పకుండా మరొకర్ని తీసుకువస్తేనే నీకు కూడా స్వామివారి ఆశీర్వచనం ఫలిస్తుందమ్మా!"

"అలాగే స్వామీ" వినమ్రంగా అంది రాధిక.

రాధిక వేదికమీద వున్న సమయంలోనే హారన్లు మోగించుకుంటూ వరుసగా ఐదు కార్లు వచ్చాయి.

మంత్రిగారు వేంచేశారు.

జనంలో కలకలం మొదలైంది.

"మీరందరూ వేదికమీదనించి దిగాలమ్మా" అని వేదికమీద వున్న భక్తులు అందర్నీ పోలీసులు దింపారు.

ముందు నలుగురు పోలీసులూ, వెనుక నలుగురు పోలీసులూ తుపాకులూ, స్టెన్‌గన్‌లూ పట్టుకుని వుండగా మంత్రి శివలింగంగారు వేదిక ఎక్కారు.

వేదిక ఎక్కుతూ శివలింగం వేదిక దిగివెళ్తున్న రాధికని చూశాడు.

"ఎంత గొప్ప అందగత్తె! సృష్టిలో ఇంత గొప్ప సౌందర్యం వుంటుందా? " అనుకున్నాడు శివలింగం.

అలా అనుకుంటూనే ముందుకు వెళ్ళి స్వామికి సాష్టాంగ ప్రణామం చేశాడు.

స్వామివారు మంత్రిని దీవించారు.

"ఇప్పుడు స్వామివారిని గురించి మంత్రి గారు నాలుగు మాటలు మాట్లాడతారు" అని ప్రధాన శిష్యుడు మైకులో ప్రకటించాడు.

మంత్రిగారు పది నిముషాలు అనర్గళంగా స్వామిని పొగుడుతూ ఉపన్యాసం చెప్పాడు.

డబ్బు చెల్లించి రశీదులు తీసుకున్న భక్తులు ఇంకా కొంతమంది వున్నారు.

మంత్రిగారికి వేదికమీద మరో ఆసనం ఏర్పాటు చేశారు.

ఒక్కో భక్తురాలు వస్తుంటే, స్వామి నీళ్లలో వేలు ముంచి పంపిస్తున్నాడు.

కొంత సేపటికి రశీదులు తీసుకున్న భక్తులు అందరూ అయిపోయారు.

తరువాత స్వామి అభివాదం చేసి నిష్క్రమించారు.

స్వామివారికి కైలాసంలోని పరమేశ్వరుడి నించి పిలుపు రావడంతో వారితో సంభాషించడానికి ఆంతరంగిక మందిరంలోనికి వెళ్ళారని మైకులో శిష్యుడు చెప్పాడు.

మంత్రిగారు కూడా తనకి కేటాయించిన విశ్రాంతి మందిరంలోనికి వెళ్ళారు.

★ ★ ★

రహస్యమందిరంలో.

మంత్రిగారు సుతిమెత్తని కుర్చీలో కాలు మీద కాలు వేసుకుని ఆసీనులై వుండగా, అక్కడ వున్న బల్లమీద స్వామివారు ఒదిగి ఒదిగి భయభక్తులతో కూర్చుని వున్నారు.

"మొత్తానికి వ్యాపారం బాగానే నడుస్తున్నట్లుంది కదా?" మంత్రి శివలింగం అడిగాడు.

"వ్యాపారం ఏముందిలే సార్! ఏదో మీ పుణ్యాన" నిత్యం వేలాదిమంది భక్తుల పూజలందుకుంటూ వారి సేవలతో పునీతులవుతున్న స్వామివారు నసుగుతూ అన్నాడు.

"నా పుణ్యం ఏముందిలేరా ఇందులో? తెలివి నీది, కష్టం నీది! నేనేం చేశాను మధ్యలో?"

"అయినా మీలాంటి మహానుభావుల అండదండలు లేకపోతే నేను ఇంతవాణ్ణి అయివుండేవాడిని కాదు సార్!"

"మొత్తానికి అసాధ్యుడివే. వేలాదిమంది ప్రజల్ని నీ చుట్టూ తిప్పించుకుంటున్నావు. వాళ్ళందరితో పూజలు అందుకుంటున్నావు. జోరుగా సంపాదిస్తున్నావు. గ్లాసునీళ్ళ ఖరీదు వెయ్యానూటపదహార్లా? ఇవ్వాళ బాగానే వచ్చి వుంటుందికదా ఆదాయం?"

"అవుననుకోండి. ఆశ్రమాన్ని ఇంకా వృద్ధి చేయాలి సార్! ఈ ఆశ్రమం ఏమాత్రం సరిపోవడంలేదు. కొత్త ఆశ్రమానికి మీరు సహకరిస్తేనే పని జరుగుతుంది. ఆశ్రమాన్ని బాగా విస్తరింపచేయాలి. ఒక సిమెంట్ కంపెనీవాళ్ళు ఆశ్రమానికి అవసరమైన బిల్డింగ్ ఒకటి కట్టి పెడతామంటున్నారు. ఐదారుగురు బిజినెస్ మ్యాన్లు కూడా తమ వంతుగా కొన్ని బిల్డింగ్‌లు కట్టిపెడతామంటున్నారు."

"ఏం చేసుకుంటావురా ఇన్ని బిల్డింగులూ?"

"ముందు ముందు చాలా అవసరాలు వున్నాయి సార్! ప్రస్తుతం మంచి స్థలం చూడాలి!"

"ఎక్కడ చూడాలంటావు?"

"ఈ వూళ్ళోనే ఏటిఒడ్డున పొలం కొని ఆశ్రమం నిర్మించాలని వుంది సార్!"

"ఎంత పొలం కావాలేమిటి?"

"నలభై యాభై ఎకరాలు సార్"

ఆ మాట వినడంతోనే మంత్రి శివలింగానికి మూర్ఛ వచ్చింది.





"ఏమిటీ? " ఆశ్చర్యంనించి తేరుకుంటూ అన్నాడు.

"అవును సార్. నలభై యాభై ఎకరాలు కొని, దేశంలో వున్న అన్నిరకాల ఫలజాతుల మొక్కలూ నాటి మధ్యలో ఆశ్రమం బిల్డింగులు నిర్మిద్దామని ఆలోచన సార్"

"చాలా పెద్ద ప్లాను వేశావు"

"ఆశ్రమ కార్యకలాపాలు విస్తరించాలంటే అంతమాత్రం స్థలం లేకపోతే ఉపయోగం లేదు. ఒక్క ఆశ్రమమే కాదు, ఆ ప్రాంగణంలో ముందు ముందు రకరకాల సంస్థలు వెలుస్తాయి. అవసరమైతే ఒకేసారి ఇంకో ఇరవై ఎకరాలు అయినా కొని, పండ్లతోటలు వేసి మధ్యలో అవసరమైన బిల్డింగులు కట్టుకుందాం"

"అయితే నన్నేం చేయమంటావు? "

"పొలం కొనుగోలుకి అవసరమైన సహాయం చేయాలి. అవసరమైతే కొంత డబ్బు బ్యాంకులనించీ, ఫైనాన్సు సంస్థల నుంచీ అప్పుగా ఇప్పించాలి. ఏటినించి మన పొలానికి లిఫ్ట్ ఇరిగేషన్ ప్రభుత్వం మంజూరు చేయాలి"

"మన ఆశ్రమం ఒక్కదానికే లిఫ్ట్ అంటే..."

"ఆశ్రమం ఒక్కదానికే కాదు. ప్రభుత్వం రైతుల పొలాలకి లిఫ్ట్ ఇరిగేషన్ ఏర్పాటు చేస్తే అది మనం ఉపయోగించుకుంటాం. నిర్మించేది మనకోసం అయినా పేరు రైతుల కోసం. వాళ్ళు కూడా కొద్దీ గొప్పా ఉపయోగించుకుంటారనుకోండి"

"గట్టి బుర్రేరా నీది" మంత్రి శివలింగం స్వామిని ప్రశంసించాడు.

" సరే ఈ రాత్రికి వుండమంటావా, వెళ్ళమంటావా? "

"ఆశ్రమానికి వేలాదిమంది వచ్చారు. ఇవ్వాళ కష్టం సార్"

"ఉదయం నేను వచ్చినప్పుడు నీ సమక్షంలో వుంది చూడూ బ్లూకలర్ పట్టుచీర కట్టుకుని. చాలా వండర్‌ఫుల్ ఫిగర్రా. నేను ఇంతవరకూ అలాంటి కలర్‌నీ, ఫిగర్‌నీ చూడలేదు. ఆమెని ఎలాగయినా దారిలో పెట్టాల్రా"

"అసలు వాళ్ళు ఎవరో, ఏమిటో మనకి ఏమీ తెలియదు సార్. తెలియకుండానే"

"పర్లేదు. తెల్సుకుని రెడీ చేయండి. ఈ రోజుకి పస్తేనా? "

"ఏమీ అనుకోకండి సార్. మీరు గట్టిగా మాట్లాడితే చేయగలిగింది ఏమీ లేదనుకోండి సార్. కొత్త ఆశ్రమం నిర్మించినప్పుడు మీ కోసం అన్ని సౌకర్యాలతో ఒక బిల్డింగ్ నిర్మించి వుంచుతాం సార్"

"ఆ పని చేస్తానంటావా? "

"తప్పకుండా సార్. మీ కోసం ఒక్క బిల్డింగే కాదు, మీరు కోరినవన్నీ ఎరేంజ్ చేసి వుంచుతాం సార్ అందులో!"

"సరేకానీ..." మంత్రి శివలింగం అన్నాడు.

స్వామివారు ఏర్పాటు చేసిన ప్రత్యేక విందు భోజనం అనంతరం వాతావరణం బాగా చల్లబడిన తరువాత మంత్రి శివలింగం తన మందీమార్బలంతో వెళ్ళిపోయారు.

మొదట్లో స్వామి ఆదివారం ఒక్కరోజే భక్తులకి తీర్థం ఇచ్చేవాడు.

తీర్థం అంటే నీళ్లు మాత్రమే.

భక్తులు బోరింగ్ పంపు దగ్గరనించో, స్వామివారి గది బయటవుంచిన గంగాళం నించో ఒక గ్లాసు నీళ్లు స్వామివారి వద్దకి తీసుకుపోతారు.

ఆ నీళ్లలో స్వామి వేలు ముంచుతాడు. అంతే! ఆ నీళ్లు పవిత్ర తీర్థం అయిపోతాయి.

ఇక ఆ తీర్థానికి అద్భుతమైన మహత్యం

లభిస్తుంది.

ఆ తీర్థం సేవిస్తే పిల్లలు లేని వాళ్ళకి పిల్లలు పుడతారు. ఎంతటి భయంకరమైన రోగాలైనా తుడిచేసినట్లుగా ఇట్టే మాయమై పోతాయి. భక్తులు కోరిన ఎంత పెద్ద కోరికలైనా తీరిపోగలవు.

అన్నీ... ఆర్థిక సమస్యలూ, కుటుంబ సమస్యలూ, వ్యక్తిగత సమస్యలూ సమస్తం ఆ తీర్థంవలన పరిష్కారమవుతాయని వేలాది భక్తుల ప్రగాఢ విశ్వాసం!

ఆదివారం ఒక్కరోజే తీర్థం ఇస్తుండడంతో భక్తుల రద్దీ విపరీతంగా అయిపోయింది.

ఫలితంగా స్వామివారికి బాధలు చెప్పుకుని తొలగించుకుందామని ఎంతెంతో దూరంనుంచి వచ్చిన భక్తులు స్వామితో మాట్లాడే అవకాశం లభించక నిరాశతో వెనుదిరిగిపోతున్నారు.

స్వామివారి తీర్థం, దీవెనలు వాళ్ళని సంతృప్తి పరచలేకపోతున్నాయి.

కార్లు వేసుకుని వచ్చే భక్తులకి స్వామివారు ప్రత్యేక టిక్కెట్లమీద దర్శనం ఇస్తారు. వాళ్ళతో ముచ్చట్లు పెట్టుకుంటారు. వాళ్ళకి సకల మర్యాదలూ సౌకర్యాలూ లభిస్తాయి.

పూర్తిగా వీక్షించలేకపోతున్నందుకు సాధారణభక్తులు అసంతృప్తి చెందటాన్ని స్వామివారు కూడా గ్రహించారు. స్వామివారితో ఇదే విషయమై కొందరు సన్నిహిత భక్తులు కూడా మాట్లాడారు.

సౌకర్యాలు లేవు. వసతులు లేవు. కనీసం కూర్చోవడానికి వసతి కూడా చాలనంతగా ఆదివారం భక్తుల రద్దీ పెరిగిపోతోంది.

ఈ రద్దీని తట్టుకోవడానికి వీలుగా స్వామివారు గురువారంకూడా భక్తులకి దర్శనం, తీర్థం ఇవ్వడం ప్రారంభించారు.

ఆర్టీసీవాళ్ళు ఆదివారమే గాకుండా గురువారం కూడా భక్తులకోసం ప్రత్యేకంగా పదుల సంఖ్యలో బస్సులు నడుపుతున్నారు.

★ ★ ★

స్వామివారి జన్మదినంనాడు వచ్చి తీర్థం తీసుకున్న రాధికా, రామకృష్ణా మళ్ళీ రెండో సారి తీర్థంకోసం మూడో ఆదివారం ఆశ్రమానికి వచ్చారు.

అక్కడ వారికి ఆడంబరంగా అనిపించేట్లు అతిగా అలంకరించుకున్న ఓ నడివయసు స్త్రీ పరిచయమైంది.

"ఏవూరు మీది? " అని ఆమె ముందు రాధికని అడిగింది.

చెప్పింది రాధిక.

"మీవారు ఏంచేస్తుంటారు? "

"ఆర్ అండ్ బిలో ఇంజనీరు"

"మంచి వుద్యోగమే కదా! అలాంటి డిపార్ట్‌మెంట్‌లో జీతం కంటే పైన ఆదాయం ఎక్కువ వస్తుందనుకుంటాను"

"దాందేముందిలే!" అని నవ్వింది రాధిక.

"మీరు స్వామివారి వద్దకి ఏం కోరిక తీర్చుకోవడం కోసం వచ్చారు? "

చెప్పింది రాధిక.

"స్వామివారి తీర్థం భక్తితో సేవించినవారికి పిల్లలు పుట్టకుండా వుండే ప్రశ్నేలేదు. అంత గొప్ప మహిమ ఈ తీర్థానికి వుంది. మా వూళ్ళో స్వామివారి పుణ్యాన తీర్థం సేవించి పదీ, పన్నెండుమంది తల్లులు అయ్యారు. ఇంకా కొందరు తల్లులు కాబోతున్నారు"

"నిజమా? "

"ఇందులో అబద్ధం ఏం వుంది? నా పేరు సౌజన్య! మావారు పెద్ద డాక్టరు. అయినా నాకు వచ్చిన జబ్బుని ఆయన ఏం




తగ్గించగలిగారు? ఆయనేకాదు, అసలు వైద్యమే తగ్గించలేకపోయింది!"

"మీకు ఏం జబ్బు?" రాధిక ఆశ్చర్యంగా అడిగింది.

"చెబితే మీరు నమ్మరు. నాకు క్యాన్సర్ జబ్బు వచ్చింది!"

"క్యాన్సరా?"

"అవును. చాలా క్యాన్సర్ ఇన్స్టిట్యూట్స్‌లో చూపెట్టుకున్నాను. చాలా డబ్బు ఖర్చయింది. మావారు మంచినీళ్ళ మాదిరిగానే నా జబ్బుకోసం డబ్బు ఖర్చుచేశారు. మేం తిరగని నగరం లేదంటే నమ్మండి. చివరికి మద్రాసు ఇన్స్టిట్యూట్‌లో నువ్వింకా నెలరోజులకంటే ఎక్కువకాలం బతకవన్నారు!"

"అయ్యోపాపం!" సానుభూతిగా అంది రాధిక.

"మనం చేసేదేముంది? జీవితంమీద ఆశ పూర్తిగా వదులుకున్నాను. మాకు తెల్సినవాళ్ళు ఈ స్వామివారి వద్దకి వెళ్ళి ప్రయత్నించి చూడమని సలహా ఇచ్చారు. ఎలాగూ తొందరలో పోయే ప్రాణమే కదాని ఇక్కడికి వచ్చాను. ఆరునెలలు అయింది. నాకు క్యాన్సరు శుభ్రంగా తగ్గిపోయింది. నేను ఇప్పుడు పూర్తి ఆరోగ్యవంతురాల్ని! స్వామివారు నాకు తిరిగి ప్రాణం పోశారు. నాకు ఇది మరో జన్మ!" తన్మయంగా, కళ్ళలోనుంచి ఆనంద భాష్పాలు వస్తుండగా చెప్పిందామె!

ఆమె మాటలతో రాధికకి స్వామివారి మీద ఇంకా గౌరవం, భక్తీ కలిగాయి.

"చూడడానికి ఎంత సాదాసీదాగా వుంటారు! ఎంత గొప్ప శక్తి సంపన్నులో కదండీ స్వామివారు!" రాధిక భర్తతో అంది.

"చాలా గొప్పవారమ్మా!" సౌజన్య, రాధికకి సపోర్ట్‌గా అంది.

"మీరు ఎక్కువగా వస్తుంటారా ఇక్కడికి?" రామక్రిష్ణ ఆమెనడిగాడు.

"స్వామివారిని నిత్యం దర్శించుకోవాల్సిందే! రోజూ స్వామివారిని చూసి తరించనిదే నా మనసు వూరుకోదు. మావారు బోలెడు సంపాదించారు. ఇంటివద్ద నేను సర్వసుఖాలూ అనుభవించవచ్చు! నాకు వేటికీ కొరతలేదు. అక్కడ డబుల్ కాట్స్ మీద ఎయిర్‌కూలర్ ఆన్‌చేసి పడుకోవడం కంటే ఇక్కడ కటికనేలమీద పడుకోవటమే నాకు ఆనందం కలిగిస్తుంది"

"స్వామివారి జన్మదినం నాడు మేం వచ్చాం. అప్పుడు కనబడిన వాళ్ళు మళ్ళీ ఇప్పుడు కొందరు కనబడుతున్నారండీ!"

"మేం పన్నెండుమందిమి ఎక్కువగా ఆశ్రమంలోనే ఉంటాం. ఆశ్రమమే మా నివాసం అయిపోయింది. భజనలు చేస్తూ, స్వామివారిని సేవిస్తూ ఇక్కడే గడుపుతుంటాం. ఎప్పుడో ఒకసారి చుట్టపుచూపుగానే ఇళ్ళకి వెళ్ళి పిల్లల్ని చూసుకుని వస్తాం" అంది సౌజన్య.

"రాధీ... స్వామివారి దయవలన మనకి ఒక బిడ్డ కలిగితే నువ్వు నన్ను వదిలేసి ఇక్కడే వుండిపోవుగదా?"

"ఛీ... వూరుకోండి, మీరూ మీ హాస్యాలూనూ! మీకంటే ఎక్కువ అవుతారేమిటి నాకు ఎవరైనా? నేను ఎలా వుంటాను ఇక్కడ? నా దేవుడు మీరే!" అంది రాధిక.

"స్వామివారికి పోయినసారి ఎంత దక్షిణ సమర్పించారు?" కొద్దిసేపు తరువాత సౌజన్య అడిగింది.

"వెయ్యినూట పదహార్లు!"

"అప్పుడు రశీదు పద్ధతి వుంది. జన్మదినం రోజు ఎక్కువమంది భక్తులు వస్తారు, రద్దీ ఎక్కువని రశీదు పద్ధతి పెట్టారు. స్వామివారు డబ్బు అడగరు కానీ, ఇప్పుడు కూడా దక్షిణ సమర్పించుకుంటే మనకే మంచిది. స్వామివారి చల్లని చూపు

మనమీద పడితే ముత్యాల్లాంటి బిడ్డలు పుడతారు"

"ఇప్పుడు స్వామివారికి ఎంత ఇస్తే బాగుంటుంది? "

"పోయినసారి వెయ్యి నూటపదహార్లు కదా! ఈసారి అందులో సగం అర్ధవెయ్యి నూటపదహార్లు సమర్పించండి. స్వామివారు మంచిగా చూస్తారు. పుట్టే పిల్లలు స్వామివారి అంశతో గొప్ప జాతకులు అవుతారు"

"ఏమండీ, ఏమంటారు? " రాధిక భర్త వైపు చూసింది.

"అదేం పెద్దవిషయం రాధీ... అలాగే ఇద్దాం"

ఆమెని చూస్తే డాక్టరుగారి భార్య అని నమ్మడం కష్టం. చాలా మొరటుగా వుంది. చౌకబారు అలంకరణలు చేసుకుంది. వంటి నిండా తలనించి కాలివరకూ గిల్ట్‌నగలు అలంకరించుకుంది.

తమలపాకులూ, పొగాకూ కలిపిన వుండలు నములుతోంది.

రాధిక తీర్థం సేవించింది. తరువాత ఇరువురూ వాళ్ళ వూరు వెళ్లిపోయారు.



రెండు నెలలు గడిచిపోయాయి.

"ఏమండీ... మీకో గుడ్‌న్యూస్ చెప్పనా? "

రాత్రి మంచం ఎక్కిన రామక్రిష్ణమీద చేయివేసి దగ్గరకి లాక్కుంటూ రాధిక అంది.

"గుడ్‌న్యూసా... అవునా... హోయ్ హోయ్" రామక్రిష్ణ ఆనందంగా అరిచినట్లే అన్నాడు.

"పెద్ద తెలిసినట్లు... అయితే ఏమిటో చెప్పండి మరి? "

"చెప్పనా? "

"చెప్పండి"

"మనకి త్వరలో ఓ బాబు..."

"ఎలా వూహించారండీ? " సిగ్గుపడిపోతూ రాధిక.

"మనమంటే ఏమనుకున్నావు? "

"పోదురూ బడాయి!ఎలా కనిపెట్టారు? "

"సింపుల్"

"ఏమిటి సింపులూ సింగినాదమూ... చెప్పండీ"

"పిచ్చి రాధీ... మనకి గుడ్‌న్యూస్ ఏముంటుంది అంతకుమించి? "

"నాకు ప్రతినెలా కరెక్ట్ డేట్‌కే మెన్సెస్ వస్తుందండీ! ఎప్పుడో ఒక నెలలో ఒకరోజు అటుఇటుగా తేడా వస్తుంది కానీ ఎక్కువ రోజుల తేడా వుండదు. ఇప్పుడు దాదాపు నెలరోజులపైనే అవుతోంది."

"అప్పుడే కరెక్ట్‌గా చెప్పగలమా? "

"అయి వుండొచ్చని ఆశ! మళ్ళీ ఒకసారి స్వామివారి ఆశ్రమానికి వెళ్ళొద్దామండీ! నాలుగోవారం కూడా వెళ్ళివస్తే సరిపోతుంది"

"వెళ్దాం రాధీ... రేపటి ఆదివారమే ఖచ్చితంగా వెళ్దాం. వెళ్ళకపోతే ఎలా? "

"స్వామివారికి గొప్ప మహిమలు వున్నాయండీ! నిజంగా మహానుభావుడే ఆయన. మన ఆశ ఫలించి, మనకి బిడ్డపుడితే స్వామివారికి మంచి విలువైన వస్తువు ఏదైనా ఒకటి ఇస్తామని మొక్కుకుందామండీ!"

"అలాగే చేద్దాం రాధీ"

"మనల్ని మరో మనిషిని కూడా తీసుకు రమ్మన్నారు. పిల్లలు లేనివాళ్ళో, ఏదైనా జబ్బు వచ్చినవాళ్ళో ఎవరైనా వున్నారేమో చూడండి. మనం తీసుకుపోదాం"

"మా ఆఫీసులో అటెండర్ గోపాలం





వాళ్ళ అమ్మకి పక్షవాతం వచ్చింది. మందులు వాడుతున్నా పెద్దగా వుపయోగం లేదని మొన్న అన్నాడు. స్వామివారి వద్దకి తీసుకువస్తే మంచి ఫలితం వుంటుందని అతనికి చెపుతాను"

"అతన్ని గట్టిగా వప్పించి తీసుకురండి. మనతోపాటు తీసుకుపోదాం. స్వామివారు చెప్పినమాట మనం నెరవేర్చినట్లు వుంటుంది మరొకర్ని తీసుకుపోతే" రాధిక అంది.

మరుసటిరోజు ఆఫీసులో రామక్రిష్ణ అటెండర్ గోపాలానికి నీళ్ళస్వామి దైవత్వాన్ని గురించి వర్ణించి కథలుకథలుగా చెప్పాడు.

"ఇప్పటికే చాలా డబ్బు ఖర్చుపెట్టామండీ! మళ్ళీ అక్కడికి వస్తే ఇంకొంత డబ్బు ఖర్చు అవుతుంది. మేం అంత డబ్బు భరించాలి కదండీ"

"డబ్బు దగ్గిర ఆలోచిస్తే ఎలా గోపాలం? డబ్బుదేముంది? వస్తుందీ, పోతుందీ! మనుషులు రమ్మంటే వస్తారా? "

"అవుననుకోండి"

"మీ అమ్మని అక్కడికి తీసుకురా! ఆమె జబ్బుని తగ్గించే పూచీమాది. నువ్వు ఏం శంకపెట్టుకోవద్దూ, అనుమానం పెట్టుకోవద్దూ! తప్పకుండా రండి" రామక్రిష్ణ అన్నాడు.

గోపాలం అంత గాఢంగా దేవుడ్ని నమ్మడు. దేవుడు లేడనీ వ్యతిరేకించడు. అతను ఆస్తికుడే. అయితే పూజలూ, వ్రతాలూ లాంటివి చేసే మనిషికాదు.

"సరే, ఇంటిదగ్గర అమ్మనీ, నా భార్యనీ అడిగి చెపుతానండీ. వాళ్ళు ఏమంటారో? "

"డబ్బులేదని వాళ్ళు భయపడతారేమో! నువ్వు కూడా డబ్బు విషయం మనసులో పెట్టుకోవద్దు. మీకు అవసరమైన డబ్బు నేను ఇస్తా. ఎరియర్స్ వచ్చినప్పుడో, మరొకప్పుడో నా డబ్బు తిరిగి ఇవ్వవచ్చు" రామక్రిష్ణ అన్నాడు.

ఆ తరువాత రోజు గోపాలం "ఓకేసార్! అమ్మా, మా మిసెస్ ఇద్దరూ నీళ్ళస్వామి ఆశ్రమానికి వెళ్ళొద్దామన్నారు. మనీ మీరు ఎడ్జెస్ట్ చేస్తారని చెప్పాను సార్. డబ్బు మాత్రం నా దగ్గిర వున్నప్పుడే మీకు ఇవ్వగలను సార్. ఇప్పటికే నేను బాగా అప్పుల్లో వున్నాను. మీకు అవసరమైనప్పుడు నా డబ్బు తిరిగి ఇవ్వమని అడిగితే నేను ఇవ్వలేను. ముందే చెపుతున్నాను సార్"

"సరేకానీ, అలాగే చెయ్! నీ దగ్గిర వున్నప్పుడే తిరిగి ఇవ్వు"

గోపాలం మనిషి మంచివాడు. అతని పరిస్థితి బాగుంటే తిరిగి ఇస్తాడు. అసలు గోపాలం డబ్బు తిరిగి ఇవ్వకపోయినా తనకి బాధలేదు. నీళ్ళస్వామి వద్దకు వస్తున్నాడు అంతేచాలు.

"బాగోలేని మనిషిని తీసుకుని బస్సుల్లో ప్రయాణించడం ఇబ్బందిసార్. మేం ఏదైనా అద్దెకారు మాట్లాడుకుని వస్తాం!"

"అలాగే చేయండి. మేం శనివారం ఉదయం బయల్దేరి వెళతాం. శనివారం రాత్రికి ఆశ్రమంలోనే వుంటాం. మీరు ఆదివారం వేకువన బయలుదేరివచ్చినా చాలు. సాయంత్రానికి చేరుకోగలిగినా దర్శనం, తీర్థం అన్నీ లభిస్తాయి"

"అలాగే సార్!"

"మీరు అక్కడికి వచ్చి ముందు మమ్మల్ని కలవండి. స్వామివారి దగ్గరికి మేం తీసుకుపోతాం"

"అలాగేసార్! అంతకంటే ఇంక కావాల్సిందేం వుంది? " గోపాలం అన్నాడు.

★ ★ ★

**శయన మందిరంలో పట్టుపరుపులమీద** ప్రశాంతంగా పవళించి ఉన్నారు స్వామి



వారు. వారి శరీరం మీద పెద్దగా బట్టలు లేవు.

కుడి ఎడమల సౌజన్యా, మరో స్త్రీ సుగుణా కూర్చుని స్వామివారి కాళ్ళు వత్తుతూ, సపర్యలు చేస్తున్నారు.

ఆశ్రమంలో స్వామివారివద్ద పన్నెండు మంది శిష్యురాళ్ళు ఉన్నారు. వాళ్ళలో రోజుకి ఇద్దరి వంతున స్వామివారికి సేవలు చేయాలి.

"అయితే మనగురించి ఏమనుకుంటు న్నారే? " అడిగారు స్వామివారు.

"మీ గొప్పదనం అంతా ఇంతా కాదని జనం పొగుడుతున్నారు అయ్యగారూ! రోజు రోజుకీ వచ్చేవాళ్ళు పెరుగుతున్నారు. ముందుముందు జనం ఇంకా బాగా వస్తారు అయ్యగారూ!" సుగుణ అంది.

"ఛత్ అయ్యగారూ ఏమిటే? ఎన్నిసార్లు చెప్పాను అలా పిలవొద్దని! అలవాటు ప్రకారం రేపు భక్తులముందు కూడా అలాగే పిలిస్తే ఏం కావాలి? స్వామీ అని పిలవలే వటే? " స్వామివారు శిష్యురాలిమీద విసు క్కున్నారు.

ఎక్కువగా స్వామివారి వెంట వుంటూ సకల పరిచర్యలు చేస్తున్న ఆ శిష్యురాళ్ళకి స్వామి అని పిలవడానికి నోరు తిరగడం లేదు.

"అందరూ బాగానే ఉన్నారు కానీ, ఈవూ రివాళ్ళు మాత్రం మీరంటే కోపంగా వున్నారు స్వామీ! కొందరు ఎలా అంటే అలా మాట్లాడుతున్నారు" సౌజన్య చెప్పింది.

"ఈ వూరి వాళ్ళంతా కుళ్ళుబోతు వెధ వలు. పరమ దరిద్రులు! ఒకరు బాగుపడు తుంటే చూడలేరు. ముందుముందు వీళ్ళే వచ్చి మనకాళ్ళమీద పడతారు. చూస్తూం డండి"

స్వామి శయనమందిరంలోనికి శిష్యు రాళ్ళు మినహాయించి ఎవరికీ ప్రవేశం వుండదు. ఎలాంటి పరిస్థితిలో కూడా ఆ దరిదాపులకి సైతం ఎవర్నీ అనుమతించరు.

శయనమందిరం నిండా వివిధ రకాల శృంగార చిత్రాలు అలంకరించి వున్నాయి. వాటిలో కామోద్రేకం కలిగించే నగ్నచి త్రాలూ, అర్ధనగ్న చిత్రాలూ వున్నాయి. స్వామి చుట్టపొగని ఆస్వాదిస్తూ మధుర వూహలలో తేలిపోతున్నారు.

"జన్మదినంనాడూ, మళ్ళీ నెలక్రితం వచ్చారు చూడు. ఒక ఇంజినీరూ, అతని భార్యా! ఆమె తెల్లగా, పొడవుగా వుంటుంది. ఆమె అందం ఏమి అందమే. స్వర్గలోకంలో నుంచి రంభ వచ్చినట్లు వుందే! ఆమె అడు గుపెడితేనే ఆశ్రమానికి ఎంత కళ వచ్చిందీ! గుర్తులేదా? "

"అవును" గుర్తుకు తెచ్చుకున్న సౌజన్య అంది.

"వాళ్ళది ఏ వూరూ? " స్వామి అడిగాడు.

చెప్పింది సౌజన్య.

"నెమ్మదిగా ఆమెని మన దారికి తీసుకుని రండే"

"వెంట భర్త వుంటాడు స్వామీ!"

"ఉండనివ్వండే. వుంటే ఏం? స్వామివారి ఉపాసన అనో, పవళింపు సేవ అనో ఏవో మాటలు చెప్పి, ఒక్కదాన్నే తీసుకురండి. తరువాత విషయం నేను చూసుకుంటాను"

"ఇలాగైతే చాలా ప్రమాదం స్వామీ! ఒక సారి ఇలాగే ఒక వ్యాపారి భార్యని మాయ మాటలు చెప్పి తీసుకువస్తే ఏం జరిగిందో మరిచిపోయారా? ఆమె నానా యాగీ చేసింది. ఆ గండంనుంచి బయటపడేసరికి తలప్రాణం తోకకి వచ్చింది. ఆడవాళ్ళ విష యాలు ఒక్కోసారి కొంప ముంచుతాయి స్వామీ" సుగుణ అంది.

"ఛత్ నోర్ముయ్యవే పిరికిముండా!





అప్పుడు మనకి సరిగా అనుభవం లేదు. ఇప్పుడయితే ఆ ఇంజినీరుగాడి భార్య ఏమిటీ, దాని తాతని లొంగదీయమా? ఈమధ్యకాలంలో ఎంతమందిని లొంగదీయలేదూ! ఎంతమందిని వశపరుచుకోలేదూ! మంచి అందగత్తె ఆమె! అలాంటి మనిషిని తరువాత మన మంత్రిగారికి జత చేస్తే... మనకి ఏ పని కావాలంటే ఆ పని క్షణాల్లో జరిగిపోతుంది"

"వీలయితే నేను చూస్తాను అయ్యగారూ... ఆమె నాతో బాగుంటుంది" సౌజన్య అంది.



శనివారం సాయంత్రానికే రామక్రిష్ణ, రాధికా ఆశ్రమానికి చేరుకున్నారు.

ఆదివారం తీర్థం సేవించడానికి అప్పటికే కొందరు భక్తులు ఆశ్రమం దగ్గరకి వచ్చారు.

దూరప్రాంతాలనుంచి వచ్చిన భక్తులకి కొందరు శిష్యురాళ్ళు అవసరమైన వసతి చూపెట్టడం, ఇతర సౌకర్యాలూ సమకూరుస్తున్నారు.

రాధికనీ, రామక్రిష్ణనీ సాదరంగా ఆహ్వానించింది సౌజన్య.

"చాలా కాలానికి వస్తున్నారు. బాగున్నారా? " అంటూ పలకరించింది.

"మీరు ఇక్కడే వుంటున్నారా? ఇంటికి ఇంకా వెళ్ళలేదా? " రాధిక అడిగింది.

"ఇల్లేమిటి? ఆశ్రమమే నాకు ఇల్లు. ఇక్కడికి వచ్చే భక్తులే నాకు బిడ్డలూ, తండ్రులూ. ఎప్పుడో పోవాల్సిన ప్రాణం. ఈ భక్తులకి సేవలు చెయ్యడానికే నాకు ప్రాణం పోశారు స్వామివారు. వీళ్ళకి సేవలు చేసుకుంటేచాలు. జన్మ ధన్యమవుతుంది. ఇంతకంటే ఇంకా నాకు కావాల్సిందేం వుంది? " సౌమ్యంగా, శాంతంగా అంది సౌజన్య

"మీవారు కానీ, పిల్లలు కానీ మీకు గుర్తురారా? "

"ఎప్పుడో ఒకసారి గుర్తువస్తారు. అయినా ఇంటిదగ్గర సుఖాలు అనుభవిస్తూ వుండడం కంటే నాకు ఇక్కడే ప్రశాంతంగా, సుఖంగా వుంటుంది. ఇంటినీ, పిల్లల్నీ, భర్తనీ ఎప్పుడో మరిచిపోయాను. ఆశ్రమమే నాకు సర్వస్వం" వేదాంత ధోరణిలో అంది సౌజన్య.

ఆమె నిరాడంబర స్వభావానికీ, సేవాతత్పరతకీ ముగ్ధురాలైంది రాధిక. రామక్రిష్ణ కూడా ఆమె మాటలకి ఆశ్చర్యపడ్డాడు.

"మీకు ఒక గది చూపెడతాను. ముందు అందులో దిగండి. అక్కడ స్నానాలు చేయండి. భోజనాలు గదికి పంపించే ఏర్పాటు చేస్తాను హోటల్ కుర్రాడితో. భోజనాల ఖరీదు ఎంత అయితే అంత అతనికి ఇవ్వండి"

"అలాగేనండీ! మీరు చూపుతున్న ఆదరానికి థ్యాంక్సండీ"

"ఫర్లేదు. భక్తులకి సేవచేయడం భాగ్యంగానే భావిస్తాం మేం" సౌజన్య అంది.

తరువాత వాళ్ళకి అక్కడే ఒక గది చూపెట్టింది. సూట్‌కేసూ, బ్యాగ్‌లతో ఆ గదిలోకి వెళ్ళారు రాధికా, రామక్రిష్ణా.

సౌజన్యే స్వయంగా ఒక బకెట్‌తో నీళ్ళు తీసుకుని వచ్చి, రాధికకి స్నానానికి పెట్టింది.

"మీకెందుకండీ అనవసరమైన శ్రమ? నీళ్ళు నేను తెచ్చుకోకపోయానూ? మావారు అయినా తీసుకువచ్చేవాళ్ళు కదండీ" నొచ్చుకుంటూ అంది రాధిక.

"ఫర్లేదు. ఈ చిన్నపనికి కండలు ఏమైనా కరిగిపోతాయా? స్నానంచేసి, మళ్ళీ బకెట్ ఇవ్వండి, ఇతరులకి అవసరమవుతుంది"

"ఇప్పుడే చేస్తాను"

"నేను అటు బయటికి వెళ్ళొస్తాను రాధికా" అని రామక్రిష్ణ బయటికి వెళ్ళిపోయాడు.

"ఇక్కడికి రావడం మొదలుపెట్టిన తరువాత మీకు ఏమైనా ఉపయోగం కనబడిందాండీ? " సౌజన్య అడిగింది.

"కొద్దిరోజుల నుంచీ నెలసరి రావడం లేదు"

"నిజమా? " దిగ్భ్రాంతితో నోరు వెళ్ళబట్టి స్థాణువైపోయింది సౌజన్య.

సౌజన్య అంతగా దిగ్భ్రాంతికి లోను కావడం చూసి రాధిక ఆశ్చర్యపోయింది.

"ఇందులో అబద్ధం చెప్పాల్సిన పని ఏముంది? నిజమే" అంది.

"మంచి వార్త చెప్పారు. అయితే ఇంత మంచి శుభసమయంలో నాకు ఏం ఇస్తారు? " దిగ్భ్రాంతినించి కోలుకున్న సౌజన్య అడిగింది.

"మావారు వచ్చిన తరువాత మీరు కోరిన బహుమతి ఇస్తాను" అంది రాధిక.

"సరే ముందు స్నానం చేయండి"

రాధిక స్నానానికి వెళ్తూ, తన మెడలో వున్న రెండు పేటల బంగారుగొలుసు తీసి, న్యూస్‌పేపరు చింపి పొట్లం కట్టి, సూట్‌కేసులో పెట్టి తాళం వేసింది. ఆ తాళం చెవిని బ్యాగులో వేసింది.

"నేను అలా వెళ్లొస్తాను" అని రాధిక బాత్‌రూంలోనికి వెళ్ళకముందే బయటకి వచ్చేసింది సౌజన్య.

రాధిక గది వెనుక కొంచెం దూరంలో వున్న బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది.

బయటకి వెళ్ళిన సౌజన్య తరువాత చాలాసేపటికి ఒక జంటని ఆ గదిలోనికి తీసుకువచ్చింది.

"సారీ అండీ. ఇవ్వాళ భక్తులు ఎక్కువగా వస్తున్నారు. గదులు సరిపోవు. వీళ్లు ఇద్దరూ ఎంప్లాయిస్. ఎడ్యుకేటెడ్. వీళ్ళు కూడా ఈ రాత్రి గదిలో వుంటారు. ఇంకొంతమంది కూడా రావొచ్చు ఎలాగోలా ఎడ్జెస్ట్ కావాలి" సౌజన్య చెప్పింది.

"పర్లేదు. సర్దుకుంటాం" రామక్రిష్ణ అన్నాడు.

తరువాత చాలాసేపటికి ఆ నలుగురికీ భోజనాలు వచ్చాయి. అవి తిని ఎవరిబిల్లు వాళ్ళు ఇచ్చారు.

పడుకోబోతూ సూట్‌కేసులో భద్రంగా పెట్టిన గొలుసు విషయం గుర్తొచ్చి ఎందుకైనా మంచిది తీసి తన దగ్గిరే దాచిపెట్టుకుంటే బాగుంటుందని సూట్‌కేసు తెరిచింది రాధిక.

అందులో గొలుసు లేదు.

తను పెట్టిన చోటు తనకి బాగా గుర్తు. అయినా వేరేచోట పెట్టానేమో అని సూట్‌కేసు మొత్తం గాలించింది.

బ్యాగులో పెట్టానేమో అని అనుమానం, ఆందోళనతోనే మొత్తం లగేజీ కింద పడేసి బ్యాగు అంతా ఒకటీ రెండుసార్లు చూసింది.





గొలుసు లేదు.

అప్పుడే రామక్రిష్ణ నిద్రలోనికి జారుకుంటున్నాడు. రామక్రిష్ణని లేపి, విషయమంతా చిన్నగా వివరించింది రాధిక.

"అదేమిటి రాధీ... ఇంతలోనే దొంగలు ఎవరు వస్తారు? ఒకచోట పెట్టి మరోచోట వెదుకులాడుకుంటున్నావేమో, సరిగా చూడు" రామక్రిష్ణ అన్నాడు.

"కాదండి. నాకు బాగా గుర్తు. మరచిపోవడానికి ఏముంది? సూట్ కేసులో పెట్టి లాక్ చేసి, కీస్‌ని బ్యాగ్‌లో పడేశాను" రాధిక ఏడుపు ముఖంతో చెప్పింది.

"అప్పుడు ఎవరైనా వున్నారా? రూంలోనికి తరువాత ఎవరైనా వచ్చారా? "

"నేను సూట్ కేస్‌లో పెట్టేటప్పుడు సౌజన్య గారు వున్నారు. నేను బాత్‌రూంలోనికి వెళ్ళకముందే ఆవిడ వెళ్ళిపోయారు. తరువాత రూంలోనికి ఎవరూ రాలేదు"

"మేం రూంలోనికి వచ్చిన తరువాత మీ ఇద్దరూ వున్నారు. మీరూ మేమూ ఎక్కడికీ కదల్లేదు. మామీద అనుమానం లేదుగదా" ఆ రూంలోనే వున్న మరో జంటలోని భర్త అడిగాడు.

"మీరు వచ్చి గంట కాలేదు. మీమీద అనుమానం ఎలా వుంటుందండీ? " రామక్రిష్ణ అన్నాడు.

"ఎవరిమీదా అనుమానం పెట్టుకోవద్దు. ఎవరిమీదా నింద వేయవద్దు. స్వామివారికి చెపుదాం, వారే ఈ సమస్యని పరిష్కరిస్తారు. వారే నగ మనది మనకి వచ్చేలా చేస్తారు" రాధిక అంది.

"అదే మంచిది. స్వామివారికి చెబితే వారే ఏదో చేసి మనకి న్యాయం చేస్తారు" రామక్రిష్ణ కూడా రాధికని సమర్థించాడు.

అప్పటికే రాధిక ఆభరణం పోయినట్లు ఆశ్రమం మొత్తానికి తెల్సింది.

రాధిక వాళ్ళు వున్న రూంవద్దకి గుంపులుగా భక్తులు రావడం మొదలుపెట్టారు.

స్వామి వారికి తెలిసి, వారు కూడా వచ్చారు.

రాధిక విషయం అంతా ఎలా జరిగిందో చెప్పింది.

ఆమె మాట్లాడుతుంటే స్వామివారు వింటూనే ఆమెవైపు అదేపనిగా చూడటం మొదలుపెట్టారు.

రాధిక అదేమీ గమనించలేదు.

"మీరేం బాధపడకండి. మీ సొమ్ము ఎక్కడున్నా మీది మీకు వచ్చేలా చేస్తాను. ఎంత మాత్రం అధైర్యపడకండి. మీ నగ మీకు వస్తుంది" స్వామివారు రాధికకి అభయం ఇచ్చారు.

ఆశ్రమంలో దొంగతనం జరగడం ఇది రెండవసారి. ఇంతకుముందు కూడా ఆశ్రమంలో ఒకసారి దొంగతనం జరిగింది.

ఆ దొంగతనం బయట పడలేదు. అయితే స్వామికి అప్పుడు ఒక అనుమానం వచ్చింది. ఇప్పుడు ఈ నగ ఎవరు తీశారో స్వామికి స్పష్టంగా అర్థమైపోయింది.

గతంలో దొంగతనానికి పాల్పడిన వ్యక్తే ఇప్పుడు కూడా!

సందేహం లేదు.

ఇలా వరుసగా దొంగతనాలు జరుగుతూ పోతూవుంటే ఆశ్రమానికి చెడ్డపేరు వస్తుంది. భక్తుల రాకడ తగ్గిపోతుంది. అప్పుడు మొదటికే మోసం వస్తుంది.

★ ★ ★

రాత్రి రెండుగంటల సమయం.

చాలామంది భక్తులు నిద్రపోతున్నారు.

స్వామివారి ఆంతరంగికమందిరంలో నలుగురు కూర్చుని గొలుసు విషయం తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

"ఇలా అయితే ఆశ్రమం పరువుపో

తుంది. భక్తులు రావడానికి సందేహిస్తారు. ఇలాగే ఇంకో రెండు దొంగతనాలు జరిగితే ఆశ్రమం మూత వేసుకుని అందరం అడుక్కుతినిపోవాల్సిందే" అన్నాడు మార్కండేయులు.

"ఇది పవిత్రమైన ఆశ్రమం. ఈ ఆశ్రమంలో ఇలాంటి అపవిత్రపనులూ, అప్రతిష్టపనులూ జరిగితే ఇక ఆశ్రమానికి విలువేముంటుంది? ఆశ్రమం అభాసుపాలు కావాల్సివస్తుంది" సౌజన్య అంది.

"ప్రజలు ఎంతో గాఢంగా నమ్ముతున్నారు మన ఆశ్రమాన్ని! ఇలాంటిపని మరొకసారి జరిగితే ఆశ్రమం పరువుపోతుంది" సుగుణ అంది.

"ఇన్నిమాటలు ఎందుకే? ఇక్కడ మనం నలుగురం వున్నాం. దొంగతనం చేసింది మన నలుగురిలోనే ఒకరు. ఎవరు ఈ దొంగతనం చేశారో నాకు బాగా తెలుసు"

"మనలో ఎవరు తీస్తారండీ? " సౌజన్య అడిగింది.

"నాకు టోపీ పెట్టకండి. మీలాంటి వాళ్ళని నేను ఎంతోమందిని చూశాను. నేను మంచికి మంచే! చెడుకి చెడే! మర్యాదగా దొంగతనం ఒప్పుకుంటారని చూస్తున్నాను. ముగ్గురూ బైటకి వెళ్ళి ఒక్కొక్కరే రండి. తేలుస్తాను" స్వామి అన్నాడు.

ముగ్గురూ పక్కగదిలోనికి వెళ్ళారు.

ముందుగా సుగుణ వచ్చింది.

"చుట్ట ముట్టించవే"

సుగుణ అక్కడ అలమరలో వున్న ప్యాకెట్టునించి ఒక చుట్టతీసి స్వామి నోట్లో పెట్టి లైటర్‌తో వెలిగించింది.

"నాకు తెలియదు స్వామీ... నేను అన్నెం పున్నెం ఎరుగను"

"నీకు తెలియదులేవే. నువ్వు తీశావని ఎవరు అన్నారు? నువ్వు వెళ్ళి దాన్ని పంపించు"

సుగుణ బయటకి వచ్చి సౌజన్యని లోపలకి పంపించింది.

స్వామి జానెడు చుట్ట నోట్లో పెట్టి గుప్పు గుప్పున పొగ వదులుతున్నాడు.

"ఏమే... గొలుసు ఎవరు తీశారంటావు? "

"నాకు తెలియదు స్వామీ"

"ఇలారా"

సౌజన్య బిడియపడుతూ దగ్గరకి వచ్చింది. నిలబడిన సౌజన్యని చేయి పట్టి లాగి వడిలో కూర్చోబెట్టుకున్నాడు.

"చెప్పవే ఎవరు తీశారు? " ముద్దు ముద్దుగా అడిగాడు.

"నాకు తెలియదు స్వామీ"

"నీకు తెలియదూ? " స్వామి ముద్దుగా మాట్లాడుతూనే మండుతున్న చుట్టని సౌజన్య పొట్టమీద పెట్టాడు.

'కెవ్వు'మని సౌజన్య నోటినించి కేక రాక ముందే చేయి పెట్టి నోరు నొక్కాడు.

"నీకు తెలియదు కదే" అదే నెమ్మది స్వరంతో స్వామి అడిగాడు.

"నిజంగా తెలియదు స్వామీ"

"అలాగా... ఇప్పుడు పొట్టమీదే పడింది వాత. రేపు ఆ మచ్చ ఎవరికీ కనబడకుండా చీర చుట్టుకోవచ్చు. రెండు బుగ్గలమీదా రెండు వాతలు పడతాయనుకో! ఎలా వుంటుంది? నీకు ఎలా వున్నా రేపు జనంలో తిరగాలికదే!"

"మీకు దణ్ణం పెడతాను స్వామీ... నాకూ..."

"నువ్వేమిటే నాకు దణ్ణం పెట్టేదీ? వేల మంది పెడుతున్నారు నాకు దణ్ణం. ఏం ఉపయోగం? నిజం వప్పుకుని అది ఎక్కడ పెట్టావో తెచ్చి ఇవ్వు. ఈ రెండు మచ్చల




తోనే సరిపోతుంది" అని స్వామి సౌజన్యని కౌగిలిలో బంధించి గుండెలమీద చుట్ట పెట్టబోయాడు.

"తెచ్చిస్తాను అయ్యగారూ" మంట బాధకి గిలగిలలాడుతూ ఏడుస్తూ అంది.

"అలా రావాలి దారికి"

సౌజన్య వెళ్ళి అయిదు నిముషాల్లో గొలుసు తెచ్చి ఇచ్చింది.

"పొరపాటు అయింది అయ్యగారూ"

"అయ్యగారూ ఏమిటి, స్వామి అని పిలవమని రోజూ చెప్పాలా? మళ్ళీ ఎప్పుడూ దొంగతనం చేయవద్దు. ముందు ఆశ్రమానికి చెడ్డపేరు వస్తుంది. చేసే మోసం ఏదో పబ్లిక్‌గానే చేయాలి. వెనుకనించి జేబు కొట్టడంకాదే, ఎదుటినించే జేబు కొట్టాలి. ఇంక ఎప్పుడూ దొంగతనం చేయొద్దు"

"అలాగే స్వామీ. ఈ ఒక్కసారికీ మన్నించండి"

"సరే... ఇది మొదటిసారి మొదటి తప్పుగా భావించి వదిలిపెడుతున్నాను. రెండోసారి ఇలాంటి తప్పు జరిగిందో తెల్సు కదా నా విషయం? "

"తెలుసు స్వామీ" సౌజన్య కళ్ళ నీరు తుడుచుకుంటూ బయటకి వెళ్ళింది.

మార్కండేయులు లోనికి వచ్చాడు.

మార్కండేయులు ఆశ్రమం ప్రధాన కార్యదర్శీ, ప్రధాన కార్యనిర్వహణాధికారీ! ఆశ్రమానికి సంబంధించిన సమస్త విషయాలూ మార్కండేయులు పర్యవేక్షిస్తారు.

స్వామికి స్వయానా బావమరిది. ఆర్థిక విషయాలు అన్నీ కూడా మార్కండేయులు చే మీదుగానే జరిగిపోతుంటాయి.

"గొలుసు దొరికిందా బావా? "

"దొరక్క ఎక్కడికి పోతుంది. దొంగని అంత తేలిగ్గా వదిలిపెడతానా? ఆ ఇంజినీరు పెళ్ళాం గొలుసు సూట్‌కేసులో పెట్టడం ఇది చూసింది. బయటకి వచ్చినట్లే వచ్చి, ఆమె బాత్‌రూంలోనికి వెళ్ళిన వెంటనే మళ్ళీ లోనికి వెళ్ళి కొట్టేసింది. ఇంతకు ముందు కూడా ఆశ్రమంలో జరిగిన దొంగతనం దీనిపనే"

"సరే, అయిందేదో అయింది. ఈ విషయాన్ని మనం అనుకూలంగా మలుచుకోవాలి. రేపు ఉదయం తీర్థం ఇవ్వడానికి ముందు అందరి సమక్షంలో గొలుసువాళ్ళకి ఇవ్వు" అని మరుసటిరోజు స్వామి ఏంచేయాలో మార్కండేయులు వివరించాడు.

మార్కండేయులు స్వామికి బావమరిదే కాదు, కుడిభుజంలాంటివాడు కూడా.

నిజానికి ఆశ్రమం ఇంతగా అభివృద్ధి చెందడానికి మార్కండేయులు చేసిన కృషి చాలా వుంది.

తెరముందు స్వామి అయితే తెరవెనుక రచన, దర్శకత్వం, నిర్వహణ మొత్తం బావమరిదే.

సౌజన్యనీ, సుగుణనీ పిలిచి మరుసటి రోజు ఏంచేయాలో చెప్పి, ఇతర శిష్యులకి కూడా ఆ విషయాన్ని చెప్పమన్నాడు.

★ ★ ★

గొలుసు పోయిన బాధలో రాత్రి రాధికకి సరిగా నిద్రపట్టలేదు. మనసంతా విచారంగా, ఆందోళనగా వుంది.

సౌజన్య తెల్లవారకముందే స్నానం చేసి, చక్కగా ముస్తాబై రాధిక వాళ్ళు వున్న రూంలోనికి వెళ్ళింది.

అప్పటికే వాళ్ళు నిద్రలేచి విచారంగా కూర్చుని వున్నారు.

సౌజన్యని చూసి రాధిక తలదించుకుంది. ఆమె ముఖం చూడటానికి రాధిక మనసు అంగీకరించలేదు. ఆమె మీదనే రాధికకి అనుమానంగా వుంది.

"ఏమ్మా... ఏమిటి దిగులుగా వున్నారు? " సౌజన్య అడిగింది.

"బంగారం పోతే దిగులుగా వుండక సంతోషంగా వుండమంటారా? " రామక్రిష్ణ అన్నాడు.

"మీరు ఏమీ భయపడాల్సిన పనిలేదు. మీ నగ ఎక్కడికీ పోదు. స్వామివారు తమ మహిమతో మీ నగ ఎక్కడున్నా రప్పిస్తారు"

"నిజమా? " తల ఎత్తి రాధిక ఆశ్చర్యంగా, అపనమ్మకంగా అడిగింది.

"సందేహమా? స్వామివారు పూజకి కూర్చున్నారు. పూజ అయిన తరువాత భక్తులకి తీర్థం ఇస్తారు. అప్పుడే పోయిన వస్తువులు ఎక్కడున్నా రప్పిస్తారు. పవిత్ర ఆశ్రమంలో దొంగతనం జరగడం అసంభవం! సరే జరిగింది. స్వామివారు మీ నగ ఇవ్వడంతోపాటు ఆ దొంగ నెత్తురు కక్కుకుని చచ్చేలా చేస్తారు" సౌజన్య చెప్పింది.

ఆశ్రమంలో స్వామివారికి ఆరుగురు శిష్యులూ, పన్నెండుమంది శిష్యురాళ్ళూ వున్నారు.

రాత్రి పోయిన ఆభరణాన్ని స్వామి మంత్రశక్తితోనూ, మహిమలతోనూ తిరిగి రప్పించి ఇస్తారని శిష్యబృందం భక్తుల్లో బాగా ప్రచారం చేసింది.

దొంగ నెత్తురు కక్కుకుని అక్కడికక్కడే చచ్చిపోతాడని కూడా శిష్యులు ప్రచారం చేశారు.

భక్తులు అదే విషయం విచిత్రంగా చెప్పుకుంటున్నారు. నగ ఎలా వస్తుందో చూద్దామనే ఆసక్తి కూడా వాళ్ళకి కలిగింది.

తొమ్మిదిగంటల ప్రాంతంలో స్వామి వరండాలోనికి వచ్చారు.

ప్రత్యేక సందర్భాల్లో వేరే వేదిక ఏర్పాటు చేసినా, విడిరోజుల్లో వరండాయే వేదిక.

అక్కడనించే భక్తులకి తీర్థం ఇస్తారు.

వరండాని చక్కగా అలంకరించారు. కింద కార్పెట్లు పరిచారు. స్వామికి ప్రత్యేకమైన ఆసనం ఏర్పాటు చేశారు.

స్వామి వచ్చి ప్రత్యేక ఆసనంలో ఆసీనులైన వెంటనే భక్తులు ఒక్కసారిగా లేచారు. వెనుక వున్నవాళ్ళకి స్వామి కనబడకపోవడంతో నెట్టుకుంటూ, తోసుకుంటూ ముందుకి వచ్చారు.

మగశిష్యులు భక్తుల్ని వరండామీదకి రానీయకుండా వెనక్కి నెట్టేస్తున్నారు.

"ప్రియమైన భక్తులారా... అందరూ కూర్చోవాలి. నిశ్శబ్దంగా వుండాలి. అందరూ ఒక్కసారి స్వామివారి స్మరణ చేయండి. ఇప్పుడు ముందుగా ఇంజినీరు రామక్రిష్ణ గారి భార్య ఇక్కడికి రావాలి" అని శిష్యుడు మైకులో ప్రకటించాడు.

రాధిక వరండామీదకి వచ్చి స్వామివారికి సాష్టాంగప్రణామం చేసింది.

కాళ్ళమీద పడిన రాధికని స్వామి రెండు చేతులూ పట్టుకుని, ముఖంలోనికి చూస్తూ లేవతీశాడు.

"మీ పేరు? " మైకులో ప్రశ్నించాడు స్వామి.

మైకులోనే చెప్పింది రాధిక.

"ఏ వూరునించి వచ్చారు? "

చెప్పింది.

"మీ వృత్తి? "

"ఇంట్లోనే వుంటాను స్వామీ! గృహిణిని"

"మీవారు ఏం చేస్తుంటారు? "

"ఇంజినీరు"

"మీకు పెళ్ళి అయి ఎన్ని సంవత్సరాలైంది? "

"పద్నాలుగు సంవత్సరాలు స్వామీ

"మీకు ఎంతమంది పిల్లలు? "





"లేరు స్వామీ"

"ఎందుకు లేరు? "

"పుట్టలేదు స్వామీ"

"పిల్లలకోసం మీరు ఏం ప్రయత్నాలు చేశారు? "

"పెద్ద పెద్ద ఆస్పత్రులలో చూపెట్టు కున్నాం. కొన్నివేల రూపాయలు ఖర్చు చేశాం స్వామీ"

"అయితే ఉపయోగం కనపడిందా? "

"లేదు"

"ఆశ్రమానికి ఎందుకు వచ్చారు? "

"ఈ ఆశ్రమానికి వస్తే పిల్లలు పుడతారని మా అమ్మావాళ్ళూ, ఇంకొందరు స్నేహి తులూ చెప్పారు స్వామీ. అందుకు వచ్చాను"

"ఎప్పుడు వచ్చారు? "

"రెండు నెలల క్రితం మొదటిసారి వచ్చాను"

"వచ్చి తీర్థం తీసుకున్నారా? "

"తీసుకున్నాను స్వామీ"

"మరి ఫలితం కనపడిందా? "

"ఇప్పుడు నేను నెలల మనిషిని స్వామీ"

"మళ్ళీ చెప్పండి పెద్దగా? "

రాధిక ఆ విషయం మళ్ళీ మైకులో పెద్దగా చెప్పింది.

"14 సంవత్సరాల నించీ మీకు పిల్లలు లేరు. రెండు నెలల క్రితం ఆశ్రమానికి వస్తేనే ఫలితం కనపడింది. అవునుకదా? "

"అవును స్వామీ"

స్వామివారికి చాలా ఉత్సాహంగా వుంది.

తన తీర్థం కారణంగా రాధిక తల్లి కాబో తున్నదనే విషయం అక్కడ వున్న వేలాది మంది భక్తులకి తెలియాలి. అందుకే రాధి కతో పదేపదే ఆశ్రమానికి వస్తేనే తనకి నెలలు వచ్చాయనే విషయం చెప్పించాడు.

రాధిక సిగ్గుపడుతూనే చెప్పింది.

రాధిక విషయం అంతకుముందే స్వామికి సౌజన్య చెప్పింది.

"నేను ఇచ్చిన తీర్థం సేవించి కొన్నివేల మంది తల్లులు అయ్యారు. వారిలో మీరు ఒకరు. నా తీర్థం కారణంగా గర్భం రాకుండా వుండే ప్రసక్తిలేదు. అయితే నియమం పాటించాలి. నియమనిష్టలు పాటిస్తూ తీర్థం వలన గర్భం రాలేదని ఎవ రినైనా నిరూపించమనండి. అలా ఎవరైనా నిరూపిస్తే నా యావదాస్తినీ వారికి ఇవ్వడం తోపాటు ఆశ్రమం మూసివేస్తాను" స్వామి వారు మైకులో సవాల్ చేశారు.

భక్తులు ఆనందంతో పెద్దగా చప్పట్లు కొట్టారు.

"రాత్రి మీ బంగారునగ పోయిందికదా? " అడిగాడు స్వామి

"పోయింది స్వామీ"

స్వామి ఒక నిముషం కళ్ళు మూసుకు న్నాడు.

"నిన్న సాయంత్రం మీరు స్నానానికి వెళ్ళారు. వెళ్తూ మెడలోని నగతీసి సూట్ కే సులో పెట్టారు. దానికి తాళంవేసి ఆ తాళం చేతిని బ్యాగ్‌లో వేసుకున్నారు"

"అవును స్వామీ. అలాగే జరిగింది స్వామీ" రాధిక మహా ఆశ్చర్యపోతూ, మహా సంతోషంతో అంది.

"ఒక దొంగ మీ గదిలోనికి ప్రవేశించాడు. బ్యాగ్ వెదికాడు. అందులో తాళం చెవి కన పడింది. తాళం చెవితో సూట్‌కేసు తెరి చాడు. అందులో పైనే పొట్లం కట్టివుంది మీ నగ. అది తీసుకుని అలా వెనక్కి వచ్చి ఉత్తరం వైపుగా వెళ్ళి మళ్ళీ తూర్పుకి తిరిగి వాళ్ళవూరు వెళ్ళిపోయాడు. అతను భక్తుని వేషంలోనే వచ్చాడు. తెల్లచొక్కా, తెల్లలుంగీ

కట్టుకున్నాడు. మనిషి నల్లగా వున్నాడు" స్వామి కళ్ళు మూసుకుని దృశ్యం చూస్తున్నట్లే చెప్పాడు.

"అవును స్వామీ... అవును స్వామీ" అని రాధిక అంటుండగా భక్తులు నోళ్లు తెరిచి వింటున్నారు.

"నగ తిరిగి వచ్చేలా చేయండి స్వామీ"

"వస్తుంది. రెండు నిమిషాలు ఓపిక పట్టు" స్వామి ప్రశాంతంగా అన్నాడు.

"ఇప్పుడు ఆ దొంగ ఇక్కడికి 10 మైళ్ల దూరంలో వున్న తన గ్రామంలో తన ఇంట్లో కూర్చుని భోజనం చేస్తున్నాడు. నగని ఒక రహస్య ప్రదేశంలో దాచిపెట్టాడు. ఇప్పుడు ఆ నగ నా మహిమవలన రెండు నిముషాల్లోనే గాలిలో తేలిపోతూ వస్తుంది. నగ వచ్చిన వెంటనే ఆ దొంగ కూర్చున్నవాడు అక్కడికక్కడే నెత్తురు కక్కుకుని మరణిస్తాడు. పవిత్ర ఆశ్రమంలో దొంగతనానికి పాల్పడినవాడు బతకడానికి వీల్లేదు. వీల్లేదుగాక వీల్లేదు. ఇది నా శాపం"

అని స్వామి పెద్దగా అరుస్తూ కళ్ళు మూసుకున్నాడు.

"స్వామివారి స్మరణ చేయండి" శిష్యుడు మైకులో ప్రకటించాడు.

భక్తులు పెద్దగా స్వామివారి స్మరణ చేస్తున్నారు.

అందరూ ఉత్కంఠతో చూస్తుండగా, స్వామి పెదాలతో ఏవో మంత్రాలు ఉచ్చరిస్తూ గాలిలో మూడుసార్లు చేతులు తిప్పాడు.

స్వామి చేతిలో నగ ప్రత్యక్షమైంది.

ఆ నగని రెండు వేళ్లతో పట్టుకుని వూపుతూ భక్తులు అందరికీ చూపించాడు.

భక్తులు నెట్టుకోవడం మొదలుపెట్టారు. శిష్యులు అదుపు చేస్తున్నారు.

"ఇదే కదమ్మా మీ నగ? " స్వామి అడిగాడు.

"ఇదేను స్వామీ! నా నగేను స్వామీ" ఆనందపరవశంతో రాధిక అంది.

"అడుగో... దొంగ అడుగో, నెత్తురు కక్కుకుంటున్నాడు. ప్రాణం పోతోంది, ప్రాణం పోతోంది, ప్రాణం పోయింది" స్వామి కళ్ళు మూసుకుని రెండు నిముషాల వ్యవధిలో అన్నాడు.

భక్తుల్లో ఉద్వేగం, ఉద్రేకం పెరిగింది.

ఒకరాగి బిందెకి పసుపూ, కుంకుమ పూసి స్టూలుమీద పెట్టి స్వామికి దగ్గరగా వుంచారు.

"ఇప్పుడు స్వామివారు తీర్థం ఇస్తారు. మీరు ఏదైనా కోరిక కోరుకుని తీర్థం సేవిస్తే ఆ కోరిక నెరవేరుతుంది. అందరూ క్యూగా రావాలి. అలాగే విరాళాలూ, కానుకలూ, చందాలూ ఇచ్చే పూజ్యులూ, దాతలూ ఆ హుండీలో వాళ్ళ శక్తిమేరకు వేయవలసిందిగా ప్రార్థన. ఆశ్రమం అభివృద్ధి కోసం ఎంత ఎక్కువ విరాళాలు ఇస్తే అంత మంచిది. వారి కోరికలు అంత ఎక్కువ ఫలిస్తాయి" శిష్యుడు మైకులో చెప్పాడు.

ఇద్దరు శిష్యులు భక్తుల్ని వరుసలో నిలబెట్టి పంపిస్తున్నారు. వాళ్ళందరి చేతుల్లో గ్లాసులు వున్నాయి. అక్కడే వున్న గంగాళం నించి నీళ్లు ముంచుకుని స్వామివద్దకి వెళుతున్నారు.

ఆ నీళ్లలో స్వామి వేలు ముంచుతున్నాడు.

వాటిని భక్తులు ఆనందపరవశంతో కళ్లకద్దుకుని ఒక్కోబొట్టు చొప్పున చాలా నెమ్మదిగా తాగుతున్నారు.

మధ్యాహ్నానికి హుండీ నిండిపోయింది. స్వామి ఇక ఆ పూటకి తీర్థం ఇవ్వడం ఆపేసి శయనమందిరంలోకి నిష్క్రమించారు.

ఒక శిష్యుడు హుండిని స్వామివారివెంట





# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర సమీక్ష




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఆగస్టు చతుర నవల స్వాములోరు

సమీక్షకుని పేరు : ____________

చిరునామా ____________

లోనికి తీసుకుపోయాడు.



నాలుగు గంటల సమయంలో గోపాలం వాళ్ళ అమ్మని తీసుకుని కారులో వచ్చాడు. వెంట గోపాలం భార్యా, ఇద్దరు పెద్ద పిల్లలూ వున్నారు.

వాళ్ళు కారు దిగడం చూసిన రామక్రిష్ణ వాళ్ళని తన గదికి తీసుకువచ్చాడు.

"ఏమిటి గోపాలం... ఇంత ఆలస్య మైందేం? "

"మేం అక్కడ బయల్దేరడమే ఆలస్యమ యింది సార్. దారిలో కారు టైరు పంక్చర్. స్టెప్నీ లేదు. ఆ టైరు పంక్చర్ వేసుకుని వచ్చేసరికి ఆలస్యమైంది"

"ఉదయం తీర్థం ఇవ్వడం అయిపో యింది. మళ్ళీ రాత్రికి తిరిగి తీర్థం ఇస్తారు" రాధిక అంది.

"మీరు ఉదయం వస్తే చాలా బాగుండేది గోపాలం! స్వామివారి మహత్యం ప్రత్య క్షంగా చూసివుండేవాళ్ళు"

"ఏం మహాత్యం చేశారేమిటి? "

నగ పోవడం, తాము చాలా విచారప డటం, ఉదయం స్వామివారు మహిమతో నగని రప్పించి ఇవ్వడం, అది దొంగిలించిన వాడు నెత్తురు కక్కుకుని చావడం- రాధికా, రామక్రిష్ణా ఒకరు మార్చి ఒకరు ఉత్సా హంగా, ఆనందంగా చెప్పారు.

"దొంగ చావడం మీరు చూశారా? " గోపాలం ఆసక్తిగా అడిగాడు.

"చూసేదేమిటి? పదిమైళ్లనుంచి నగ క్షణాల్లో అందరి కళ్లముందే తేలిపోతూ రాగా దొంగ చావక బతుకుతాడా? " రామ క్రిష్ణ అన్నాడు.

"నిజంగా స్వామికి గొప్ప మహిమలూ, శక్తులూ వున్నాయి. స్వామి సాక్షాత్తూ దేవుడే" రాధిక అంది.

"స్వామివారి గొప్పతనానికి ప్రభావితమై వున్నత కుటుంబాల స్త్రీలు కూడా తమ కాపు రాల్ని వదిలిపెట్టి ఇక్కడ భక్తులకి సేవలు చేయడానికి వుండిపోతున్నారు. మాకు ఒక డాక్టరుగారి భార్య పరిచయం. బాగా వున్న వాళ్ళు ఆమె భర్తనీ, బిడ్డల్నీ వదిలిపెట్టి భక్తులకీ, స్వామివారికీ సేవలు చేస్తోంది. మేం నగ పోయినప్పుడు ఆమెని కొంచెం అనుమానించామనుకోండి. పాపం, ఆమె అలాంటి మనిషి కాదు" రామక్రిష్ణ అన్నాడు.

"దొంగతనం చేయాల్సిన ఖర్మ ఆమెకి ఎందుకండీ? బోలెడు ఆస్తిపాస్తుల్ని వదులు కుని వచ్చిన మనిషి!" రాధిక అంది.

"ఆమెకి ఎప్పుడూ భక్తులకి సేవలు చేసే తపనే! భక్తుల చుట్టూ తిరిగి వాళ్ళ అవస రాల్ని కనుక్కుని అవి సప్లయ్ చేస్తుంది. ఆమె ఇప్పుడు వస్తుంది. మీకు పరిచయం చేస్తాను" రామక్రిష్ణ అన్నాడు.

వీళ్ళు మాటల్లో వుండగనే సౌజన్య రానే వచ్చింది.

"భోజనాలు చేయడం అయిందా? " చొర వగా మాట్లాడుతూ లోనికి వచ్చింది.

"రండి రండి మీ గురించే అంటున్నాం" అంది రాధిక.

సౌజన్య లోపల కూర్చుని వున్న గోపాలాన్నీ, అతని భార్యనీ చూసి హతాశురాలైంది.

"ఈవిడే మేము చెపుతున్న సౌజన్యగారు" అన్నాడు రామక్రిష్ణ.

"మళ్ళీ వస్తాను" అని సౌజన్య మరో మాట మాట్లాడకుండా క్షణంలో గిర్రున వెనక్కి తిరిగి వడివడిగా వెళ్ళిపోయింది.

సౌజన్యని చూసి గోపాలం, అతని భార్యా ఆశ్చర్యంనించి తేరుకోలేదు. కొత్త వ్యక్తుల్ని చూసి కనీసం ఒకటీ రెండు మాటలు మాట్లాడకుండానే వెళ్ళిపోవడంతో రాధికా, రామక్రిష్ణా ఆశ్చర్యంలో పడిపోయారు.

"ఈమేనా మీరు చెపుతున్న డాక్టరుగారి భార్య? " అడిగాడు గోపాలం.

"ఈమె మీకు తెలుసా? మిమ్మల్ని చూసి వెళ్ళిపోయిందేమిటీ? " ఆశ్చర్యంనించి తేరుకున్న రామక్రిష్ణ అడిగాడు గోపాలాన్ని.

"ఈమె మాకు తెలియకపోవడమేమిటి? మా వూరే" అన్నాడు గోపాలం.

"ఆమెని ఎక్కడో చూసినట్లు నాకూ అనిపించిందండీ! కానీ ఎవరో గుర్తు రావడం లేదు!" గోపాలం భార్య అంది.

"ఈమెది మన వూరే లక్ష్మీ! నువ్వు మన వూళ్లో ఎక్కువ రోజులు లేవుకదా! పెళ్లయిన తరువాత నాతోపాటు వస్తివీ!"

"కానీ ఈమెని నేను చూశానండీ!"

"మరి మాట్లాడకుండా వెళ్లిపోయిందేమిటి? " రాధిక అడిగింది.

"మావూరు వెళ్లి మేము ఆరేడేళ్లు అవుతోంది. అయినా మాకు గుర్తే. ఈమెది మా వూరే! అనుమానం లేదు"

"డాక్టరుగారి భార్యకాదా? "

"డాక్టరుగారి భార్యా, పాడా? ఈమె పెద్ద కిలాడి. ఈమెకిలేని చెడ్డ లక్షణమే లేదు. దొంగతనం, మోసం, వ్యభిచారం ఒకటేమిటి అన్ని లక్షణాలూ వున్నాయి. ఒకసారి ఇద్దరు అమ్మాయిల్ని టౌనుకి తీసుకుపోయి అమ్మివేసింది. వాళ్లు బొంబాయి రెడ్‌లైట్ ఏరియాకి అమ్మారు. పాపం ఆ అమ్మాయిలు ఇద్దరూ నరకయాతన అనుభవించి చివరికి రెండేళ్ల తరువాత ఇంటికి చేరుకున్నారు. గంప మీద జాంపళ్లు అమ్ముతూ వూళ్లో ఎవరెవరి ఇంట్లో బంగారం, డబ్బూ వుందా అని ఆరాతీసి, ఒకసారి ఒక మోతుబరి రైతు ఇంట్లో దొంగతనం చేయించింది. ఆ దొంగతనానికి ప్లాన్ మొత్తం ఈమే రూపకల్పన చేసింది"

"నిజమా? " రామక్రిష్ణ ఆశ్చర్యంగా అడిగాడు.

"సుబ్బయ్యగారింట్లో కదండీ దొంగతనం చేయించింది" గోపాలం భార్య అడిగింది.

"అవును. అప్పుడు లక్ష రూపాయల డబ్బూ, 70 సవర్ల బంగారమూ దొంగిలించారు. చివరికి దొంగలు దొరికి ఈమె పేరు బయటపెట్టారు. ఇక ఈమె చేసే చిల్లరమల్లర దొంగతనాలకి లెక్కేలేదు. సామాన్యురాలు కాదు ఈమె. పెద్ద చెయ్యి"

"ఈమె పేరు ఏదో వుంది కదండీ. సౌజన్య కాదు"

"సుబ్బాయ్... అందరూ దొంగ సుబ్బాయ్ అంటారు. అసలు పేరు సుబ్బులు. ఈమె భర్తది మా వూరేకానీ పుట్టిల్లు మాత్రం మా వూరుకాదు. వీళ్ల నాన్నకి రెండు పెళ్లిళ్లట. రెండు సంబంధాలకీ ఆడపిల్లలే పుట్టారు. మొత్తం ఐదారుగురు ఆడపిల్లలు వున్నారనుకుంటాను"

"మరి ఎందుకు ఈవిడ ఇలా చెప్పింది మాతో! డాక్టరుగారి భార్యని అనీ, క్యాన్సర్ జబ్బు అయితే తగ్గిపోయిందనీ" రాధిక




అంది.

వీళ్లు ఇలా మాట్లాడుకుంటూ వుండగానే సౌజన్య తిరిగి వచ్చింది.

"స్వామివారికి అర్జంట్‌గా ఒక మాట చెప్పాల్సి వచ్చింది. ఆ విషయం మరచి పోయి ఇలా వచ్చాను"

"మీది ఏ వూరు? " రామక్రిష్ణ అడిగాడు.

"మాది తెనాలి దగ్గర ఆరికట్ల. నన్ను ఇచ్చింది బాపట్ల. మావారు డాక్టరు. ఎందుకు అడిగారు మా వూరు? "

"మాది మీ వూరి పక్కన వున్న రాజం పల్లి. నువ్వు మా వూరి రమణయ్య భార్య వనుకుంటున్నాం"

"కాదండీ... రమణయ్య భార్య మా అక్కయ్య సుబ్బులు. మీది ఆ వూరేనా ఏమిటి? "

"అవును. మీ అక్కయ్య మాకు బాగా పరి చయం. నిన్ను చూసి మీ అక్కయ్య అను కున్నాం" గోపాలం అన్నాడు.

"మీరు ఒక్కరేకాదులెండి. ఎవరైనా అంతే. నన్ను చూసి మా అక్కయ్య అను కుంటారు. ఆమెని చూసి నన్ను అనుకుం టారు. ఇద్దరం దాదాపు ఒకేలా వుంటా మండీ. కవల పిల్లలం కాదుగానీ మా ఇద్ద రికీ ఒక ఏడాది తేడా!"

"ఉద్యోగం, పిల్లల చదువులతో సరిపో తోంది మాకు. మా వూరు వెళ్లి ఐదారేళ్లు అయింది. ఉద్యోగరీత్యా దూర ప్రాంతంలో వుంటున్నాం"

"మంచిదండీ, వస్తాను" అని సౌజన్య వెళ్లి పోయింది.

పగలు వచ్చిన భక్తులకోసం ఆ రోజు రాత్రి తీర్థం ఇచ్చే కార్యక్రమం తిరిగి ప్రారం భమైంది.

గోపాలం ఒక గ్లాసు నీళ్లు తీసుకుని స్వామి వారు వేలు ముంచగా ఆ నీళ్లు వాళ్ల అమ్మతో తాగించాడు.

తీర్థం సేవించిన అనంతరం వచ్చిన కారు లోనే తిరిగి వెళ్లిపోయారు.

★ ★ ★

నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లి వచ్చిన తరు వాత గోపాలం అమ్మ పరిస్థితి విషమిం చింది.

ఆశ్రమానికి వెళ్లడానికి ముందు పక్ష వాతం వున్నా ఆరోగ్యం స్థిరంగా వుంది.

అసలే అనారోగ్యవంతురాలూ, వృద్ధు రాలూ ఆమె! దానికి తోడు దూర ప్రయాణం చేయడంతో దెబ్బ తిన్నది.

గోపాలం అప్పుచేసి ఊళ్లో వున్న మంచి డాక్టర్లని తీసుకువచ్చి చూపెట్టాడు. వాళ్లు చూసి లాభం లేదని పెదవి విరిచారు.

నాలుగు రోజులు ఆమె జీవితం కోసం పోరాడి ఓడిపోయింది.

గోపాలాన్ని పరామర్శించడానికి రామక్రిష్ణ వచ్చాడు.

"నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లకుండా వున్నా బావుండేదండి! ఇంకా కొంతకాలం పాటు బతికివుండేదనిపిస్తోంది. రానని మొరాయించినా నేనే బలవంతం చేసి ప్రయాణం కట్టించాను" రామక్రిష్ణతో అన్నాడు గోపాలం.

"తప్పు ఏముందిలే గోపాలం? ఆమె కోస మేగా నీ తాపత్రయం! ఆమెకి అంత వరకూ రాసి వుంది. ఏం చేద్దాం? "

"నేనే ఆమెని చంపినట్లు నాకు బాధ కలు గుతున్నది. అనవసరంగా ముసలమ్మని అంత దూరం ప్రయాణం చేయించాను. నీళ్లు తాగిస్తే రోగం తగ్గుతుందాండీ? " బాధ పడుతూ అన్నాడు గోపాలం.

"అలా మాట్లాడొద్దు గోపాలం. పెద్దపెద్ద డాక్టర్లు కూడా ఆయన వద్దకి ఎందుకు వస్తు న్నారు? ఆయనలో మహిమ వుంటేనే

కదా!"

"కానీ నాకు నమ్మకం కలగడం లేదు సార్!"

"కొందరు నమ్ముతారు, కొందరు నమ్మరు! మా వరకూ మాకు మంచి నమ్మకం ఏర్ప డింది. ఆయన మీద మాకు గురి కుదిరింది" అన్నాడు రామక్రిష్ణ.

దహన కార్యక్రమం ముగిసేవరకూ గోపాలం వెన్నంటి వుండి తరువాత రామ క్రిష్ణ వెళ్లిపోయాడు.

★ ★ ★

"ఏం మార్కండేయులూ... ఆశ్రమ నిర్మాణం కోసం స్థలం కొనుగోలు చేయమని చెపుతున్నాను. నువ్వు అసలు ఆ ప్రయ త్నంలో వున్నట్లు లేదు!" బావమరిది మార్కండేయుల్ని అడిగాడు స్వామి.

"చూస్తున్నాను బావా! మనకి అవసర మైన పొలం అంతా ఒక్కచోటే కావాలికదా! కొంతమంది అమ్ముతాం అంటున్నారు. కొంతమంది ససేమిరా అమ్మడానికి వీలు కాదు అంటున్నారు"

"ఎలా అయితే? "

"అదే బావా పెండింగ్‌లో పడింది"

"పెండింగ్ అంటే ఎలా? ఇస్తామని ముందుకి వచ్చిన వాళ్ల పొలానికి డబ్బుకట్టి రిజిస్ట్రేషన్ చేయించుకుంటే కొంతభారం పోతుందికదా!"

"నడిబొడ్డున పొలం నారాయణకి వుంది. అతను ఇవ్వను అంటున్నాడు. చుట్టూ పొలం కొని మధ్యలో అతను వుంటే మనకి ఎలా వుపయోగపడుతుంది? "

"ఇస్తామని ముందుకి వచ్చిన వాళ్ల పొలం రిజిస్ట్రేషన్ చేయించు. ఇహ ఇవ్వ కుండా మధ్యలో వున్నవాడికి రూపాయికి రెండు రూపాయలు ఇస్తే వాడే అమ్ము తాడు. డబ్బుకి లోకం దాసోహం మార్కం డేయులూ! డబ్బు వుండాలే కానీ దేవుడితో సహా దేశంలో కొనలేనిదేమీ వుండదు"

"ఇస్తామని ముందుకి వచ్చిన వాళ్ల పొలం బేరం సెటిల్ చేస్తాను బావా! ఎంత రేటు పెడదామంటావు? "

"వాళ్లే చెపుతారు. వాళ్లు చెప్పిన ధరమీద బేరం చేయండి. వీలైనంత తక్కువ ధర ఇవ్వడానికే చూడండి. వీళ్లకి తక్కువ రేటు ఇచ్చినా మొండివేసిన వాడి పొలానికి అంతకు అంత ఇవ్వాల్సి వుంటుంది"

"సరే బావా!"

"డబ్బు వుందికదా? "

"వుందికానీ సరిపోతుందో, లేదో? " నసి గాడు మార్కండేయులు.

"ఎందుకు సరిపోదు? నీ దగ్గర మొత్తం ఎంత డబ్బు వుంది? "

"పన్నెండు లక్షలు వుంది బావా!"

"పన్నెండు లక్షలు ఏమిటి? నేను ఇస్తున్న డబ్బు అంతా ఏం చేస్తున్నావు? "

"నేనేం చేస్తున్నాను బావా? నువ్వు ఇచ్చిన డబ్బు భద్రంగా దాచిపెడుతున్నాను. నా ఖర్చులకి కూడా వాడుకోవడంలేదు"

"నేను ఇచ్చిన డబ్బు నా గుర్తు ప్రకారం దాదాపు 30 లక్షలు వుండాలి"

"లేదు బావా... అంత డబ్బు ఇవ్వలేదు"

"మరి ఎంత ఇచ్చి వుంటానంటావు? "

"పన్నెండు లక్షలు బావా! కాకపోతే ఇంకా ఒకటీ రెండు లక్షలు అదనంగా వుంటా యేమో! లెక్క చూస్తేకానీ పూర్తిగా తెలి యదు"

"నీ దగ్గర ఎంత డబ్బు వుందో రేపు లెక్క తీసుకొచ్చి చెప్పు"

"కొంత బ్యాంకుల్లో వుంది. కొంత స్వయంగా దాచిపెట్టాను. మొత్తం చూసి లెక్క రేపు చెపుతాను బావా"





"సరే ముందు త్వరగా ఆశ్రమానికి పొలం బేరం చేయండి"

"అలాగే బావా!" అని మార్కండేయులు బయటకి వెళ్లిపోయాడు.

స్వామికి కొద్దికాలంనించీ బావమరిది మీద వున్న అనుమానం బలపడింది.

డబ్బుకి సంబంధించిన మొత్తం విషయాలు మార్కండేయులు చూస్తాడు. భక్తులనించి తనకి వస్తున్న డబ్బు అంతా అతనికే ఇస్తాడు. తను స్వామి అవతారంలో వున్నాడు. డబ్బు లెక్కలు తను చూడలేడు.

ఇహలోక సుఖాల్ని పరిత్యజించానని రోజుకి తను వందసార్లు చెపుతుంటాడు. డబ్బు విషయాలు చూడటం తనకి కుదరని పని. ఆ విషయాలు అన్నీ బావమరిదికి ఒప్పగించాడు.

అయితే డబ్బు మనుషుల్ని మార్చివేస్తుంది. ఎందుకైనా మంచిది. మార్కండేయుల్ని ఒక కంట కనిపెట్టి వుండాలి. డబ్బు కూడా ఇకముందు అతని చేతికి ఇవ్వకూడదు.

ఆశ్రమానికి సంబంధించిన గుట్టుమట్లు అన్నీ మార్కండేయులకి తెలుసు. అతని చేతికి చిక్కకుండా అవసరం మేరకే అతన్ని వాడుకుని కరివేపాకులా చేయాలి.

రేపు డబ్బు లెక్క తెస్తానంటున్నాడు. అతను చెపుతున్న మాటల్నిబట్టి చాలా డబ్బు మింగేసి వుండాలి.

★ ★ ★

"స్వామీ"

"చెప్పండి"

"నేను చాలా ఆర్థిక ఇబ్బందుల్లో పడిపోయాను స్వామీ! మొదట్నించీ మీ భక్తుడ్ని. నాకు మేలు జరుగుతుందంటున్నారు కానీ ఇంతవరకూ మేలు జరగలేదు"

"తప్పకుండా జరుగుతుంది నాయనా! ఇప్పుడు శని నిన్ను వదిలిపెట్టి వెళ్లే పరిస్థితిలో వున్నాడు. వెళ్తూవెళ్తూ దెబ్బతీసి వెళ్లడు!"

"నిజమా స్వామీ? "

"తప్పకుండా జరుగుతుంది"

"మంత్రిగారికి చెప్పి నాకు రాళ్లదిన్నె రిజర్వాయర్ టెండర్ ఇప్పించండి స్వామీ!"

"ఇప్పిస్తే? "

"మీ మేలు మరచిపోను స్వామీ!"

"అంటే"

"మీరు కోరిన ముడుపు చెల్లిస్తాను'

"ఆ రిజర్వాయర్‌లో ఎంత మిగుల్తుంది? '

"చెప్పలేను స్వామీ! ఎం.ఎల్.ఏలకీ, ఇంజనీర్లకీ, సూపర్‌వైజర్లకీ అందరికీ దండిగా మామూళ్లు సమర్పించుకోవాలి. వాళ్లందరికీ ముట్టచెప్పిన తరువాత కానీ ఎంత మిగుల్తుందో, తగుల్తుందో చెప్పలేం!"

"అది మొత్తం ఎన్ని కోట్ల రూపాయల టెండరూ? "

ఎన్ని కోట్ల రూపాయల టెండరో చెప్పాడు లక్ష్మీకాంతం. ఆయనకి ఇటీవల రెండు కంట్రాక్ట్ పనుల్లో కొంత నష్టం వచ్చింది. కాంట్రాక్ట్ చేసిన కొన్ని ఇతర పనులకి, వర్క్ సరిగా లేదని బిల్లులు పాస్‌కాలేదు.

"అయితే అది చాలా పెద్ద టెండర్‌కదా?

"అవును స్వామీ. కోట్ల రూపాయల పని"

"మంత్రిగారికి చెప్పి నీకు టెండర్ వచ్చేలా చేయమంటావు!"

"అదే స్వామీ నా కోరిక కూడా"

"టెండర్ పని నీకే వస్తుందనుకో! నీవు నాకు ఏమీ ఇవ్వనవసరం లేదు. సర్వసంగ పరిత్యాగిని. నాకు ఏమీ అవసరం లేదు కూడా. అయితే ఆశ్రమానికి ఏమి ఇస్తావో

చెప్పు? "

"మీరే ఆదేశించండి స్వామీ. మీ ఆదే శాల్ని శిరసావహిస్తాను"

"మీకు నా ఆశీస్సులు వున్నా మంత్రిగారికి చెప్పి వప్పించాలంటే అంత తేలిక కాదు. ఆయన డబ్బు మనిషి అనే విషయం అంద రికీ తెల్సిందే. ఆయనకి కొంత ఇవ్వాల్సి వుంటుంది. సరే, మేం కొత్తగా విశాల స్థలంలో నూతన ఆశ్రమాన్ని నిర్మిస్తున్నాం. మా కొత్త ఆశ్రమానికి మీ సహకారం వుంటే ఆ టెండర్ మీకే వస్తుంది"

"తప్పకుండా నా సహాయం వుంటుంది స్వామీ. మీరు ఏది కోరినా అది క్షణాల మీద సమకూర్చి పెడతాను"

కంట్రాక్టర్ లక్ష్మీకాంతం ప్రతిరోజూ స్వామికి గంపల్తో పండ్లు సమర్పించు కుంటూ కలుసుకుంటున్నాడు.

స్వామి ముందుగా మంత్రిగారితో కంట్రాక్ట్ విషయం మాట్లాడాడు.

తరువాత లక్ష్మీకాంతాన్ని మంత్రిగారికి పరిచయం చేశాడు. బేరసారాలు సాగాయి.

టెండర్ లక్ష్మీకాంతానికి వచ్చేలా చేయడా నికి మంత్రి అంగీకరించాడు. మంత్రికోరిన పర్సెంటేజీ ఇవ్వడానికి లక్ష్మీకాంతం తలవూ పక తప్పలేదు.

భారీ ఎత్తున లాభం వస్తుందనుకున్న ఆ కంట్రాక్ట్ పనికి భారీ ఎత్తున పోటీ కూడా జరిగింది.

ఎత్తులూ, పై ఎత్తులూ, రకరకాల కుట్రలూ, కుయుక్తులూ, కిడ్నాపుల అనం తరం ఆ పని లక్ష్మీకాంతానికే లభించింది మంత్రిగారి అండదండలు వుండటంతో

అన్నీ బాగానే వున్నాయికానీ తన పని మాత్రం బాగుండే అవకాశం లేదు.

మంత్రిగారు చాలా పెద్ద మొత్తమే కమీ షన్ అడిగారు. ఇక స్వామివారి ఆశ్రమానికి ఆయన కోరినది ఇస్తానని తనే మాట ఇచ్చాడు.

ఉన్నతాధికార్లనించీ ఇంజినీర్లూ, దిగువ స్థాయి వుద్యోగుల వరకూ అందరికీ వాటాలు పంచుకుంటూ వస్తే చివరికి ఆ రిజర్వాయర్ నిర్మాణానికి పదిశాతం ఖర్చు కూడా చేయడానికి కుదరదు.

అలా చేస్తే తను నిర్మించినన్ని రోజులు కూడ రిజర్వాయర్ వుండే అవకాశం లేదు. వేసిన మరుసటి రోజే కుప్పకూలిపోవడం తథ్యం.

"మంత్రిగారికీ, ఇంజనీర్లకీ అందరికీ వాళ్ళు కోరిన ముడుపులు చెల్లిస్తే చివరికి రిజర్వా యర్‌కి రూపాయికి పదిపైసలు ఖర్చు పెట్టడం కూడా కష్టం స్వామీ! పిల్లలు ఆడు కునే పిచికలగూడు మాదిరిగా సిమెంట్ లేకుండా వుత్త ఇసుకతో రిజర్వాయర్ ఆకారం చూపెట్టాల్సిందే! గట్టిగా మంచి వాన ఒకటి పడితే అప్పుడు రిజర్వాయర్ ఆనవాళ్ళు కూడా దొరక్కుండా మొత్తం నీళ్ళలో కొట్టుకుపోతుంది స్వామీ" లక్ష్మీ కాంతం స్వామివారికి మొరపెట్టుకున్నాడు.

"అవన్నీ నీకెందుకయ్యా? నీ పని నువ్వు చేసుకుంటూ పో! నిన్ను అడిగేవాళ్ళు ఎవరూ వుండరు. ఒకవేళ ఎవరైనా ఇదేమని అడి గితే వాళ్ళు తెల్లవారేసరికి శంకరగిరి మాన్యాలు పట్టిపోతారు"

"మీదయా, ఆశీర్వాదం స్వామీ! మీరు ఎలా చేయమంటే అలా చేస్తాను"

"నీ లాభం నువ్వు చూసుకుని పని మొద లుపెట్టు. మంచీ, చెడూ నిర్ణయించేది ఆ భగవంతుడే! అంతా దైవ నిర్ణయమే"

లక్ష్మీకాంతం వెళ్ళిపోయాడు.

క్రమంగా వాణిజ్యవేత్తలకీ, పారిశ్రామికు లకీ, రాజకీయ నాయకులకీ, ప్రభుత్వ అధి కారులకీ, మంత్రులకీ స్వామివారి ఆశ్రమం కూడలి అయింది.




★ ★ ★

"పొలాలు బేరం కుదిరినట్లే బావా! ఇక డబ్బు కట్టి రిజిస్ట్రేషన్ చేయించుకోవడమే!" అంటూ మార్కండేయులు వచ్చాడు.

"ఎంత ధరకి కుదిరాయి బేరాలు? "

"రకరకాల ధరలు పడ్డాయి బావా! ఒక్కొక్కరి పొలం ఒక్కోధర! దాదాపు ఎక్కువ పొలం తక్కువ ధరకి దొరికినట్లే. కొద్ది పొలానికి మాత్రం కొంత ఎక్కువరేటు పెట్ట వలసి వచ్చింది"

"మొత్తం ఎన్ని ఎకరాలు కుదిరింది? "

"35 ఎకరాలు కుదిరింది బావా! సరిపో తుంది కదా? "

"ఆశ్రమాన్ని భవిష్యత్‌లో ఎన్నో విధా లుగా అభివృద్ధి పరచవలసి వుంటుంది. అందులో ఎన్నో సంస్థలు స్థాపించాలి. చాలా పెద్ద ప్లాన్ వుంది. పొలం ఇంకా కొంత దొరికినా కొనుగోలు చేయండి"

"మిగతావాళ్లు ఇవ్వం అని తేల్చి చెప్పారు బావా! ఇక దొరకడం కష్టం"

"సరే అయితే రిజిస్ట్రేషన్‌కి అవసరమైన డబ్బు నీ వద్ద వుందా? ఇంకా కొంత చూడ మంటావా? "

"మొన్ననే చెప్పానుకదా బావా, నా దగ్గిర 12 లక్షల కంటే ఎక్కువ లేదని"

"నీ దగ్గిర వున్న డబ్బు లెక్క తెస్తానని చెప్పావుకదా! లెక్కతెస్తే చూద్దాం"

"నా దగ్గిర ఆ కాయితాలు ఎక్కడో పోయాయి బావా! నిన్న అంతా కాయితాల కోసం వెదుకులాడాను. పనికిరాని కాయితా లని పిల్లలు వాటిని ఎక్కడో పారేసి వుంటారు"

"అదేంటి మార్కండేయులూ? ఆ కాయి తాలు పోతే ఎలా? రేపు ఎవరికైనా దొరి కితే ఏమవుతుంది? మనం లెక్కలు ఎలా చూసుకోగలం? "

"పొరపాటు జరిగిపోయింది బావా! నేను జాగ్రత్తగానే వున్నాను. కానీ కాయితాలు ఎలా పోయాయో అర్థం గాకుండా వుంది"

"అందులో అర్థమయ్యేది ఏముందిలే? నీకు నేను దాదాపు పాతిక లక్షల పైచిలుకు ఇచ్చాను. శిష్యులకీ, ఏజంట్లకీ ఎన్ని జీతాలు ఇచ్చినా, ఎంత ఖర్చు పెట్టినా నువ్వు ఒకటీ రెండు లక్షల కంటే ఎక్కువ ఖర్చుపెట్టి వుండవు. లెక్కతెచ్చి చూసుకుంటే మిగతా డబ్బు కట్టాలికదా! అందుకే కాగితాలు పోయి వుంటాయి"

"నీవు నాకు అంత డబ్బు ఇవ్వలేదు బావా!"

"ఇంక నోర్ముయ్ భ్రష్టుడా! నిన్ను ఆద రించినందుకు మంచి పనే చేశావు. నమ్మిన వాళ్లని నిలువునా ముంచావు"

"మాట జారకు బావా. నువ్వు ఎలాంటి స్వామివో ఈ డబ్బు ఎలాంటి డబ్బో ఎవ రికి తెలియదు? ఈ ఆశ్రమం ఇంత స్థాయికి రావడానికి నా కృషి లేదంటావా? అయినా నువ్వు నాకేం ఇచ్చావు? "

"ఇంకా ఏమి ఇవ్వాలా? ఇంతకాలంనించీ నేను పడిన శ్రమంతా తిన్నావుకదా! ఈ రోజు నాకంటే నీ దగ్గిరే ఎక్కువ డబ్బు వుంది కదరా"

"ముందు ముందు నువ్వు సంపాయించ కోగలవు. నువ్వు ఎంతటికైనా సమర్థుడివే"

స్వామికీ, బావమరిదికీ మాటామాటా పెరిగింది. ఇద్దరూ ఒకరిమీద ఒకరు కలబ డ్డారు.

స్వామి ముష్టిఘాతాలు మార్కండేయు లకి బాగా తగిలాయి.

చివరికి చిరిగిన బట్టలతో మార్కండే యులు బయటకి దారితీశాడు. "నీ అంతు చూస్తాన్రా నువ్వు ఎంత మోసగాడివో వూళ్లో అందరికీ చాటింపు వేయించి చెప

తారా" అన్నాడు మార్కండేయులు.

"పోరా పుండాకోర్... నువ్వు నన్నేం చేస్తావురా? నీలాంటి వాళ్లని రోజూ ఎంత మందిని చూడటంలేదురా"

"నువ్వు వెధవ్విరా. నీ గతం కుక్కకంటే హీనంరా. నువ్వు చేసిన వెధవ పనులు అన్నీ టాంటాం వేసి చెప్పకపోతే నా పేరు మార్కండేయులే కాదురా"

"ఇంకా ఇక్కడవున్నావంటే నా చేతిలో చచ్చావే? " అన్నాడు స్వామి.

చిరిగిన బట్టలతో, అవమాన భారంతో మార్కండేయులు వెళ్లిపోయాడు.

★ ★ ★

స్వామి పొలాలు కొనుగోలు చేశాడు.

శరవేగంతో నూతన ఆశ్రమ నిర్మాణ పనులు జరుగుతున్నాయి.

ఇంద్రభవనాన్ని మరపించే రీతిలో ఆధునిక వసతులతోనూ, సౌకర్యాలతోనూ ఆశ్రమ నిర్మాణం జరుగుతోంది.

ఆశ్రమానికి అవసరమైన సిమెంట్ మొత్తం ఒక సిమెంట్ కంపెనీ ఉచితంగా పంపిస్తోంది.

ఆశ్రమానికి దగ్గరగా వున్న పట్టణంలోని ఇనుప వర్తక సంఘం వారు అవసరమైన ఐరన్ ఉచితంగా సప్లయ్ చేశారు.

వాణిజ్యవేత్తలు ఇటికా, కొంత కొండరాయి సమకూర్చారు.

స్వామి స్వంత డబ్బు పెద్దగా వ్యయంగాకుండానే అధునాతన భవనాలు రూపుదిద్దుకోసాగాయి.

ఒకవైపు ఆశ్రమ నిర్మాణం, ఇతర భవనాల నిర్మాణం జరుగుతుండగానే మరోవైపు ప్రశాంతత అలరారేలా అందమైన పూలతోటలూ, వివిధ రకాల పండ్లమొక్కలూ నాటి సంరక్షణ చేస్తున్నారు.

నిర్మాణాలు మొత్తం కంట్రాక్టర్ లక్ష్మీకాంతం స్వయంగా పర్యవేక్షిస్తున్నారు. స్థలం కొనుగోలు దగ్గర నించీ అన్నీ ఆయనే చేస్తున్నారు. దగ్గర వుండి మరీ పనివాళ్లతో చేయిస్తున్నారు.

★ ★ ★

మార్కండేయులు పనిగట్టుకుని మరీ ప్రచారం చేస్తున్న ప్రకారం స్వామి వారి గతం ఆసక్తికరమైనది.

స్వామి అసలు పేరు పేరయ్య. అయితే అందరూ చిన్నప్పట్నించీ పేరిగాడు అని పిలుస్తుంటారు.

వాళ్లు ఆరుగురు అన్నదమ్ములు. వాళ్లలో ఇతను మూడవవాడు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు ఇతను చిన్నతనంనుంచే సమస్త దుర్గుణ సంపన్నుడు.

తల్లిదండ్రులు నిరుపేదలు. కూలిపనులకి వెళ్తుంటారు. కొద్దిగా పొలం వున్నా అది సరిగా పండే భూమికాదు.

పిల్లల్ని ఉత్తరం ముక్క చదవడం వరకు అయినా చదివిద్దామని తల్లిదండ్రుల కోరిక.

"బడికి పోనాయనా... నాలుగు అక్షరమ్ముక్కలు నేర్చుకుంటే బాగుపడతావురా!" అని తండ్రి బతిమాలీ, బలవంతం చేసీ పేరయ్యని బడిలో వదిలిపెట్టి వచ్చేవాడు.

తండ్రి అలా బడిలో వదిలిపెట్టడమే ఆలస్యం, కొడుకు ఇలా బయటకి తుర్రుమని పారిపోయేవాడు.

చూసీచూసి విసుగుపుట్టి ఒక వయసు వచ్చిన తరువాత ఇక లాభం లేదని తల్లి తండ్రులు పేరయ్యని తమతోపాటే కూలి పనులకి తీసుకుపోవడం మొదలుపెట్టారు.

వాళ్లతో ఒకరోజు పనికి వెళ్తే నాలుగు రోజులు దుమ్మాకొట్టేవాడు.




పిల్లల్ని కూడవెయ్యడంలో మాత్రం చాలా దిట్ట. ఎప్పుడూ నలుగురైదుగురు పిల్లలు వెంట తిరుగుతూ వుండేవాళ్ళు.

"ఒరేయ్... రామయ్యా వాళ్ళ దొడ్లో నారింజచెట్టు బాగా కాయలు కాసిందిరా! ఇవ్వాళ ఆ చెట్టు కాయలు దుమ్ము దులిపేద్దాంరా"

పేరయ్య చెప్పడం, మిగతా పిల్లలు సై అనడం మామూలే.

ఇక ఆరోజు మధ్యాహ్నం ఎవరూలేని సమయంలోనో, రాత్రి వెన్నెల సమయంలోనో ఆ చెట్టుపని పట్టేవాళ్ళు.

పిందెలూ, పూతలతో సహా చెట్టుని దులిపేసేవాళ్ళు.

పేరయ్య ధాటికి ఇంటిపెరడులలో వున్న జామచెట్లు, సపోటా చెట్లు, నారింజచెట్లు, ఉసిరిక చెట్లు బతికేవికావు.

"వెంకయ్య వాళ్ళ దొడ్లో ఉసిరికాయల చెట్లు తెగ కాయలు కాసిందిరా! మిట్ట మధ్యాహ్నంపూట వాళ్ళు ఇంట్లో పడుకుని నిద్రపోతుంటారు. ఇవ్వాళ ఆ చెట్టు పని పడదాంరా" అన్నాడు పేరయ్య ఒకరోజు.

మిగతా పిల్లలు తలలు వూపారు.

ఆరోజు మధ్యాహ్నం పేరయ్య, మరో ముగ్గురు పిల్లలూ వెళ్ళారు.

పేరయ్య ఇంటివెనుక గోడదూకి పెరట్లోకి జొరబడ్డాడు. మిగతా ముగ్గురు పిల్లలూ బయట కాపలా అని చెప్పి వున్నారు.

పేరయ్య ఉత్సాహంగా కాయలు కోయడం మొదలుపెట్టాడు. నిక్కరు రెండు జేబులకీ కాయలు కోశాడు.

వంటగది కిటికీలోనుంచి వెంకయ్య కూతురు దొడ్లోకి ఎందుకో చూసింది.

కాయలు కోస్తూ పేరయ్యా కంటబడ్డాడు.

ఆ అమ్మాయి వెళ్ళి ఇంట్లో వున్న తండ్రికి విషయం చెప్పింది.

వెంకయ్య ఒక్క వుదుటున వెళ్ళి పేరయ్య జుట్టు పట్టుకున్నాడు.

అప్పటికి పేరయ్యా చొక్కా జేబుకి కూడా కాయలు కోశాడు.

వెంకయ్య అరుపులు విని బయటవున్న ముగ్గురు పిల్లలూ కాలి సత్తువకొద్దీ పరిగెత్తి పారిపోయారు.

చేతికి దొరికిన పేరయ్యని వెంకయ్యా వదలలేదు.

"అయ్యో... నాయనో... బాబో... ఇంకెప్పుడూ మీ దొడ్లోకి రానుదేవుడో... నన్ను వదిలిపెట్టు స్వామో..." అని పదేళ్ళ పేరయ్య లబోదిబోమని మొత్తుకున్నా వినకుండా వెంకయ్య నిర్దాక్షిణ్యంగా చితకకొట్టాడు.

"బయట వున్న పిల్లలు ఎవర్రా?" అడిగాడు వెంకయ్య.

ఎవరో చెప్పాడు పేరయ్య.

వెంకయ్య వాళ్ళ ఇళ్ళకి వెళ్ళి ఆ పిల్లల తల్లిదండ్రులకి విషయం చెప్పాడు.

"ఆ పేరిగాడి సావాసం చేయొద్దురా అంటే ఎందుకు చేస్తున్నార్రా మీరు?" అని ఆ పిల్లల్ని వాళ్ళ పెద్దవాళ్ళు దండించారు.

పిల్లలు పేరయ్య స్నేహం చేయడం పిల్లల తల్లిదండ్రులకి ఎవరికీ ఇష్టం వుండేదికాదు.

పేరయ్య వెంట తిరిగితే పిల్లలకి ఇంట్లో బడితెపూజ జరగడం మొదలైంది. దాంతో నెమ్మదిగా పేరయ్య వెంట తిరిగే పిల్లలు ఎవరూ లేకుండా పోయారు.

ఇంట్లో తల్లిదండ్రులతో గాకుండా బయట వ్యక్తులతో అదే తొలిసారిగా పేరయ్యా దెబ్బలు తినడం.

అలా దెబ్బలు తినడం మొదలుపెట్టిన పేరయ్య ఇక వెనక్కి తిరిగి చూడకుండా

ఎన్నో చేశాడు. ఎంతోమంది చేతుల్లో దెబ్బలూ తిన్నాడు. అయినా తన మార్గం లోనే పయనిస్తూ దెబ్బలూ, తన్నులూ తినడం పేరయ్యకి అలవాటైపోయింది.

ఒక విషయంలో కాదు, ఒక సంఘటనలో కాదు. ఎన్నో విషయాల్లో ఎంతోమందితో చెప్పుదెబ్బలూ, కాలిదెబ్బలూ తినడం పేరయ్యకి చిరుతిళ్ళు తినడం అంత తేలికై పోయింది.

తల్లిదండ్రుల మాట వినడం పూర్తిగా మానుకున్నాడు.

మొదట్లో వాళ్లు తిట్టీ, కొట్టీ విసుగుపుట్టి చివరికి పేరయ్య విషయమే పట్టించుకోవడం మానేశారు.

అలా బాల్యంనించే పేరయ్య అల్లరిచిల్లరిగా, బలాదూర్‌గా వూళ్ళో తిరిగేవాడు.

★ ★ ★

వయసు పెరుగుతున్నా పేరయ్య బుద్ధిలో ఎలాంటి మార్పు రాలేదు. ఇంకా అరాచక స్వభావమూ, అవలక్షణాలూ, చెడు బుద్ధులూ ఎక్కువ కావడం మొదలుపెట్టాయి.

పేరయ్యకి పదిహేడో ఏడు వచ్చింది. సోమరిపోతుతనం కూడా హెచ్చింది.

మాటలు బాగా నేర్చుకున్నాడు.

అబద్ధాలు చెప్పడం, బడాయి కూతలు కూయడం బాగా అలవడ్డాయి.

ఆ దశలో పేరయ్యకి మల్లీశ్వరి పరిచయమైంది.

"అదికాదు మల్లీశ్వరీ... ఇవ్వాళ ఈ వూళ్ళో నన్ను ఎవరూ లెక్కచేయడంలేదు. చూస్తుండు, ముందుముందు ఈ వూళ్ళో వాళ్ళంతా నా దెబ్బకి ఎలా డంగైపోతారో"

"అబ్బో... ఏం చేస్తావు పేరయ్యా"

"చూడరాదూ, నీకే తెలుస్తుంది. నాకు చదువులేకపోతేనేం, నా అంత తెలివి కలిగినవాడు ఈ వూళ్ళోకాదు, చుట్టుపక్కల పది మైళ్ళలో ఎవరూలేరు"

"నీకు అంత తెలివి వుందా? "

"లేదా మరి? నాకు ఛాన్స్ దొరక్క వూరుకున్నాను కానీ దొరికితే ఎంత గొప్పవాడినై వుండేవాడినో"

"మరి అంత తెలివి వుంటే నువ్వేం సంపాదించావు? "

"సంపాయిస్తాను చూడు. అసలు నేను నేలమీద నడుస్తాను అనుకున్నావేమో! కారులో తిరిగే జాతకం నాది"

"అబ్బో చాలా వున్నాయే బడాయిలు"

"బడాయిలు అనవద్దు. ఇరవై నాలుగ్గంటలూ పనిచేస్తూ వుంటే మావాళ్ళు ఏం సంపాదించారు? వచ్చిన కూలిడబ్బులు పొట్టకీ, బట్టకీ సరి! ఏం మిగిల్చారు? "

"నిజమే"

"అందుకే గదా నేను పనికిపోనిది. పని చేసీ, చెమటలు చిందించీ డబ్బు సంపాయించిన వాళ్ళు ఈ భూప్రపంచంమీద ఎవరూలేరు. తెలివి వుండాలి డబ్బు సంపాయించాలంటే"

"అలాగే సంపాయించు. నువ్వు సంపాయిస్తే మీ అమ్మానాన్న, రేపు నువ్వు కట్టుకునే పెళ్ళాం, పుట్టే బిడ్డలు సుఖపడతారు"

"నేను ఎవర్నో పెళ్ళి చేసుకుంటాను అనుకున్నావా? "

"మరి? "

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను మల్లీశ్వరీ"

"మా ఆయనకి తెలిస్తే నరికి పోగులు పెడతాడు ఇద్దర్నీ. అసలే ఆయన కోపగాడు"

"ఆయన మనల్నేం చేస్తాడు? నువ్వు ఊ అను. నీకెందుకు మిగతా విషయాలు నేను




చూసుకుంటాను"

"ఏం చూసుకుంటావు? "

"మనం ఎక్కడికైనా వెళ్తే బ్రహ్మాండమైన జీవితం అనుభవిస్తాం. ఇక్కడేం ఉంది, చాకిరి చేసుకోవడం, తినడం, ఏం సుఖం వుంది? " అలా మల్లీశ్వరిని మాటలతో లోబరుచుకున్నాడు.

అమాయకురాలూ, పెద్దగా తెలివిలేని మల్లీశ్వరి పేరయ్య మాయమాటలకి బోనులో పడిపోయింది.

అప్పటికే మల్లీశ్వరికి పెళ్లయి రెండేళ్ళు అవుతోంది. ఒక పిల్లవాడుకూడా.

మల్లీశ్వరిని వశపరుచుకున్న పేరయ్య కొంతకాలం తరువాత ఆమెని వేరేవూరు తీసుకుపోవడానికి అన్నీ సిద్ధం చేశాడు.

ఒకరోజు రాత్రి మల్లీశ్వరిని తీసుకుని వూరు వదిలిపెట్టి పోతుండగా ఎవరో చూసి పట్టుకున్నారు.

పేరయ్యని చెట్టుకి కట్టేసి కొట్టారు. ఒక రోజు అంతా చెట్టుకి కట్టేసి అలానే వుంచారు.

తల్లిదండ్రులు ఇంట్లోకి రానివ్వలేదు.

తల ఎత్తి తిరగడానికి సిగ్గుపడకపోయినా, ఇంట్లో నిరాదరణ లభించడంతో పేరయ్య వూరు వదిలిపెట్టి వెళ్ళిపోయాడు.

★ ★ ★

చేతిలో డబ్బులేదు. ఏ పనీ చేతగాదు.

ముందుగా ఆకలికి పేరయ్య వుండలేకపోతున్నాడు.

తిండికోసం కొన్ని వూళ్ళలో చిన్నచిన్న పనులు కొన్ని చేశాడు. మరి కొన్నివూళ్లలో ఎవరో ఒకరి ఇంటికి వెళ్ళి ఏవో మాయమాటలు చెప్పి ఆ పూటకి తిండి గడుపుకుంటున్నాడు.

రోజుకో వూరు చొప్పున పేరయ్య దేశదిమ్మరి మాదిరిగా తిరుగుతున్నాడు.

ఇలా తిరుగుతున్న పేరయ్య ఒక వూరు చేరుకున్నాడు.

ఆ వూరి మొదట్లోనే ఒక చెట్టుకింద ఒక తను వంట పాత్రలకి మాట్లు వేసుకుంటూ కనిపించాడు.

మాట్లు వేసే విధానం చూస్తూ పేరయ్య ఆ చెట్టుకింద అతని వద్ద కూర్చున్నాడు.

"ఏ వూరు బాబూమీది? " అడిగాడు మాట్లు వేసే అతను. అతనిపేరు కరీం. తనపేరు చెప్పాడు పేరయ్య.

"ఏం పనిమీద వచ్చావు? ఈ వూళ్ళో బంధువులు ఎవరైనా ఉన్నారా? "

"బంధువులు లేరు. ఈ వూళ్ళో ఏదైనా పని దొరుకుతుందేమో అని వచ్చాను. ఊళ్ళోకి వెళ్ళి పని దొరుకుతుందేమో చూడాలి"

"ఏం పనిచేస్తావు? "

"ఏ పని అయినా చేయగలను"

"రెండో మనిషి ఎవరూలేరు. కొద్దిసేపు కొలిమి తిత్తులు వూదు" అన్నాడు కరీం.

పేరయ్య బండమీద కూర్చుని కిందికీ, పైకీ కొలిమి తిత్తులు వూదడం చేశాడు.

కొలిమిలోనే అతను అన్నం వండుకుని, పేరయ్యని కూడా తినమని అడిగాడు. పేరయ్య తిన్నాడు.

కరీం వూరూరూ తిరుగుతూ, మాట్లు వేసుకుంటూ జీవనం గడుపుకుంటాడు. నాలుగైదు నెలలకి ఒకసారి స్వంత వూరు భార్యాపిల్లల దగ్గరకి వెళ్ళి వస్తుంటాడు.

ఆరోజు సాయంత్రం వరకూ పేరయ్య కొలిమి తిత్తి వూదుతూనే కూర్చున్నాడు.

కరీం మధ్యలో ఒకసారి పేరయ్యని వూళ్ళోకి తీసుకుపోయి కడుపునిండా టిఫిన్ పెట్టించాడు.

"రేపు ఇంకోవూరు వెళ్తాను. నువ్వు కూడా

నాతో రారాదూ? " అడిగాడు కరీం.

"నేనెందుకు? "

"నీకు ఈ పని నేర్పుతాను. ఈ పని నేర్చుకుంటే మంచి ఆదాయం వస్తుంది. హాయిగా డబ్బులు సంపాయించుకోవచ్చు"

"సరే వస్తాను, కానివ్వండి" అన్నాడు పేరయ్య.

ఇంటికి వెళ్ళడానికి మనసు అంగీకరించడంలేదు. ఎక్కడికి వెళ్లాలో తెలియడంలేదు.

తాత్కాలికంగా అతని వెంట వెళ్తే రోజులు జరిగిపోతుంటాయి. ముందు తనకి ఒక ఆసరా దొరుకుతుంది.

తను అతని దగ్గరనుంచి ఎప్పుడు వెళ్ళిపోదలుచుకుంటే అప్పుడు వెళ్ళిపోవచ్చు తన ఇష్టం. బలవంతం ఏముంటుంది?

కరీం వెంట పేరయ్య వూరూరూ తిరగడం మొదలుపెట్టాడు.

ఒకరోజు ఒక వూరు వెళ్తారు. ఊరి చివర ఒక చెట్టుకిందనో, పెద్ద వూరు అయితే ఎవరో ఒకరి ఇంటివద్దనో కొలిమి ఏర్పాటు చేసుకుంటారు. ఊళ్ళోకి వెళ్ళి 'మాట్లు వేస్తాం, మాట్లు వేస్తాం' అని కేకలు పెట్టుకుంటూ తిరుగుతారు. పాత్రలూ, బుంగలూ, బిందెలూ, బకెట్లూ తీసుకుంటారు. అవి మాట్లువేసి తిరిగి ఇచ్చి డబ్బులు వసూలు చేసుకుంటారు. అదీ దినచర్య.

ఆ పని నెమ్మదిగా పేరయ్యకి అలవాటై పోయింది.

కరీం, పేరయ్యని జాగ్రత్తగానే కనిపెట్టి చూసుకుంటున్నాడు.

కొలిమిమీద అన్నం వండుకోవడం, మాట్లుకోసం పాత్రలు ఇచ్చిన ఎవరో ఒక గృహిణి ఇంటికి వెళ్ళి కూరో, పచ్చడో తెచ్చుకోవడం, తినడం, ఏదో ఒక బావిదగ్గర స్నానం చేయడం.

సత్రం నిద్ర, మఠం తిండి.

రోజులు జరిగిపోతున్నాయి.

పేరయ్య మాట్లు వేసేపని నెమ్మదిగా నేర్చుకుంటున్నాడు. పని సులువుగానే అలవడుతోంది.

ఊళ్ళో తిరిగి పేరయ్య సామాన్లు తీసుకుంటున్నాడు. రంధ్రాల్ని బట్టి ధరలు కూడా చెప్పడం అలవాటు చేసుకున్నాడు.

ఒకరోజు ఒకావిడ పిలిచింది, "మావి రెండుగిన్నెలు వున్నాయి బాబూ. వాటికి మాట్లువేయాలి"

"తీసుకురామ్మా చూద్దాం" అని పేరయ్య ఆమె వెంట వసారాలోనికి వచ్చాడు.

ఆమె సామాన్లు తీసుకురావడానికి ఇంటి వెనుక వున్న వంటగదిలోనికి వెళ్ళింది.

అంతకుముందు ఆమె భర్త వసారాలో వున్న టేబుల్‌మీద గడియారం పెట్టి బాత్‌రూంలోనికి స్నానానికి వెళ్ళాడు.

సమక్షంలో ఎవరూలేరు. చేతి గడియారం కనబడుతోంది.

పేరయ్య క్షణం ఆలస్యం చేయకుండా గడియారం తీసుకుని జేబులో వేసుకున్నాడు.

ఆమె లోపలనుంచి తెచ్చిన పాత్రలు తీసుకున్నాడు.

"ఈ రెంటికీ మాట్లు వేయాలి బాబూ" ఆమె చెప్పింది.

"యాభై రూపాయలు అవుతాయమ్మా" ఆందోళనతో పేరయ్య అన్నాడు.

"ఏమిటీ... ఈ చిన్న రంధ్రాలకి వేసే అతుకులకి యాభై రూపాయలా? మేం తెలియనివాళ్ళం అనుకుంటున్నావా ఏమిటి? నువ్వు అడిగిన డబ్బు పెట్టి కొత్తవి కొనుక్కోవచ్చు పది రూపాయలు ఇస్తాను. అదీ ఎక్కువే. నీకు ఇష్టమైతే ఇవి తీసుకుపో, లేకపోతే అక్కడ పడేసిపో" అని ఆమె కరాఖం





డిగా చెప్పింది.

"సరే... ఎంతోకొంత ఇవ్వమ్మా" గాభరాతో అంటూ పేరయ్య ఆ సామాన్లు చేత్తో పట్టుకుని పరుగులాంటి నడకతో బయటపడ్డాడు.

మనసు ఆందోళనతోనూ, అలజడితోనూ వుంది. కొత్తవూరు. చిక్కితే ప్రమాదం.

"ఎవరో వెర్రి బాగులవాడి మాదిరిగా వున్నాడు. అడగడం నోరుపట్టకుండా అడిగాడు. తను తగ్గిస్తే మరోరేటు అడక్కుండా, మరోమాట మాట్లాడకుండా తీసుకుపోయాడు. ఎందుకో అంత తత్తరపడుతున్నాడు? " అని నవ్వుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది ఆమె.

ఆమె భర్త బాత్‌రూంలోంచి బయటపడి, బట్టలు మార్చుకుని పూజకు కూర్చున్నాడు. దాదాపు గంటసేపు ఆయన పూజా మందిరంలో కూర్చుని మంత్రాలూ, తంత్రాలూ చదివి, నుదుట బొట్టుపెట్టుకుని ప్రశాంత వదనంతో వసారాలోనికి వచ్చాడు.

టేబుల్‌మీద చూశాడు. గడియారంలేదు.

"ఏమేయ్... ఇక్కడ గడియారం పెట్టాను. ఏమైందే? ఎవరు తీశారు? "

"ఏమో... నాకేం తెలుసండీ? "

"పిల్లలు ఏమన్నా తీశారేమో చూడు"

"వాళ్ళు ఎందుకు తీస్తారండీ? అసలు వాళ్ళు మీరు స్నానాలగదికి వెళ్ళకముందే ప్రయివేటుకి వెళ్ళిపోయారు"

"మరి ఎవరు తీశారే ఎదవ ముకమా? తొందరగా చూడు, పక్కన నాకు వెళ్ళాల్సిన పనివుంది"

"చూడండి. ఎక్కడ పెట్టారో, ఏమో! ఒక చోట పెట్టి ఒకచోట వెదుకులాడతారు? "

ఎక్కడా కనబడలేదు. లేదని నిర్ధారించుకున్నాడు.

"ఇంటికి ఎవరు వచ్చారే? "

"మన ఇంటికి ఎవరూ రాలేదండీ"

"నేను బాత్‌రూంలో వున్నప్పుడు ఎవరితోనో మాట్లాడుతున్నట్లు వుంది కదే"

"మాట్లు వేసే కుర్రాడికి రెండు గిన్నెలు ఇచ్చానండీ. అతను ఏమిటో తత్తరపాటుతో వున్నాడు"

"ఇంకేమిటీ... వాడే తీసి వుంటాడు గడియారం. వసారాలోనికి వచ్చేటప్పుడు బయటే నిలబడమని చెప్పకూడదటే బడుద్ధాయి" అని అతను మాట్లు వేసేచోటుకి, మరో మనిషిని వెంటపెట్టుకుని వచ్చాడు.

అక్కడ పేరయ్య కొలిమి తిత్తి వూదుతూ కూర్చున్నాడు.

"మీలో వూళ్ళోకి వచ్చింది ఎవరయ్యా? " పెద్దగా వుండడంతో కరీంని అడిగాడు.

"మావాడు వచ్చాడు. ఎందుకు? "

"ఇతనేగా వచ్చింది? " పేరయ్యని సమీపించి అడిగాడు.

"ఏం కావాలి మీకు చెప్పండి? "

"ఏం లేదులే" అని కరీంతో చెప్పి, కుర్రాడికేసి చూస్తూ "ఒరే అబ్బాయి... మా ఇంట్లోనించి తీసుకు వచ్చిన వాచీ ఎక్కడ పెట్టావు నాయనా? " అనడిగాడు.

"మీ ఇల్లు నాకేం తెల్సండీ. మీ ఇంట్లో వాచీ నేనెందుకు తెచ్చాను? " పేరయ్య దబాయించాడు.

"ఒరే ముండముకమా... మీది ఏవూరో కానీ, మీవూరు ముకం ఇక చూడవు. మర్యాదగా తీసుకువచ్చిన వాచీ ఇచ్చావా సరే, ఇవ్వకపోయావనుకో... నిన్ను ఇక్కడ కాపాడేవాళ్ళు ఎవర్నూలేరు"

"నేను తీసుకురాలేదండీ!" బింకంగా అన్నాడు పేరయ్య.

"మీ సామాను ఎక్కడుంది? " అని అతను వాళ్ళ సామాను మొత్తం గాలించాడు.

"నిలబడు" అని పేరయ్య ధరించిన బట్టల్ని చేత్తో తడుముతూ వెతకడం మొదలుపెట్టాడు.

అండర్‌వేర్ జేబుకి గట్టి వస్తువేదో తగలడంతో పట్టిచూశాడు.

"ఇదేమిటో తియ్యరా"

అండర్‌వేర్‌కి ఉన్న జేబులో భద్రంగా దాచిపెట్టిన గడియారాన్ని తీయక తప్పలేదు పేరయ్యకి.

"ఎక్కడిదిరా ఈ వాచీ? "

పేరయ్య వంచిన తల ఎత్తలేదు. నేల చూపులు చూస్తూ నిలబడ్డాడు.

"దొంగవెధవా... ఇళ్ళమ్మట తిరుగుతూ ఇదంట్రా మీరు చేసేపని! వాచీ కాబట్టి సరిపోయింది. మరో వస్తువు ఏదైనా అంతేగా! అసలు మీరు మాట్లు వేసుకునేవాళ్ళేనా, పగటిపూట ఇళ్ళు చూసి, రాత్రిళ్ళు ఇళ్ళకి కన్నాలు వేసే దొంగలా? " అని అతను బండబూతులు తిడుతూ పేరయ్యని చెప్పు తీసుకుని టపటపా నాలుగు వాయించాడు.

"వీడు నాకు దారిలో పరిచయమయ్యాడు. ఏవూరివాడో, ఏమిటో కూడా నాకు పూర్తిగా తెలియదు. ఇల్లు వదిలిపెట్టి బికారిగా తిరుగుతుంటే, పోనీలే అని దగ్గరికి తీసి పని నేర్పుతున్నాను. ఇలాంటి దొంగ అనుకోలేదు. పరువు తీశావు కదరా దొంగ వెధవా... ఇక్కణ్ణించి పో! ఇక ఈ దరిదాపులకి వచ్చావంటే నా చేతిలో కూడా నీకు దెబ్బలు వుంటాయి" కరీం కోపంగా వచ్చిన వాళ్ళకి చెప్పి, పేరయ్యని వెళ్ళిపొమ్మన్నాడు.

ఆరోజు సాయంత్రం వరకూ పేరయ్య వూరివెలుపల అక్కడక్కడా తిరిగి, చీకటిపడే సమయానికి మళ్ళీ కరీం దగ్గరకి చేరాడు.

కరీం చాలాసేపు మాట్లాడలేదు. చివరికి అన్నాడు, "వెళ్ళిపొమ్మని చెబితే నీక్కాదురా. నీముఖం నాకు చూపెట్టవద్దు"

"తప్పు అయిందన్నా, ఏదో బుద్ధి గడ్డి తినింది"

"తింటే తిన్నదిలే. వెళ్ళిపో"

పేరయ్య మాట్లాడకుండా అలాగే కూర్చున్నాడు.

కరీం ఎన్ని తిడుతున్నా పేరయ్య మౌనంగా నేలచూపులు చూస్తూ బెల్లంకొట్టిన రాయిలా వున్నాడు.

"మన వూరు కాదు. మనకి తెల్సినవాళ్ళు లేరు. ఇంకొక వూరు వచ్చినప్పుడు ఎంత జాగ్రత్తగా వుండాలీ, ఎంత పద్ధతిగా వుండాలీ, ఎంత గౌరవంగా వుండాలీ"

కరీం ఇంకో నాలుగు తిట్టి, కొద్దిసేపు హితబోధచేసి, తను తిండికి కూర్చుంటూ పేరయ్యకి కూడా తిండిపెట్టాడు.

పేరయ్య మంచి ముఖవర్చస్సు కలిగినవాడు. పట్టుకుంటే కమిలిపోయేటంత సుకుమారంగా వుంటాడు. చక్కటి తెలుపురంగు. సున్నితంగావుంటాడు.

పైగా మంచి ఒడ్డూ, పొడుగూ అందంగా వుంటాడు.

పేరయ్య ఆకారం చూసే కరీంకి జాలి కలిగింది.

మరుసటిరోజు వేకువనే లేచి ఇరువురూ మరోవూరి దారిపట్టారు.

నాలుగు నెలలకి పేరయ్యకి పని వచ్చేసింది.

మాట్లు వేయడం, విరిగిన వస్తువుల్ని అతకడంలాంటి పనులు తనే స్వయంగా బాగా చేయగలుగుతున్నాడు.

కరీం తమ వూరు వెళ్తూ, పేరయ్యని కూడా వాళ్ల వూరు వెళ్ళమని చెప్పి కొంత డబ్బు ఇచ్చాడు.

"ఊరికి వెళ్ళాలంటే ఏమిటోగా వుందన్నా, నేను కూడా నీతోపాటు మీవూరు వస్తాను"

"మా వూరు ఎందుకురా? మా వూరు





దగ్గిరా, దాపా? చాలాదూరం. ఊళ్ళో నెల రోజులుండి ఇటువైపే వస్తాను. మళ్ళీ వద్దు వులే, వుత్తరం రాస్తాను"

పేరయ్య బిడియపడుతూనే స్వంత వూరు వెళ్ళాడు. తల్లిదండ్రుల్ని చూడాలని కూడా లేదు. అయినా వెళ్ళాడు.

చాలాకాలానికి ఇంటికి వచ్చిన కొడుకుని చూసి తల్లిదండ్రులు ఆనందించారు.

ప్రస్తుతానికి పేరయ్యకి ఇంట్లో మంచి ఆదరణే లభించింది.



రెండునెలలు వూళ్ళో వున్న పేరయ్యకి మొహం మొత్తింది.

పనిచేయాల్సిన వయసులో వున్న కొడుకు పనీపాటా లేకుండా కూర్చుని తింటూండ డంతో తల్లిదండ్రులకి కూడా నెమ్మదిగా విసుగుపుట్టి తిట్టడం మొదలుపెట్టారు.

అన్నలు కూడా తిడుతున్నారు. వాళ్ళతో అసలు పేరయ్యకి ఎప్పుడూ సఖ్యతలేదు.

కరీంనుంచి వుత్తరం లేదు.

పేరయ్యకి ఊళ్ళో వుండటం ఇష్టంలేదు. తనకి పనివచ్చు తిరగడమే హాయిగా వుంది.

తను ఒక్కడైనా వెళ్ళిపోవాలని, మాట్లు వేసే సామాను సమకూర్చుకుని, తల్లిదండ్రు లకి చెప్పి ఊరు వదిలాడు.

పేరయ్య ఎక్కడ వున్నా, ఏ పనిచేస్తున్నా మనసు ఎప్పుడూ లక్షలు సంపాదించే విషయం మీదనే వుండేది.

తేలికగా, ఎలాంటి శ్రమా లేకుండా, సుఖంగా లక్షలు లక్షలు ఎలా సంపాదిం చాలా అనే ఆలోచిస్తుండేవాడు.

ఎప్పుడూ డబ్బు ధ్యాసే! డబ్బు రంధే! డబ్బు కోరికలే!

తను ఎప్పుడూ కారుల్లో తిరుగుతున్నట్లూ, తనవెంట పదిమంది వందిమాగధులు వున్నట్లూ, విశాల భవనంలో తను నివశిస్తు న్నట్లు పగటికలలు కనడం మాత్రం మాను కోలేకపోతున్నాడు.

ఒక్కడే మాట్లు వేసుకుంటూ, పనినిబట్టి ఒకవూళ్ళో ఒకరోజు వుంటే మరో వూళ్ళో వారంరోజులు వుంటూ తిరుగుతున్నాడు. తనకి వస్తున్న డబ్బులతో అసంతృప్తిగానే వుండేది.

ఇత్తడీ, రాగి సామాన్లకి మాట్లు వేస్తూ వాటివిలువ బాగా తెలుసుకున్నాడు.

ఒక వూళ్ళో ఒకరి ఇంటిస్థలంలో నాలుగు రోజులు పనిచేసి, ఊళ్ళో నమ్మకం కుదిరిన తరువాత ఐదో రాత్రి తనకి ఇచ్చిన ఇత్తడీ, రాగి సామానులని ఒకగోతంలో కూరుకుని, రాత్రికి రాత్రే వూరు వదిలి సామానుతో ఉడాయించాడు.

మరుసటి రోజు పట్టణంలో ఆ సామా నుని దొంగసామాను కొనే షాపువాళ్లకి అమ్ముకున్నాడు.

చేతినిండా డబ్బులు వచ్చాయి.

వాళ్లు ఆ సామానుని తక్కువ ధరకి కొను గోలు చేసినా పేరయ్యకి డబ్బులు బాగానే గిట్టుబాటు అయ్యాయి.

ఆశ పుట్టింది. దొంగతనం అయితేనేం అన్నిటికంటే ఇది మంచి లాభసాటి పని అనుకున్నాడు.

దగ్గిర దగ్గిర వూళ్లు గాకుండా ఒక వూరికీ మరో వూరికీ ఎక్కువ దూరం వుండే వూళ్లు తిరుగుతూ రెండుసార్లు చక్కగానే సామా గ్రిని దొంగిలించాడు.

మూడోసారి అలానే సామాను గోతానికి కూరుకుని పలాయనం చిత్తగిస్తుండగా వూళ్లోవాళ్లు పట్టుకున్నారు.

దొరికిన పేరయ్యని కట్టిపడేసి శుభ్రంగా దేహశుద్ధిచేసి వదిలిపెట్టారు.

పేరయ్యకి జీవితంలో ఎన్నిసార్లు దేహ

శుద్ధి జరిగినా మనఃశుద్ధి మాత్రం జరగ లేదు. ఏమాత్రం బుద్ధిరావడంలేదు.

తను ఎంచుకున్న మార్గంలోనే ముందుకి అడుగువేయడం అలవాటు చేసుకున్నాడు.

ఇంటికి వెళ్లడం ఇష్టంలేక వూళ్లమీదనే తిరుగుతూ మాట్లు వేస్తున్నాడు.

ఒకసారి ఒక వూళ్లో ఒక ఇంటి దగ్గర మాట్లు వేయడానికి పాత్రలు తీసుకుంటూ మగవాళ్లు ఎవరూ లేకపోవడంతో ఆ గృహిణి చేయి పట్టుకున్నాడు.

"ఎవుడ్రా దొంగలం. కొడకా నువ్వు చెయ్యి పట్టుకుంటావు? "

"చూడక తగిలింది లేవమ్మా"

"చూడక తగిలేది ఏమిటీ, కావాలని చెయ్యి పట్టుకునీ"

"పట్టుకుంటే ఇప్పుడు ఏమైందేమిటి? "

"వదినా... అక్కా... ఇలారండి! వీడు ఎవడో మాట్లు వేసుకునేవాడు గోల చేస్తు న్నాడు" అని ఆమె ఇరుగుపొరుగు ఆడవా ళ్లని కేకలు వేసి పిలిచింది. వాళ్లు అందరూ వచ్చారు. పేరయ్య వాళ్లతో వాదన పెట్టుకు న్నాడు.

వాళ్లు పేరయ్యని చెప్పులు తీసుకుని ఘనంగా సత్కరించారు. పేరయ్య జీవి తంలో ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగి పోయాయి. వీటితో మనిషి ఏమాత్రం చలించకుండా ఇంకా బాగా రాటుదేలిపో యాడు.



"నాకు పెళ్లి చేయి నాన్నా! అమ్మాయిని చూసి మాట్లాడండి" ఇరవై సంవత్సరాల పేరయ్య తండ్రిని అడిగాడు.

"చేసుకుందువులే. ముందు నువ్వు బతక డానికి . ఠికాణా లేదు నువ్వు నిలకడగా వుండి ఏదో ఒక పనిచేసి సంపాదిస్తుంటే అప్పుడు పెళ్లి చేసుకుందువు. నీ ఒక్కడికే తిండి పెట్టడం దండగయితే ఆ వచ్చేదానికి కూడా ఎక్కడ తీసుకువచ్చి పెట్టగలం? "

"నువ్వు మాకు పెట్టవద్దులే. నీ ఉప్పుకోసం ఎవడు ఆశపడతాడు? నా పెళ్లాన్ని నేను మహారాణి మాదిరిగా పోషిం చుకుంటాను"

"పోషించుకోరా. నువ్వు పోషించుకుంటా నంటే ఎవరు వద్దంటారు? అంతకంటే ఇంక కావాల్సిందేం వుంది? "

"మరి ఎందుకు ఆలస్యం? తొందరగా అమ్మాయిని చూడండి"

పేరయ్య పోరు భరించలేక ఒక సంబంధం ఖాయం చేశారు.

అమ్మాయి పేరు ధనమ్మ. పేరుకి ధనమ్మే కానీ పేరయ్యతో పెళ్లికి ధనం ఏమీ ఇవ్వలేమని ముందే చెప్పారు.

వాళ్లకి కొద్దిపాటి ఆస్తిపాస్తులు వున్నాయి.

అయితే ధనమ్మ తల్లిదండ్రులు వృద్ధాప్యం సమీపానికి వచ్చారు. వాళ్లకి పెద్ద వయ సులో పిల్లలు పుట్టారు.

ధనమ్మకి ఒక తమ్ముడు వున్నాడు.

"అబ్బాయి ఇల్లరికం వుండాలి. మేం ముసలివాళ్లం అయ్యాం. మాకు వయసుమీ రిన తరువాత బిడ్డలు పుట్టారు. మా ఆల నాపాలనా చూడటానికి అల్లుడు మా ఇంట వుండాలి. మా కొడుకు చిన్నవాడు. మావాడు పెద్ద అయ్యేవరకూ అల్లుడు మా ఇంట వుంటే రేపు సగభాగం ఆస్తి పంచి ఇస్తాం" అన్నారు వాళ్లు.

పేరయ్య కొంతకాలం ఇల్లరికం వుండటా నికి సంతోషంగానే అంగీకరించాడు.

ఒక ముహూర్తంలో పేరయ్యకీ, ధనమ్మకీ వివాహం జరిగింది.

పేరయ్య ఇల్లరికం వచ్చాడు.

మూడు నెలలు భార్యతో కాపురం చేసిన





పేరయ్య మళ్లీ మాట్లువేసి డబ్బు సంపాదిం చడానికి వూళ్లమీదకి బయల్దేరాడు.

పేరయ్యకి ఏ పని చేస్తున్నా త్వరగా లక్ష లకి లక్షలు ఎలా సంపాదించాలా అనే ఆలోచన మాత్రం వదలకుండా వుంది.

ఊళ్లమీద తిరుగుతున్నాడు. వివిధ ప్రాంతాల్లో రకరకాల మనస్తత్వాలు కలిగిన వ్యక్తుల్ని చూస్తున్నాడు. బాగా లోకజ్ఞానం అలవడింది.



ఒకసారి పేరయ్యకి ఒక వూళ్లో ఒక స్వామి తారసిల్లాడు.

ఆడవాళ్లూ, మగవాళ్లూ, పిల్లలూ, పెద్దలూ అందరూ ఆ స్వామి కాళ్లమీద పడి దణ్ణాలు పెట్టడం, దండిగా డబ్బులు సమర్పించడం, కొబ్బరి కాయలు కొట్టడం, పండ్లూ, పాలూ ఇవ్వడం పేరయ్య చూశాడు.

ఊరి వెలుపల వున్న కల్యాణ మండ పంలో స్వామి వారి విడిది. ఆ మండపా నికి ఎదురుగా వున్న చెట్టుకింద పేరయ్య మాట్లు వేసుకుంటున్నాడు.

ఆ రోజు రాత్రి స్వామి ఒక శిష్యుడితో వూళ్లోనించి సారాయి తెప్పించుకుని తాగాడు. గంజాయి పీల్చాడు.

నడి వేసవికాలం. గాలి లేకపోవడంతో కల్యాణమండపం ఆరుబయటే అన్నీ కాని చ్చాడు.

వంటిమీద బట్టలు వూడిపోయిన విషయం కూడా తెలియలేదు. బాగా నిషా ఎక్కడంతో అసలు మన లోకంలోనే లేకుండా పోయాడు.

అదంతా పేరయ్య గమనిస్తూనే వున్నాడు.

మరుసటి రోజు మళ్లీ భక్తులు ప్రత్యక్షం!

ఆ స్వామికి పూజలూ, పునస్కారాలూ, కొబ్బరికాయలు కొట్టడాలూ, దణ్ణాలు పెట్ట డాలూ.

రాత్రి సదరు స్వామివారు మందుకొట్టి పడిపోయిన విషయం ఆ భక్తులకి తెలి యదు.

పేరయ్య చాలా ఆశ్చర్యపోయాడు.

"ఇలాంటి తాగుబోతూ, గుంటనక్కా దేవు డిగా పూజలు అందుకోవడం ఏమిటి? ప్రజలు ఎంత అమాయకత్వంలో వున్నారు. కనపడిన రాయీ, రప్పకి మొక్కడం సరే దారినపోయే ఏ దానయ్యో వచ్చి నేను దేవుణ్ని అంటే వాడికి పడీపడీ మొక్కుతు న్నారంటే ఏమనుకోవాలి? " అనుకున్నాడు.

సాయంత్రం సమయంలో పేరయ్య పని కట్టిపెట్టి స్వామి వద్దకి వెళ్లి కూర్చున్నాడు. వచ్చేపోయే ఆడవాళ్లని చూద్దామనే ఉద్దేశం తోనే పేరయ్య అక్కడకి వెళ్లాడు. స్వామి సమీపంలో కూర్చుని వచ్చేపోయే భక్తుల్ని, వాళ్ల కోరే కోర్కెల్నీ, స్వామి దీవెనల్ని ఆస క్తిగా గమనించాడు.

పేరయ్య అక్కడ కూర్చుని వుండగానే అతని కళ్లముందే స్వామికి దండిగా కాను కలు వచ్చాయి.

ఆడ, మగ అందరూ ఎలాంటి సంకోచం లేకుండా స్వామికి డబ్బు ఇచ్చారు. అదీ స్వామి అడక్కుండానే! నాలుగు రోజుల పాటు ఆ డబ్బునీ, వస్తున్న ఆడవాళ్లనీ చూసి పేరయ్యకి ఆశ అంకురించింది. తను స్వామి ఎందుకు కాకూడదు?

ప్రజలు చాలా అమాయకత్వంతో వున్నారు. చాలా సమస్యలతో కూడా బాధ పడుతున్నారు.

ఎక్కడో కనపడని దేవుడికంటే ఎదురుగా కళ్లముందు కనపడుతున్న దేవుడ్ని ఆరాధించేవాళ్లు కూడా చాలా మంది వున్నారు. కన పడుతున్న దేవుడు అయితే తాము కోరిన కోరికలకి సమాధానం అయినా ఇస్తాడని భావించి ప్రజలు దేవుడి అవతారం ఎత్తిన మానవుల దగ్గరకి వెళ్తున్నారని పేరయ్య గ్రహించాడు.

జనంలో ఎక్కువగా దైవ నమ్మకాలు వున్నాయి. ఎక్కువ మౌఢ్యంతో వున్నారు.

జనంలో వున్న ఆ నమ్మకాల్నీ, మౌఢ్యాన్నీ తనకి అనుకూలంగా వినియోగించుకోవాలి. వాళ్ల మూఢత్వంతోనే తను ప్రయోజనం పొందాలి. వాళ్ల నమ్మకాలతోనే తన ఆశల్నీ, కోరికల్నీ నెరవేర్చుకోవాలి.

అలా అలా అనుకున్నాక... ఎలా అవతారం ఎత్తాలా అని పేరయ్య ఆలోచనలో పడ్డాడు.

తను స్వామి అవతారం దాలిస్తే కొత్తదనం వుండాలి. ఇంతకుముందు ఏ స్వామీ, ఏ అమ్మవారూ చేయని కొత్త పద్ధతిలో తను వెలిసి విరివిగా ప్రచారం పొందాలి.

మాట్లు వేసేటప్పుడు కొలిమిలో పాత్రలని వేడిచేస్తే అవి ఎర్రగా నిప్పుకణికల్లాగ వస్తాయి. కొలిమిలోనించి తీసిన పాత్రలకి పొరపాటున చేయి తగిలితే చర్మం వూడిపోతుంది. అంతవరకూ వాతపడుతుంది.

అంత మలమల మాడిపోయే పాత్రమీద దోసెడు నీళ్లు కుమ్మరిస్తే 'సుయ్ సుయ్' మంటూ వెంటనే ఆరిపోతుంది. పాత్ర చల్లారిపోతుంది.

ఎంత వేడిని అయినా చల్లబరిచే శక్తి నీటికి వుంది.

మనిషికి ఆహారం లేకపోతే కొంతకాలమైనా బతకగలడు. నీరు లేకపోతే మాత్రం బతకడం అసంభవం.

సమస్త ప్రాణికోటికీ నీరే ఆధారం.

ఏదైనాకానీ నీటిని ఉపయోగించే తను దేవుడి మాదిరిగా పూజలు అందుకోవాలి. ఇంతవరకూ ఎవ్వరూ నీటిని ఉపయోగించి స్వాములు అయిన వాళ్లులేరు. తనేకావాలి.

మాట్లు వేస్తూనే తన ఆలోచనని ఎలా అమలు జరపాలా అనే యోచనలోనే వున్నాడు పేరయ్య.

మాట్లు వేయడానికి ఒకసారి ఒక పెద్ద వూరు వెళ్లాడు పేరయ్య. అక్కడ ఒకరి ఇంటి దగ్గర మకాం పెట్టి, చుట్టుపక్కల వున్న కొంతమంది ఇండ్లవాళ్లు ఇచ్చిన పాత్రలు తీసుకుని మాట్లు వేస్తున్నాడు.

అది ఆడవాళ్ల కూడలి. అక్కడికి వచ్చిన వాళ్లు పేరయ్య చుట్టూచేరారు.

వాళ్లు తమ పాత్రలకి మాట్లు వేయించుకుంటూ మాటలు పెట్టారు.

పేరయ్య వాళ్లతో కల్లబొల్లి కబుర్లూ, కాకమ్మ కథలూ వుత్సాహంగా చెపుతూ బడాయిలు కొడుతున్నాడు.

"మా మరదలు ఒకమ్మాయికి ఏడాది నించీ గాలిసోకిందని అనుమానంగా వుంది" మాటల్లో ఒకావిడ అంది.

"ఎందుకు వచ్చిందేమిటి గాలి" అని అనుమానంగా అడిగాడు.

"ఏమిటేమిటో మాట్లాడుతుంది. మనిషి రోజురోజుకి బలహీనమైపోతున్నది. పోనీ తిండి తగ్గించి తింటుందా అంటే అదేమీ




కాదు. ఎంత తిండితిన్నా ఇంకా ఆకలి అంటూ తిండికోసం ఎదురు చూడాల్సిందే. రాక్షస తిండి"

"నువ్వు చెప్పినవన్నీ దెయ్యం పట్టిన లక్షణాలే! అనుమానంలేదు" అన్నాడు పేరయ్య.

"ఎంతమంది వైద్యులకి చూపెట్టినా ఏమీ లాభం కనబడలేదు. మందులదారి మందులదే, రోగం దారి రోగానిదే, మనిషిదారి మనిషిదే"

"ఇలాంటివి వైద్యులవలన ఏమవుతాయమ్మా? ఏదైనా జబ్బు అయితే మందులు ఇచ్చి తగ్గించగలరు! దెయ్యాన్ని వాళ్లేం చేయగలరు? దెయ్యం వాళ్ల మాట వింటుందా? "

"వినదు... ఏం చేయాలో మాకు అర్థం గాకుండా వుంది. నెత్తిబద్దలు కొట్టుకున్నాం అనుకో"

"అమ్మాయిని నాకు చూపెట్టండి. ఏ జాతి దెయ్యం పట్టిందో చూద్దాం"

"చూసి ఏం చేస్తారు? "

"మాట్లు వేయడమే కాదు, నా దగ్గిర చాలా విద్యలు వున్నాయి. మీకు ఇలా కనపడుతున్నానని ఏమిటో అనుకుంటున్నారేమో! నేను మంత్రించి ఇచ్చిన నీళ్లు తాగితే దెయ్యం పోతుందీ, దాని అబ్బా పోతుంది"

"నీళ్లకి మంత్రం పెడతావా? "

"మరేమిటనుకున్నారు? దెయ్యమేకాదు, నేను ఇచ్చిన జలం తాగితే ఏ రోగమైనా ఇట్టే నిముషంలో తగ్గిపోతుంది. మామూలు రోగం కాదు ఎంత పెద్ద రోగమైనా తగ్గిపోవాల్సిందే"

"మరి ఇన్ని విద్యలు తెల్సినవాడివి ఇలా మాట్లు వేసుకోవడం ఏమిటీ? " వాళ్లు ఆశ్చర్యంగా అడిగారు.

"నా విద్యల్ని ఎప్పుడూ వుపయోగించను. అలా వుపయోగిస్తే విలువ వుండదు. తప్పనిసరి అవసరం అనుకున్నప్పుడు మాత్రమే ఈ అస్త్రం బయటకి తీస్తాను"

"బాగుంది... చంకలో మేకపిల్లని పెట్టుకుని వూరంతా వెతుక్కున్నట్లు వుంది. నీకు అంత శక్తి వుందని మాకేం తెలుసు? మా అమ్మాయికి పట్టిన పిశాచాన్ని వదలగొట్టు. నీకు పుణ్యం వుంటుందీ, నువ్వు కోరిన డబ్బు కూడా ఇస్తాము"

"డబ్బు ఎక్కువ కూడా కాదు. పాతిక రూపాయలు తాంబూలంలో పెట్టి ఇస్తే మంత్రించిన జలం ఇస్తాను. పూర్వం రోజుల్లో అమృతం ఎలాంటిదో ఈ జలం అలాంటిది" పేరయ్య అన్నాడు.

"రోజూ ఎంత డబ్బు రావడంలేదూ, పోవడంలేదు! పాతిక రూపాయలకేం భాగ్యం!" అన్నారు ఆడవాళ్లు.

"ఒక్క దెయ్యమేకాదు, ఏ వైద్యుడికీ తగ్గని మొండిరోగాల్ని తగ్గిస్తాను. పిల్లలు లేనివాళ్లు నేను ఇచ్చిన జలం తాగితే నవమాసాలకి బిడ్డని చంకన వేసుకుని తిరగాలి. గ్రహదోషాలు వున్నవాళ్లు ఈ జలం సేవిస్తే గ్రహదోషాలు తుడిచిపెట్టుకుపోవాల్సిందే" పేరయ్య నోటికి వచ్చిన అబద్ధం చెప్పాడు.

ఆ ఆడవాళ్లు పేరయ్య మాటలు నమ్మారు.

అప్పటికప్పుడే ఈ నోటా ఆ నోటాపడి, పేరయ్యకి వున్న మహిమల గురించి వూరంతా పాకిపోయింది.

జనం రావడం మొదలుపెట్టారు.

మొదటిరోజు ఆరుగురు మాత్రం తాంబూలం, డబ్బూ ఇచ్చారు.

పేరయ్య ఒక గ్లాసులో నీళ్లు తీసుకుని ఏవో మంత్రాల్ని చదివినట్లుగా పెదవుల్ని కదిలించి వాళ్లకి ఆ నీళ్లు ఇచ్చాడు.

రెండవ రోజు జనం పెరిగారు.

పేరయ్య నాలుగు రోజులు ఆ వూళ్లో

రోగాలతోనూ, రొప్పులతోనూ సమస్యల తోనూ వచ్చిన ప్రజలకి నీళ్లు ఇచ్చాడు.

పది రోజుల్లో మాట్లు వేసుకుంటే ఎంత డబ్బు వస్తుందో ఈ నాలుగు రోజుల్లోనే పేరయ్యకి తన నీళ్ల మహిమ వలన అంత కంటే ఎక్కువ డబ్బు వచ్చింది. వచ్చిన డబ్బు తీసుకుని ఆనందంగా ఇంటికి చేరుకున్నాడు.



మాట్లు వేయడానికి మరో వూరు బయల్దేరాడు పేరయ్య. పేరయ్య బావమరిది మార్కండేయులుకి ఇరవై సంవత్సరాల వయసు వుంటుంది. ఈసారి బావమరిదిని వెంటపెట్టుకుని కదిలాడు.

ఇంటి దగ్గరే మార్కండేయులకి చెయ్యవలసిన పనీ, చెప్పవలసిన మాటలూ చెప్పాడు.

బావని మించిన వాడు బావమరిది.

"చూడు బావా నా తడాఖా! ఊరూ వాడా అంతా నీ దివ్యశక్తిని గూర్చి అదిరిపోయేలా ప్రచారం చేస్తాను" అన్నాడు మార్కండేయులు.

ఊరికి వెలుపల గాకుండా ఎవరో ఒకరి ఇంటి ఆవరణలో కూర్చుని మాట్లు వేయడం మంచి వుపయోగంగా కనబడింది పేరయ్యకి.

ఒక ఇల్లు చూసుకున్నారు.

బావమరిది వూళ్లో తిరుగుతూ పాత్రలు తీసుకురావాలి.

పాత్రలకోసం ఒక ఇంటికి వెళ్లాడు మార్కండేయులు. అక్కడ ఒక వ్యక్తి జ్వరంతో బాధపడుతూ పడుకుని వున్నాడు.

"ఏమిటమ్మా ఆయన పడుకునున్నాడు? "

"జ్వరం బాబూ! టైఫాయిడ్"

"మందులు వాడుతున్నారా? "

"వాడుతున్నాం"

"మందులు కాదమ్మా! ఇక్కడ మాట్లువేయడానికి వచ్చాడు మా మేస్త్రీ. మేస్త్రీ దగ్గర మంచి మహత్తు వుందమ్మా"

"ఏం మహత్తు ఏమిటి? "

"ఆయన బయటపడి తన గొప్పదనం ఎవరికీ చెప్పడుకానీ ఆయన మంత్రం పెట్టి ఇచ్చిన నీళ్లు తాగితే ఎంత పెద్ద జబ్బు అయినా ఇట్టే తగ్గిపోతుందమ్మా"

"నిజంగానా? "

"నిజమేనమ్మా! చాలా గొప్పవాడు ఆయన. మాట్లు వేసుకుంటూ తిరుగుతున్నాడుకానీ ఆయన దగ్గిర చాలా మహత్తులు వున్నాయి. మహిమలూ, మహత్తులూ హిమాలయ పర్వతాలకి వెళ్లి అక్కడ నేర్చుకుని వచ్చాడు"

"అంతదూరం వెళ్లి నేర్చుకుని ఈ మాట్లు వేయడం ఎందుకు? "

"ఎందుకంటే ఖర్మ! పెద్ద రుషి కావాల్సిన వాడు. పెళ్లయ్యాకనే హిమాలయాలకి వెళ్లాడు. అక్కడ మహిమలు అన్నీ బాగానే నేర్చుకున్నాడు. తరువాత భార్యాబిడ్డల మీద వ్యామోహం పెరిగి తిరిగి వచ్చాడు. ఇప్పుడు వుదరపోషణకోసం ఇలా ఈ వృత్తి చేసుకుంటున్నాడు"

"డబ్బు ఏమైనా తీసుకుంటాడా? "

ఎంత తీసుకుంటాడో తాంబూలంతో సహా చెప్పాడు మార్కండేయులు.

"ఆ జలం తాగించి చూద్దాం. ఏం పోతుంది? " అన్నాడు ఆ ఇంటి పెద్ద మనిషి.

"నేను చెప్పినట్లు ఆయనకి చెప్పవద్దమ్మా! ఆయన త్వరగా జలం ఎవరికీ ఇవ్వరు. నేను చెప్పానని తెలిస్తే నా మీద కోప్పడతారు. మంచం మీద మనిషిని చూసి ఆయన బాధ చూడలేకనే చెప్పాను మా




మేస్త్రీ విషయం. అంతేకానీ నేనుచెప్పినట్లు తెలిస్తే నాకు చీవాట్లు, దెబ్బలూ తప్పవు" అని భయం నటించాడు మార్కండేయులు.

"నీమీద చెప్పంలే" అని ఇంటివాళ్లు పేరయ్య దగ్గరకి వెళ్లి డబ్బు సమర్పించి మంత్రజలం సేవించారు.

బావమరిది చాపకిందనీరులా చల్లగా, చక్కగా పేరయ్య మహిమల్ని గురించి చాటింపువేసినట్లే అందరికీ తెలియపరిచాడు.

జనం రావడం ప్రారంభించారు.

పేరయ్య రాబడీ పెరిగింది.

బావా, బావమరిదీ కలిసి వూళ్లమీద పడి తిరుగుతూ మహిమలూ, మంత్రాలూ, మహత్తులూ అని జనం దగ్గర డబ్బు దండుకోవడం అలవాటు చేసుకున్నారు.

ఆరు నెలలు గడిచాయి.

వాళ్లే ఆశ్చర్యపడేటంతగా వాళ్ల సంపాదన బాగా పెరిగిపోయింది.

★ ★ ★

"సోది చెప్పేవాళ్ల మాదిరిగానో, పస్తీలు చెప్పే వాళ్ల మాదిరిగానో ఎంత కాలం బావా మనం ఇలా వూళ్లమీద పడి తిరగడం? పైగా ఒక పనికాదు. మాట్లూ, మంత్రాలూ! ఈ ద్విపాత్రాభినయం ఎంత కాలం చేద్దాం?" అడిగాడు మార్కండేయులు.

"ఇంక వూళ్లమీదకి వెళ్లడం ఆపేద్దాంరా!"

"ఆపేసి ఏం చేద్దాం?"

"మనం మన వూళ్లోనే ఆశ్రమాన్ని ఏర్పాటు చేద్దాం"

"ఇక్కడ ఆశ్రమం పెడితే జనం వస్తారంటావా?"

"తప్పకుండా వస్తారు. అయితే బాగా ప్రచారం చేసుకోవాలి"

"ప్రచారం ఎలా చేద్దామంటావు బావా?"

"ముందు కొంత పెట్టుబడి పెడదాం. నెలనెలా జీతం ఇచ్చి కొంతమంది ఏజంట్లని పెట్టుకుందాం. వాళ్లు గ్రామాల్లో తిరుగుతూ మనల్ని గురించి ప్రచారం చేస్తారు. పెద్దపెద్ద కంపెనీల వాళ్లు ప్రచారం కోసం ఏజంట్లని ఎలా పెట్టుకుంటారో మనం కూడా అలానే పెట్టుకుందాం"

"మనం పెట్టిన ఏజంట్ల మాటల్ని జనం ఎలా నమ్ముతారు బావా?"

"వాళ్లు మన ఏజంట్లు అయినా అలా బోర్డు తగిలించుకోరు. వాళ్లు కూడా భక్తులుగానే చలామణి అవుతూ మనల్ని గురించి గొప్పగా, వాళ్ల అనుభవాలుగానే చెపుతారు. ఎదురుగా వున్న మనిషి తన అనుభవాల్ని, తనకి కలిగిన లాభాల్ని చెపుతుంటే ఎవరైనా ఎందుకు నమ్మరు? చచ్చినట్లు నమ్ముతారు. మన ఏజంట్లు వూరికి నలుగురికి చెబితే చాలు, ఆ నలుగురే వూరంతా ప్రచారం చేస్తారు" స్వామి అన్నాడు.

"మనకి ఏజంట్లు దొరకాలి కదా బావా?"

"నెలనెలా జీతం ఇస్తామని చెబితే వందలమంది ఏజంట్లు దొరుకుతారు. వాళ్లకి నెల జీతాలు ఇస్తూ కమీషన్ కూడా పెడదాం. వాళ్లు పంపించిన భక్తుల్ని బట్టి ఒక్కో భక్తుడికి ఇంత అని చెప్పి కమీషన్ ఇద్దాం"

"దూర ప్రాంతంలో కూడా ఏజంట్లని నియమిస్తాను బావా! ఎక్కువమంది ఏజంట్లని పెడదాం"

"అలాగే ఇక ముందు నేను ప్రతిసారీ బయటకి వచ్చి నీతో మాట్లాడాలంటే కుదరదు. బయటి పనులన్నీ నువ్వే చూసుకోవాలి. ఏ రోజు ఏం జరిగిందో, తరువాత ఎలా చేయాలో ఇద్దరం కలసి మాట్లాడుకుందాం. ఇకముందు నువ్వు నన్ను బావా అని పిలవొద్దు. స్వామి అనే పిలవాలి"

"అలాగే స్వామీ" అన్నాడు మార్కండేయులు.



"నేను స్వామిని!" అని పేరయ్య శంకరాపురంలో ఒక చిన్న స్థలంలో ఆశ్రమం ప్రారంభించాడు.

చుట్టుపక్కల గ్రామాల్లో మైకుల ద్వారా భారీగా ప్రచారం చేయించాడు.

మార్కండేయులు ఇతర జిల్లాలు కూడా వెళ్లి స్వయంగా కలుసుకుని ఏజంట్లని నియమించాడు.

ఆ ఏజంట్లు గ్రామాల్లో వీధుల వెంట తిరుగుతూ పండ్లూ, కూరగాయలు అమ్ముకునే చిల్లర వర్తకులూ, మూటల్లో బట్టలు తీసుకుపోయి అమ్ముకునేవాళ్లూ గాజుల వర్తకులూ. వీళ్లు అయితే ఎక్కువగా జనంతో సన్నిహితంగా మెలిగే అవకాశం వుందికాబట్టి వీళ్లని ఏరికోరి ఏజంట్లుగా కుదుర్చుకున్నాడు.

మార్కండేయులు నియమించిన ఏజంట్లలో ఎక్కువమంది స్త్రీలు వున్నారు.

అలాగే గ్రామాల్లో పనీపాటా లేకుండా పోసుకోలు కబుర్లతో తిరిగేవాళ్లు ఎవరువున్నారా అని అన్వేషించి వాళ్లకి కూడా కొంత ఎడ్వాన్స్ ఇచ్చి ఏజంట్లని చేశాడు.

ఏజంట్లు ముందుగా స్వామి వద్దకి వచ్చి మూడు రోజులు ఆశ్రమంలో వుండి స్వామి వారి మహిమల్ని తిలకించి వెళ్లిపోయారు.

వాళ్లు వాళ్ల వ్యాపారాలు చేసుకుంటూనే స్వామి మహిమల్ని గురించి తమ కష్టమర్లకి చెప్పడం మొదలుపెట్టారు.

"స్వామి వారి మహిమలు మహిమలు కావమ్మా! మీరు ఏ కోరిక కోరుకున్నా ఇట్టే తీరిపోతుందనుకోండి. స్వామివారు ఇచ్చిన నీళ్లు తాగితే పిల్లలు లేని వాళ్లకి ఖచ్చితంగా పిల్లలు పుడుతున్నారమ్మా! ఎక్కడినించి వచ్చిందోకానీ ఆ జలానికి అంత శక్తివుంది. అక్కడ ఎంతోమంది ఆడవాళ్లు స్వామివారు ఇచ్చిన నీళ్లు సేవించి తాము నీళ్లోసుకున్నామని చెప్పారమ్మా. కార్లు వేసుకుని పెద్ద పెద్ద ఆఫీసర్లు కూడా వస్తున్నారమ్మా. మా ముందు ఒకావిడ వచ్చింది. బస్సు అంత కారు వేసుకుని వచ్చారు. బందరంట వాళ్లది. ఆమెకి 20 ఏళ్లనించీ పిల్లలు లేరు. కనపడిన ప్రతిస్వామికీ మొక్కారట. దేశంలో వాళ్లు తిరగని తీర్థక్షేత్రం లేదని చెప్పిందమ్మా! కన్యాకుమారినించి కాశీదాకా అన్ని తీర్థాలూ పోయారట. ఇరవై ఏళ్లుగా వాళ్లు చేయని ప్రయత్నమే లేదంట. ఒక వైపు వయసు మళ్లిపోతున్నది. ఎవరో చెబితే నీళ్లస్వామి ఆశ్రమానికి వచ్చారు. స్వామి ఇచ్చిన నీళ్లు తాగింది. ఆమెకి ఇప్పుడు ఏడో నెలట. ఆమే చెప్పింది మాకు ఇవన్నీ" ఆ ఏజంట్లు ఆమెని చూసినట్లే, ఆమెతో స్వయంగా మాట్లాడినట్లే చల్లగా ప్రచారం చేసిపెడుతున్నారు.

స్వామి ఇస్తున్న డబ్బుకి లొంగిపోయి కొందరూ అమాయకత్వంతో కొందరూ రకరకాల కట్టుకథలు సృష్టించి ప్రచారం చేశారు. అందర్నీ హిప్నటైజ్ చేసేలా భారీ ఎత్తున ప్రచారం కొనసాగింది.

నీళ్ళస్వామి పిల్లలు పుట్టించే స్వామిగా ప్రజల్లో గుర్తింపు పొందాడు.

భక్తులు రావడం మొదలుపెట్టారు.

స్వామివారి ఆశ్రమం అనతికాలంలోనే అద్భుతంగా అభివృద్ధి చెందింది. గుంపులు గుంపులుగా, తామరతంపరగా, వేలం వెర్రిగా వరద తాకిడి వచ్చినట్లే వెల్లువలా భక్తులు వస్తున్నారు.

స్వామివారు కూడా వూహించనివిధంగా వస్తున్న భక్తుల సంఖ్యపెరిగిపోయింది.

స్వామివారి ఆశ్రమంతో శంకరాపురం గ్రామ ప్రజానీకానికి చాలా ఇబ్బందిగా





వుంది.

ఆదివారం వస్తోందంటే వూరి ప్రజలు భయంతో వణికిపోయే పరిస్థితి దాపురించింది.

ఆరోజు వేకువనించీ సోమవారం ఉదయం వరకూ మైకుల గోలతో భజనలు చేస్తూ హోరెత్తిస్తున్నారు. భజనలతోపాటు ఉత్సాహంగా పెద్ద పెద్దగా అరవడం!

భయంకరమైన ఆ శబ్దకాలుష్యాన్ని గ్రామప్రజానీకం భరించలేకపోతున్నారు.

మైకుల రొదకి నిద్రపట్టక నానా అవస్థలూ పడుతున్నారు. రాను రాను ఆ గోల చీదరగా, జుగుప్సాకరంగా తయారైంది.

నీళ్ళస్వామిని కీర్తిస్తూ, వెర్రి పాటలు పాడుతూ, ఎన్నెన్నో బృందాలు 24 గంటలు చేసే భజనలతో ప్రజలకి పిచ్చిపట్టేలా తయారైంది.

భజనల గోలే గాకుండా వస్తున్న భక్తులతో కూడా గ్రామప్రజలకి ఇబ్బందిగా వుంది.

అది అసలే చిన్నవూరు. కనీస వసతులూ, నామమాత్రపు సౌకర్యాలు కూడా లేనివూరు.

వూరికి ఎక్కువ సంఖ్యలో భక్తులు వస్తూండటంతో నివాసితులు ఇబ్బందులు పడాల్సివస్తోంది.

ఆశ్రమంలో అంతమంది భక్తులకి వసతులు లేవు. దానితో భక్తులు వూరిమీద పడుతున్నారు.

ఊళ్ళో మంచినీటి వసతి లేదు. ప్రజలు కిలోమీటరు దూరంలో వున్న ఏరునుంచి మంచినీళ్ళు తెచ్చుకుంటారు.

అలాంటిది భక్తులు గ్రామీణుల ఇండ్ల వద్దకి వెళ్ళి మంచినీళ్లు అడగడం, ఒక్కరోజుకి మీ ఇంటివద్ద విశ్రమిస్తామని ప్రాధేయపడటం, అక్కడ కూర్చుని వెంటతెచ్చుకున్న భోజనాలు తింటామని కోరడం చేస్తున్నారు.

వసతి లేకపోవడంతో భక్తులు మలమూత్రాలు ఎక్కడపడితే అక్కడ విసర్జిస్తున్నారు. దానితో వూరంతా దుర్గంధభూయిష్టం అయింది.

అంతకుముందు వూరివాళ్ళు నీళ్లస్వామి ఒక్కడినే తిట్టేవాళ్లు. ఇప్పుడు వస్తున్న భక్తుల్ని కూడా ముఖంమీదే తిడుతున్నారు.

ఈ భక్తుల గోలతోపాటు మైకుల రొదని కూడా భరించలేక, కనీసం మైకుల గోలని అయినా ఆపాలనే ఉద్దేశంతో కుర్రవాళ్లు కొంతమంది ఒకచోట చేరారు.

"ఇదేమిట్రా బాబూ... ఈ మైకుల రొద ఎంతకాలం భరిద్దాం? ఆదివారం వస్తే మైకుల శబ్దానికి టీవీల్లో మాటలు వినిపించడంలేదు. నిద్రపట్టడం లేదు. చెవులు చిల్లులుపడి పోతున్నాయి. పోనీ ప్రశాంతంగా పనులు చేసుకుందామన్నా కుదరడం లేదు"

"ఆశ్రమమా, పాడా? అసలు అది ఆశ్రమమంట్రా? వాడు దేవుడా? వాడి దెబ్బకి వూళ్ళో జనం కూడా వుండేపని లేదురా ఇక. ఎంత తలనొప్పి పుట్టిపోతోంది. మైకులు లేకుండా ప్రతిరోజూ వాళ్ళ ఇష్టం వచ్చినంతసేపు భజనలు చేసుకోమనండి. ఎవరికీ అభ్యంతరం వుండదు. అంతేకానీ ఈ గోలేమిటి? వెళ్ళి తేల్చుకుందాం" అని మరికొందరు అన్నారు.

అందరూ కలిసి నిర్ణయించుకుని ఒక ఆదివారం నీళ్ళస్వామి ఆశ్రమం వద్దకి మైకులు ఆపమని అడగడానికి వెళ్ళారు.

"మా ఇష్టం. మేం మైకులు పెట్టేది పెడతాం. మీరెవరు? మైకులు వద్దని చెప్పడానికి మీకేం హక్కుంది? కలికాలం కాకపోతే దేవుడి భజనలు వద్దని చెప్పడం ఎంత పాపం! నీళ్ళస్వామి మంచివాడు

కాబట్టి మిమ్మల్ని క్షమించి వదిలిపెట్టాడు. స్వామివారు కానీ శపిస్తే మీరు మాడి మసైపోతారు. అంతకు అంత అనుభవిస్తారు, ఏమనుకున్నారో" అని ఆశ్రమ ముఖ్యశిష్యులూ, భక్తులూ వూరివాళ్ళని శాపనార్థాలు పెడుతూ తగాదాకి పూనుకున్నారు.

పెద్ద గొడవ జరిగింది. పెద్ద పెద్దగా అరుచుకున్నారు.

అలా తగాదాతో ఆ ఆదివారం తెల్లవారిపోయింది.

"వచ్చే ఆదివారం మైకులు పెట్టండి. మీ అంతు చూస్తాం. ఆశ్రమం ఆనవాళ్ళు కూడా లేకుండా పీకిపారేస్తాం" అని గ్రామీణులు ఆశ్రమ నిర్వాహకుల్ని సవాల్ చేసి వచ్చారు.

"మేం మైకులు లేకుండా భజనలు చేసే పనిలేదు. వచ్చేవారం కూడా చేస్తాం. మీరు ఏం చేస్తారో చేసుకోండి. మీరు చేసినప్పుడు చూద్దాం" అని కొందరు భక్తులు వూరివాళ్లకి ప్రతిసవాల్ విసిరారు.

మరుసటివారం వచ్చింది.

కొద్దిగా తక్కువ శబ్దంతో చాలా మైకులు అమర్చి భజనలు చేయడం మొదలుపెట్టారు.

తమ మాటని బేకాతరు చేసి మైకులు పెట్టడంతో వూరివాళ్ళకి చాలా ఆగ్రహం కలిగింది. మైకులు పెట్టిన వాళ్ళ సంగతి తేలుద్దామని కర్రలు తీసుకుని ఆశ్రమంమీదకి దండెత్తారు.

ఊరివాళ్ళకంటే ముందే సర్కిల్ ఇన్స్పెక్టరూ, కొంతమంది పోలీసులూ ఆశ్రమానికి వచ్చి సిద్ధంగా వున్నారు.

సిఐ తను స్వామివారి భక్తుడ్ని అని బాహాటంగానే అందరికీ చెపుతాడు. కనీసం నెలకి ఒక్కసారైనా స్వామి దర్శనానికి వస్తాడు.

విషయం తెల్సిన వెంటనే సిఐ ఎంతో ఆనందంతోనూ, భయభక్తులతోనూ స్వామివారికి ఇలాగైనా సేవచేసే మహాద్భాగ్యం కలిగిందనే ఉత్సాహంతో పోలీసుల్ని వెంటపెట్టుకుని ఆశ్రమానికి వచ్చాడు.

సిఐ డిఎస్పీగా ప్రమోషన్‌కోసం ఎదురు చూస్తున్నాడు. స్వామి భక్తుడు కావడం, ఆశ్రమాన్ని అనేకసార్లు సందర్శించడంలోని మర్మం అదే.

స్వామికి మంత్రుల వద్ద, ఇతర పోలీస్ ఉన్నతాధికార్ల వద్ద వున్న పలుకుబడి సిఐకి తెలుసు. స్వామి ద్వారా ప్రయత్నిస్తే తనకి సులువుగా పని జరుగుతుందని సిఐ గుర్తించాడు.

ఆశ్రమం చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ, స్వామివారి నమ్మిన భక్తుణ్ణి అనీ, వారిని నిత్యం పూజిస్తాననీ స్వామిని ప్రసన్నం చేసుకున్నాడు.

స్వామి కూడా సిఐ భక్తికి మెచ్చి, ప్రమోషన్ ఇప్పించడానికి తన ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

ఆశ్రమం మీదకి తగాదాకి వచ్చిన ప్రజలు సిఐనీ, పోలీసుల్నీ చూసి ముందు కొద్దిగా జంకినా, న్యాయం తమవైపే వుందికదాని మైకుల రొద, భక్తులు చేసే న్యూసెన్స్ సిఐకి చెప్పడం మొదలుపెట్టారు.

మాటల సందర్భంలో కొందరు నీళ్ళస్వామిని గురించి హేళనగా మాట్లాడారు.

దానితో సిఐ ఉగ్రుడైపోయాడు.

"ముందు మీకు మక్కెలు విరుగుతాయి. పద్ధతిగా మాట్లాడటం అలవాటు చేసుకోండి. రోజూ వేలాదిమంది ప్రజలు పూజించే స్వామిని, ఒక గొప్ప వ్యక్తిని గురించి నోటికి వచ్చినట్టు మాట్లాడుతున్నారు. విషయం చెప్పండి. అంతే స్వామివారిని దూషించారో లాక్కుపోయి లాక





ప్‌లో తోసి క్రిమినల్ కేసు బనాయిస్తాను. మిమ్మల్ని ఎవడూ కాపాడలేడు. జాగ్రత్త" దురుసుగా మాట్లాడిన యువకుల్ని హెచ్చ రిస్తూ సిఐ అన్నాడు.

"మైకుల రొద భరించలేకపోతున్నాం సార్. వాటిని ఆపివేయించండి. అంతకంటే ఇంకేమీ వద్దు"

"మైకులు లేకుండా భజనలు చేస్తే ఏం బావుంటుందయ్యా? పైగా రోజూ మైకులు పెడుతున్నారా? వారానికి ఒక్కరోజు! మీరు ఒక్కరోజుకి కూడా సర్దుకోకపోతే ఎలా?" ముందు బెదిరించిన సిఐ మళ్ళీ మెత్తగా నవ్వుతూ అన్నాడు.

సిఐ ఆశ్రమం వైపునించే, వాళ్ళకి ప్రయో జనం కలిగేలా రాజీ చేశాడు. రాజీ ప్రకారం ఆశ్రమంలో తక్కువ స్థాయిలో రెండు మైకు గొట్టాల ద్వారానే భజనలు చేసుకుంటారు. లో వాల్యూంలో తప్ప మైకు పెట్టడానికి వీల్లేదు.

రాజీకి యువకులు గునుసుకుంటూనే తలలు వూపి సమ్మతం తెలిపి వెళ్ళిపో యారు.

తరువాత రెండుమూడు వారాలు శబ్దం తగ్గించి పెట్టినా మళ్ళీ మామూలు అయిపో యింది. నెమ్మదిగా శబ్దం పెంచేశారు.

"ఒరేయ్. ఇంక వూరుకోకూడదురా! ఆరోజు మైకులు తగ్గించి పెడతామని సిఐ ముందు ఒప్పుకున్నారా? మళ్ళీ యథాప్ర కారం సౌండ్ పెంచేశారు. ఇలాగైతే లాభం లేదు. ఇవ్వాళ వెళ్ళి మైకులు తీసుకుపోయి ఏట్లో పారేసివద్దాం. పోలీసులు ఏంచేస్తారో చూద్దాం" అనుకుని ఆదివారం రాత్రి యువ కులు కొంతమంది ఆశ్రమం మీదకి వెళ్ళారు.

భక్తులకీ, వీళ్ళకీ తగాదా పెద్దది అయింది.

యువకులు పౌర్జన్యంగా మైకులు తీసు కుని వచ్చేశారు.

తెచ్చిన మైకులు ఒకరి ఇంటి వద్ద పెట్టారు.

తెల్లవారకముందే పోలీసులు జీపు వేసు కుని వూళ్ళోకి ప్రవేశించారు. రాత్రి ఆశ్రమం మీదకి వెళ్ళిన యువకులు ఎవరో ఎంక్వ యిరీ చేసి ముఖ్యులు ఎనిమిదిమందిని జీపులో వేసుకుని వెళ్ళిపోయారు.

వాళ్ళ తల్లిదండ్రులూ, బంధువులూ బిడ్డల్ని విడిపించుకోవడానికి పోలీస్‌స్టేషన్ వద్దకి వెళ్ళారు. వాళ్ళు అలా రెండు రోజులు స్టేషన్ చుట్టూ తిరిగినా ప్రయో జనం లేకపోయింది.

నీళ్ళస్వామికి పోలీస్ యంత్రాంగంలో వున్న పలుకుబడీ, గుర్తింపూ గ్రామ ప్రజలకి స్పష్టంగా అర్థమైపోయింది.

నీళ్ళస్వామి అనుమతి లేనిదే తమ పిల్లలు విడుదల కారు అనే విషయం తొందరగానే గ్రహించారు.

మనసులోనూ, పైకి కూడా వ్యతిరేకత, చులకన భావం వున్నా అవసరం కోసం నీళ్ళస్వామి వద్దకి వెళ్ళారు.

"నాకు తెలియదు. స్వామినని కూడా లెక్కలేకుండా నోటికి వచ్చినట్లు దూషించా రుకదా! ఇప్పుడు అనుభవించండి" అన్నాడు నీళ్ళస్వామి.

"స్వామీ స్వామీ ఏదో పిల్ల వెధవలు. తెలీసీ తెలియకా మాట్లాడారు. ఈ ఒక్కసా రికీ క్షమించండి స్వామీ" వూరివాళ్ళు ప్రాధే యపడ్డారు.

"సరే... ఇంకెప్పుడూ ఆశ్రమంమీదకి రాకూడదు. నన్నుకానీ, భక్తుల్ని కానీ నిందించకూడదు. మీకు ఇష్టమైతేనే నాకు పూజలు చేయండి, లేకుంటే చేయవద్దు. ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. భక్తుల్ని కూడా మీరు నిందించకూడదు" అని నీళ్ళ

స్వామి వూరివాళ్ళని హెచ్చరించి, పోలీసులు తీసుకుపోయిన వాళ్ళని ఫోనుచేసి విడిపించాడు.

మైకుల రొద మళ్ళీ మామూలే.

ఊళ్ళోవాళ్ళకి నీళ్లస్వామి అంటే ఆగ్రహం ఇంకా పెరిగిపోయినా, ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో పడిపోయారు.



నలభై ఎకరాల సువిశాల స్థలంలో అత్యంత ఆధునికంగా సకల సౌకర్యాలతో స్వామి ఆశ్రమంకోసం సుందరమైన భవన నిర్మాణం పూర్తయింది.

ఆశ్రమం ఆవరణలోనే మరోవైపు సిమెంట్ రేకులతో నాలుగు పెద్ద షెడ్లు రూపుదిద్దుకున్నాయి.

బావమరిది మార్కండేయులు వెళ్ళిపోయిన తరువాత ఆశ్రమ నిర్వహణభారం మొత్తం స్వామి కొడుకు బుల్లిస్వామి చూస్తున్నాడు.

ఆశ్రమం నిర్మాణం, షెడ్లనిర్మాణాలు బుల్లిస్వామి కంట్రాక్టర్ లక్ష్మీకాంతం వెంట వుండి తెలుసుకుంటూ, కూలీలమీద ఆజమాయిషీ చేస్తూ పనుల్ని పర్యవేక్షిస్తూ హోదా వెలగబెట్టాడు.

బుల్లిస్వామి వయసు 19 సంవత్సరాలు. పది తరగతులవరకూ చదువుకున్నాడు.

ఒక వాణిజ్యవేత్త తనకి వ్యాపారంలో బాగా కలిసివచ్చి ఎక్కువ లాభాలు రావడంతో స్వామి కరుణా కటాక్షవీక్షణాలతోనే తనకి వ్యాపారంలో అంతకుముందెన్నడూ రాని ఆదాయం వచ్చిందని విశ్వసించి, కృతజ్ఞతాపూర్వకంగా స్వామివారికి మారుతికారు బహూకరించాడు.

చిన్నతనంనించీ వ్యాపారంలో మునిగితేలుతున్నా, స్వామి వద్దకి రాకపూర్వం ఎప్పుడూ ఆ వాణిజ్యవేత్తకి అంత అధిక ఆదాయలు రాలేదట. స్వామిని దర్శించి వెళ్ళిన తక్షణం వూహించలేనంత ఎక్కువ ఆదాయం వచ్చిందని సంబరపడిపోతూ కారుని సమర్పించాడు స్వామికి.

ఆ వాణిజ్యవేత్త టన్నులకొద్దీ వంటనూనెని ఒక రహస్య ప్రదేశానికి తరలించి నిల్వచేశాడు. తరువాత కొద్దిరోజులకి వంటనూనెకి మార్కెట్లో కొరత ఏర్పడింది. కొరతతో విపరీతంగా ధర పెరిగింది. అప్పుడు వాణిజ్యవేత్త తన వద్ద వున్న సరుకు అమ్మడం మొదలుపెట్టాడు. ధరలు ఎక్కువ కావడంతో కాసులవర్షం కురిసింది. కుబేరుడైపోయాడు.

ఇప్పుడు బుల్లిస్వామి కారు లేనిదే కాలు కింద మోపడు.

ఏ చిన్న పనికి అయినా, ఏ కొద్దిదూరం అయినా విలాసవంతంగా కారులో వెళ్ళిరావడం బుల్లిస్వామికి అలవాటైపోయింది.

వాణిజ్యవేత్త బహూకరించకముందే నీళ్ళస్వామి ఎక్కడికైనా వెళ్ళడానికి వీలుగానూ, హుందాగా వుండటానికీ ఏ.సి. కారు కొనుక్కున్నాడు.

కొత్త ఆశ్రమం ప్రారంభం ఇంకా జరగ




లేదు.

నిర్మాణం మొత్తం పూర్తయి, తుదిమెరుగులు దిద్దుకుంటున్న ఆశ్రమాన్ని చూడటానికీ, పనుల్ని పర్యవేక్షించడానికీ, బుల్లిస్వామి ఆశ్రమానికి వచ్చాడు.

మరో కారులో పెద్దస్వామి కూడా వేంచేశాడు.

"ఈ భవనంలో ఆశ్రమాన్ని ఎప్పుడు ప్రారంభిద్దాం నాన్నా?" బుల్లిస్వామి అడిగాడు.

"మంచిరోజు చూసుకుని త్వరలోనే ప్రారంభిద్దాం" ఏదో ఆలోచిస్తూ పరధ్యానంలో అన్నాడు నీళ్ళస్వామి.

"మంచిరోజు ఎప్పుడు వస్తుంది?"

"నిజానికి మంచిరోజు ఏముంది? ముఖ్యమంత్రికి ఎప్పుడు ఖాళీ దొరికి, ఆశ్రమ ప్రారంభోత్సవానికి ఎప్పుడు వస్తాడో అప్పుడే మంచిరోజు"

"ఈ ముసలి ముఖ్యమంత్రి ఎందుకు నాన్నా? ఈయన లేస్తే కూర్చోలేడూ, కూర్చుంటే లేవలేడు"

"ముసలివాడు అయితేనేం, ముఖ్యమంత్రే కదా. రాష్ట్రంలో రాజకీయంగా ముఖ్యమంత్రిని మించిన గౌరవనీయమైన వ్యక్తి ఎవరు వుంటారు? అలాంటి వ్యక్తిచేత ప్రారంభం చేయిస్తే ఇక మనకి ఎదురువుండదు. మొదట మనకి మంచి పబ్లిసిటీ దొరుకుతుంది. జనం మనల్ని ఇంకా ఎక్కువ నమ్మే అవకాశం వుంది. విమర్శలు తగ్గిపోతాయి. అధికారులూ, పోలీసులూ మన మాటకి విలువ ఇస్తారు. ముఖ్యమంత్రితో పరిచయాలు పెరిగితే మనకి అవసరమైన పనులు కూడా క్షణాలమీద జరిగిపోతుంటాయి. ఇంకా చాలా లాభాలు వున్నాయి. ముఖ్యమంత్రితో ప్రారంభం చేయిస్తే!"

"బావుంది నాన్నా! చాలా మంచి ఐడియానే"

"అందుకేగదా ముఖ్యమంత్రి కోసం ఎదురుచూడటం! ఆరోజు ఏర్పాట్లు అన్నీ అద్భుతంగా వుండాలి. ముఖ్యమంత్రితో పాటు ఇతర మంత్రులూ, ఎంఎల్ఏలూ, ఎంపిలూ, సినిమాస్టార్లూ, పెద్ద పెద్ద అధికార్లూ ఇంకా అనేకమంది ప్రారంభోత్సవానికి వస్తారు. భోజనాల దగ్గరనించీ వసతులవరకూ అన్నీ బ్రహ్మాండంగా వుండాలి"

"అవన్నీ నేను చూస్తాలే నాన్నా! రంగులు వేసే పని కూడా ఇవ్వాళా, రేపటితో పూర్తయిపోతుంది. ఇక ఆశ్రమానికి సంబంధించి చేసేపని ఏం లేనట్లే. త్వరగా ప్రారంభం జరిపించే ఏర్పాట్లు చేయండి" బుల్లిస్వామి అన్నాడు.



ఆశ్రమంనించి దెబ్బలు తిని బయటకి వచ్చిన నీళ్ళస్వామి బావమరిది మార్కండేయులు కొద్దికాలం తర్వాత తను కూడా ఒక స్వామి అవతారం ఎత్తాలని నిర్ణయించుకున్నాడు.

అన్నిటికంటే ఇది మంచి వ్యాపారం. లాభసాటి సంపాదన.

పెట్టుబడి లేదు. ఖర్చు లేదు. శ్రమలేదు. చెమట చుక్క చిందాల్సిన అవసరం లేదు.

నాలుగు మాయమాటలూ, అబద్ధం మాటలూ, నోటికి వచ్చిన కల్లబొల్లి మాటలూ చెబితే చాలు!

విలాసవంతమైన, సుఖవంతమైన జీవనం అనుభవించవచ్చు

నీళ్ళస్వామి అంత వున్నతస్థితికి చేరుకోవడానికీ, లక్షలాది రూపాయలు సంపాదించడానికీ తను ఎంతో పాటుపడ్డాడు. బావకి ఎంతోమంది ధనికులూ, అధికార్లూ, రాజకీయ నాయకులూ భక్తులు కావడానికి తెర వెనుకా, తెరముందూ తను చేసిన కృషి ఎంతో వుంది.

విశ్వాసఘాతకుడు! తనని వెళ్ళగొట్టాడు.

వచ్చే సంపాదన అంతా అతను ఒక్కడే అనుభవించాలా? తను అనుభవించడానికి వీల్లేదా? తను కొంత డబ్బు తీసుకోకూడదా?

దొంగతనమట. అతను చేసేది మరి దొరతనమా?

ముందే చెబితే తన చేతికి డబ్బు దొరకనిచ్చేవాడా? చివరికి ఎక్కువ డబ్బు దొరకబుచ్చు కోకుండానే తనని వెళ్ళగొట్టాడు.

తన పథకం మొత్తం అనుకున్నట్లు జరిగితే ఇంతకు నాలుగయిదు రెట్లు డబ్బు తను దారి తప్పించి వుండేవాడు. తనే పెద్ద పొరపాటు చేశాడు.

ఒకరిమీద ఆధారపడేదేమిటి? తను కూడా ఎప్పుడో స్వామి అవతారం ఎత్తివుండవలసింది!

పొరపాటు జరిగిపోయింది. బావ తనని ఇంత త్వరగా వెళ్ళగొడతాడనుకోలేదు.

తను లేకపోతే బావ పని సున్నా అనుకున్నాడు.

ఆయన పని సున్నా కాదు, తన పనే సున్నా అయిపోయింది.

తను లేకపోయినా ఎంత త్వరగా, ఎంత వేగంగా, ఎంత ఎత్తయిన భవనాలు లేచాయి.

ఆలోచిస్తున్న మార్కండేయులకి నీళ్ళస్వామి అంటే కోపంగా వుంది. ఆ భవనాల్ని చూసి సహించలేకపోతున్నాడు.

ఎలాగైనా నీళ్ళస్వామిని దెబ్బతీసి, తన తడాఖాని నిరూపించుకోవాలనీ, తన ప్రత్యేకతని ప్రదర్శించుకోవాలనీ మార్కండేయులకి కోరికగా వుంది.

భార్య పార్వతికి కూడా నీళ్ళస్వామి అంటే ఆగ్రహమే!

ఆమెని అడిగాడు మార్కండేయులు. "ఏం చేద్దాం పార్వతీ... వాళ్ళపని ఇప్పుడు మహాస్పీడుగా వుంది. వాళ్ళ ఆట ఎలా కట్టిద్దాం?"

"మనం ఏలా చేస్తామండీ? ఏం చేయలేం"

"అంతే అంటావా?"

"ఆయన్ని జనం పూర్తిగా నమ్మేశారు. భక్తులు ఆయన మాయలో పడిపోయారు. ఆయనకి వ్యతిరేకంగా ఎవరు ఏం చెప్పినా భక్తులు ఇవ్వాళ నమ్మేస్థితిలో లేరు"

ఆ మాటలతో నీరుగారి పోయాడు మార్కండేయులు.

పోనీ, నీళ్ళస్వామి మీద తను పగ తీర్చుకోలేకపోయినా ఆయన్ని తలదన్నేలా తను ఎదగాలి.

నీళ్ళస్వామి ఆశ్రమం. ఎదురుగానే తను కూడా ఓ ఆశ్రమం ప్రారంభిస్తే?

లాభంలేదు. జనం తనని అంత తేలిగ్గా నమ్మరు.

"ఎందుకండీ లేనిపోని ఆలోచనలూ, కోరికలూ? వాళ్ళ విషయం మరచిపోయి ముందు మన విషయం చూడండి. ఉచితంగా వస్తున్న డబ్బుకదా అని విలాసంగా బతకడం నేర్చుకున్నాం! రేపట్నించీ ఎలా బతకాలి? ఇక్కడ మీరు అందరికీ తెలుసు! ఇక్కడ ఆశ్రమం పెట్టి స్వామిని అంటే జనం నోట్లో వూస్తారు. ఎక్కడైనా దూరదేశం వెళ్ళి స్వామి అవతారం ఎత్తితే నెగ్గుకు రాగలరు. ఆ ప్రయత్నం చేయండి" అంది పార్వతి.

మార్కండేయులకి కూడా అదే సబబు అనిపించింది.

చాలా రకాలుగా ఆలోచించి, భార్యతో సంప్రదించి, చివరకి మూడు జిల్లాలు దాటి నాలుగో జిల్లాలో పాదం మోపాడు.




అది బాగా వెనుకబడిన జిల్లా.

ఆ జిల్లాలో నీళ్ళస్వామి పేరు కొద్దిమంది వినివున్నా ఆయన ప్రభావం అసలు లేదు.

మార్కండేయులు ఆశ్రమం ప్రారంభించ డానికి అనువైన ప్రదేశం కోసం జిల్లా అంతటా ఒకసారి ప్రదక్షిణ చేసివచ్చాడు. చివరికి వెనుకబడిన ఆ జిల్లాలో మరీ వెను కబడిన ప్రాంతాన్ని ఆశ్రమం కోసం ఎన్నిక చేశాడు.

నీళ్ళస్వామికి ఇవ్వకుండా ఎగనామం పెట్టి తెచ్చుకున్న డబ్బు మార్కండేయుల వద్ద వుంది.

ఆ డబ్బుతో ప్రధాన రహదారికి పక్కనే కొంత స్థలం కొనుగోలు చేశాడు. అందులో ఆశ్రమం కోసం ఒక చిన్న బిల్డింగూ, భక్తులు వుండటానికి ఒక పెద్ద పూరిపాకా నిర్మించాడు.

స్థలానికీ, బిల్డింగ్‌కీ, కారుల్లో తిరిగినం దుకూ, విలాసజీవితం గడిపినందుకూ మొత్తంమీద మార్కండేయుల వద్ద వున్న డబ్బు అయిపోయింది.

★ ★ ★

"ముఖ్యమంత్రి రావడం చాలా కష్టంరా! బహుశ ఆయనకి రావడం కుదరదు" మంత్రి శివలింగం అన్నాడు నీళ్ళస్వామితో.

"మరి ఏం చేద్దాం సార్ అయితే? "

"ముఖ్యమంత్రి రాడు. గవర్నర్ కోసం ప్రయత్నిస్తాను. వచ్చే అవకాశం వుంది. వేరే పనేం వుండదులే. రాష్ట్రంలో వున్న గుళ్లూ గోపురాలూ తిరగడం, కనపడిన రాయీ రప్పలకి మొక్కడమే వాడిపని. ఇలాంటి పూజాకార్యక్రమం అంటే తప్ప కుండా వస్తాడు"

"మరి మాట్లాడి ఆయన్ని తీసుకురండి సార్!"

"నేను సిటీకి వెళ్ళిన వెంటనే గవర్నర్ కోసం ట్రై చేస్తాను. మంచిరోజు చూడు. ఆరోజు వీలుగాకపోతే, వాడికి వీలైనప్పుడే మంచిరోజనుకుని ప్రారంభం చేయిద్దాం"

"తప్పకుండా వస్తాడంటారా సార్? "

"రావచ్చనే కదరా చెప్పడం. వాడితో పాటు హైకోర్టు చీఫ్ జస్టిస్‌కోసం కూడా ప్రయత్నిస్తాను. ఆయనకి కూడా దైవనమ్మ కాలు ఎక్కువ"

"చీప్ జస్టిస్ కూడా వస్తే బాగుంటుంది సార్"

"చీప్ కాదురా నాయనా... చీఫ్ జస్టిస్..."

"అదేసార్... మీరు చేసే ప్రయత్నం మీద ఆధారపడి వుంటుంది వాళ్ళు రావడం"

"ఇద్దర్లో ఒకర్ని ఖాయంగా తీసుకువ స్తాను. విదేశీయులు కూడా ఆశ్రమానికి ఎక్కువమంది వచ్చేలా కృషిచేయాలి. వాళ్లని బాగా ఆకర్షించాలి. మనదేశం వాళ్ళు వందమంది వచ్చినా విదేశీయులు నలుగురు వచ్చినా ఒకటే. విదేశీయుల ద్వారా మనకి చాలా ఆదాయాలు వున్నాయి"

"ఏం ఆదాయాలు సార్? "

"మనకి పార్టీలు దొరికితే ఫారిన్ కరెన్సీ మార్చుకోవచ్చు. ఎంతో ఆదాయం వస్తుంది. అది తెలివిగా జరగాలి. కొద్దిరో జుల్లో నాకు అమెరికా టూర్ వుంది. అధి కార పర్యటనకి ఒక బృందాన్ని తీసుకుపో తున్నాను. అక్కడ అమెరికాలో వున్న భక్త లకి నీ గురించి చెపుతాను. వాళ్ళే మిగతా పని నడిపిస్తారు. భక్తుల రూపంలోనూ, టూరిస్టుల రూపంలోనూ వస్తారు ఎక్కు వగా" చెప్పాడు మంత్రి శివలింగం.

నీళ్ళస్వామితో మాట్లాడిన మంత్రి శివ లింగం రాజధానికి వెళ్లి, గవర్నర్‌ని కలిసి ప్రారంభోత్సవానికి ఆహ్వానించాడు.

చాలా సంతోషంతో తన అంగీకారాన్ని తెలియచేశాడా భక్తాగ్రేసరుడు.



భారీ ఏర్పాట్లుమధ్య, అత్యంత ఆడంబరంగా నూతన భవనాల్లో నీళ్లస్వామి ఆశ్రమం, ఇతర సంస్థల ప్రారంభోత్సవం జరుగుతున్నది.

ప్రారంభిస్తున్నది రాష్ట్ర గవర్నర్.

ఉత్సవానికి అతిరథ మహారథులూ, వివిఐపీలు వచ్చారు.

జిల్లాస్థాయిలోనూ, రాష్ట్రస్థాయిలోనూ బాధ్యతలు నిర్వహిస్తున్న పెద్దపెద్ద అధికార్లూ, మంత్రులూ, న్యాయాధిపతులూ చాలామంది వచ్చారు.

ఇక భక్తులకి అంతులేదు. దూరప్రాంతాలనుంచి కూడా ప్రత్యేక బస్సులు ఏర్పాటు చేసుకుని అసంఖ్యాక భక్తజనసందోహం తరలివచ్చింది.

వేదికమీద స్వామికి ఒకవైపున గవర్నర్, మరోవైపున రాష్ట్రమంత్రీ ఆశీనులయ్యారు. వేదికని అత్యున్నత పదవులలో వున్న కొందరు ప్రముఖులు కూడా అధిష్ఠించారు.

సభకు అధ్యక్షత వహించిన మంత్రిగారు లేచారు.

"స్వామివారు మన జిల్లాలో జన్మించడం, ఇక్కడే ఆశ్రమం స్థాపించడం మన జిల్లా ప్రజానీకం చేసుకున్న అదృష్టం. అసలు పేరు పేరయ్యస్వామి అయితే స్వామివారు ఇస్తున్న తీర్థం కారణంగా నీళ్ళస్వామిగా ప్రసిద్ధుడయ్యారు. స్వామిని అందరూ నీళ్ళస్వామి అనే పిలుస్తున్నారు. ఆ పేరు ఎబ్బెట్టుగా వుంది. అందుకే స్వామివారి పేరుని వారికోరికా, అనుమతితోనే ప్రేమానందస్వామిగా మారుస్తున్నాం. స్వామివారు ప్రజలకి ప్రేమా, ఆనందం పంచుతున్నారు కాబట్టి వారికి ఈ పేరు చక్కగా నప్పుతుందనే భావిస్తున్నాం. ఇకనుంచీ మన స్వామిపేరు నీళ్లస్వామి కాదు, ప్రేమానందస్వామి"

భక్తులు పెద్ద ఎత్తున చప్పట్లతో తమ హర్షాన్నీ, ఆమోదాన్నీ తెలిపారు.

తరువాత గవర్నర్ లేచారు.

"శ్రీ ప్రేమానందస్వామివారు భక్తులు కోరిన వరాలు ఇచ్చి, అంతటితోనే తృప్తిపడకుండా సమాజ శ్రేయస్సుని కూడా కాంక్షించి, సామాజికసేవా కార్యక్రమాలకి పూనుకోవడం నిజంగా ముదావహం. అనాధబాలికల ఆశ్రమపాఠశాల, అనాధ మహిళల సేవా సదనం ప్రారంభిస్తున్నారంటే స్వామివారికి మహిళలంటే ఎంతటి గౌరవం, ఎంత ఆరాధన, ఎంతప్రేమ వున్నాయో, మహిళల్ని స్వామివారు ఎంత పవిత్రంగా పూజిస్తారో వేరేగా చెప్పవలసిన అవసరంలేదు. స్వామివారి సేవా కార్యక్రమాలకి ప్రత్యేకించి ఈ రెండు సంస్థలకీ ప్రభుత్వపరంగా అవసరమైన సహాయసహకారాలు అందించే కృషి చేస్తానని హామీ ఇస్తున్నాను"

రాష్ట్ర గవర్నర్ స్వామివారి సేవా కార్యక్రమాల గురించి అనర్గళంగా, ఉత్తేజపూరితంగా ఇచ్చిన ఉపన్యాసానికి భక్తులనుంచి పెద్ద ఎత్తున చప్పట్లు మోగాయి.

స్వామివారు వేదికమీదనే వేలాదిమంది ఆహూతుల సమక్షంలో గాలిలో చేయితిప్పి వజ్రపు ఉంగరం తెప్పించి గవర్నర్‌గారికి బహూకరించారు. గవర్నర్ సంతోషాతిశయంతో ముగ్ధులైపోతూ వుంగరాన్ని స్వీకరించారు.

వేదికమీద ఒక పక్కగా నిలబడిన శిష్యుడు మైకు వద్దకి వచ్చి నినాదాలు ఇచ్చాడు.

"శ్రీశ్రీశ్రీ ప్రేమానందస్వామికి జై
ప్రేమానంద మహారాజ్‌కీ జై"





భక్తులు ఆకాశాన్నంటే నినాదాలు పలి కారు.

స్వామివారు లేచారు. "సమాజానికి ఎన్నో సేవాకార్యక్రమాలు చేయాలని నా మనసులో వుంది. నేను సేవచేసే కార్యక్ర మాలలో ఈ రెండు సంస్థలూ తొలి అడుగు మాత్రమే. మానవసేవే మాధవ సేవ! మహోన్నతులైన నా భక్తుల కృషి ఫలితంగానే ఈ రెండు సంస్థలూ రూపుది ద్దుకున్నాయి. అంతా భగవదేచ్ఛ! నేను నిమిత్తమాత్రుణ్ణే" అని బహిరంగవేదికమీద వినమ్రంగా చెప్పారు.



మార్కండేయులు నీళ్ళస్వామి వద్ద వున్న ప్పుడు పాలమీగడలాంటి తెల్లటి వస్త్రాలు ధరించేవాడు. చక్కగా ప్రతిరోజూ షేవ్ చేయించుకుంటూ పెద్దమనిషి తరహాలో వుండేవాడు.

ఇప్పుడు, తను స్థాపించదలచిన ఆశ్రమ ప్రాంతానికి వెళ్ళడానికి ముందు తెల్లవ స్త్రాల్ని విసర్జించి కాషాయబట్టలు ధరించడం ప్రారంభించాడు. అలాగే గడ్డాలూ, మీసాలూ పెంచాడు.

"శ్రీశ్రీశ్రీ మార్కండేయ స్వామివారి పవిత్ర ఆశ్రమం.

స్వామివారు మీ కష్టాల్ని నూనె మహా త్మ్యంతో పరిష్కరిస్తారు" అని ఆశ్రమం ఎదురుగా రహదారిమీద వాహనాల్లో వెళ్ళే ప్రయాణీకులకు కనపడేలా పెద్ద బోర్డ్ని వేలాడదీశారు.

స్వామివారి మహిమల్నీ, మంత్రాల్నీ, మహత్యాల్నీ వర్ణిస్తూ ఆడియో క్యాసెట్లు తయారు చేయించాడు. ఫలానా తేదీన ప్రారంభం అనికూడా నిర్ణయించాడు.

రెండు రిక్షాలకి మైకులు అమర్చి క్యాసె ట్లతో పరిసర గ్రామాల్లో ప్రచారహోరు ప్రారంభించాడు.

ఆశ్రమం ప్రారంభం చేయించడానికి ప్రముఖ వ్యక్తులు ఎవర్ని పిలుద్దామా అని యోచించి చివరికి ఆ ప్రాంత ఎంఎల్ఏని పిలవాలని భావించాడు.

నాలుగురోజులు ప్రయత్నించగా ఐదోరో జున ఎంఎల్ఏ దొరికాడు. తన కోరిక చెప్పాడు మార్కండేయస్వామి.

"ఏమిటీ ఆశ్రమం ప్రారంభిస్తారా? ప్రారంభించి ఏం చేస్తారు? " ఎంఎల్ఏ అడిగాడు.

"భక్తుల కోర్కెలు తీరుస్తాను" సంతో షంతో చెప్పాడు స్వామి.

"ఏమేం కోరికలు తీరుస్తారు? "

మార్కండేయస్వామి తను చేయబోయే మహాత్యాల్ని వర్ణించి ఉత్సాహంగా చెప్పాడు.

"మీరు కళ్ళజోడు ఎందుకు పెట్టుకు న్నారు? " అడిగాడు ఎంఎల్ఏ.

"కొద్దిగా సైట్ వుందిసార్"

"అది ఒకరోగమే కదా? ఆ చిన్న రోగాన్నే తగ్గించుకోలేని మీరు జనం రోగాల్ని ఏం తగ్గిస్తారు? "

"కళ్ళకీ, రోగానికీ సంబంధంలేదు సార్. పెద్దపెద్ద రోగాల్ని తగ్గిస్తాను" ఏం మాట్లా డితే ఏం తంటా వస్తుందో అని భయపడు తూనే చెప్పాడు స్వామి.

"బాగుంది. చిన్నప్పుడు మా పాఠ్యపుస్త కంలో ఒక కథ వుంది. కందుకూరి వీరేశ లింగం అని ఒకాయన వుండేవాడు. భవి ష్యత్ చెపుతానని ఒక పండితుడు ఆయన తల్లితండ్రుల దగ్గరికి వచ్చాడు. చిన్నవా డుగా వున్న ఈయన ఒక రాయి తీసుకుని ఇది మీకు తగుల్తుందా, లేదా చెప్పమ న్నాడు. జస్ట్, ఒక నిముషంలో జరగబోయే సంఘటనే చెప్పలేనప్పుడు ఇక భవిష్యత్ ఏంచెపుతావులే దయచేయమన్నాడు.

అలాంటి ప్రశ్నే అడుగుతాను, చెప్పగలరేమో ప్రయత్నించండి. సమాధానం చెబితే నేను మీ భక్తుడ్ని కావడమేకాదు, నియోజకవర్గంలో నా అనుచరులు అందర్నీ కూడా మీ భక్తుల్ని చేస్తాను. ఇది మీకు తగిలేలా నేను కొడతానా లేదా చెప్పండి" టేబుల్ మీద వున్న పేపర్ వెయిట్ తీసుకుని అడిగాడు ఎంఎల్ఏ.

ఎంఎల్ఏ ధోరణికీ, వూహించని ప్రశ్నకీ స్వామి ఖిన్నుడైపోయాడు. నోటిమాట రాలేదు.

పారిపోవడానికి వాకిలివైపు చూడటం మొదలు పెట్టాడు.

ఎంఎల్ఏ స్నేహపూర్వకంగా నవ్వుతూ అన్నాడు, "పిచ్చివాడా... నేను మూర్ఖుడ్ని కానోయ్. సన్యాసుల్నీ, స్వాముల్నీ, బాబాల్నీ నమ్మను. వాళ్ళందరూ దొంగలే"

"క్షమించండి సార్. వస్తాను సార్" అని మార్కండేయస్వామివారు ముఖాన నెత్తురు బొట్టులేని స్థితిలో వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

ఆ ఎంఎల్ఏ కమ్యూనిస్టుపార్టీవాడు. ఒకప్పుడు సిద్ధాంతాన్ని చదువుకున్నవాడే. మూఢనమ్మకాలకి దూరంగా వుంటాడు.

ప్రారంభ కార్యక్రమానికే పరాభవం ఎదురుకావడంతో మార్కండేయస్వామి కలత చెందాడు.

చివరికి ఆ వూరి సర్పంచ్‌తో ప్రారంభకార్యక్రమం ఏర్పాటు చేశాడు.

భక్తులు చాలా కొద్దిమందే వచ్చారు.

తాము చేసిన మైకుల ప్రచారానికి చాలామంది భక్తులు వస్తారని భావించాడు. అయితే తక్కువమంది రావడంతో నిరుత్సాహపడిపోయాడు.

"ప్రజల్లో రోజురోజుకీ దైవభక్తి తగ్గిపోతున్నది. పాపం పెరిగిపోతున్నది. భూమికి త్వరలో పెద్దముప్పు ఏర్పడబోతున్నది. ఇలాంటి కష్టసమయంలోనే పాపాలు తగ్గించడానికి దేవుడు మమ్మల్ని పంపించాడు" అని నూనెస్వామి ప్రారంభంలో చెప్పాడు.

తరువాత భక్తుల ముందే డజను కొబ్బరికాయలు కొట్టాడు.

అందరూ చూస్తూనే వున్నారు.

ఆశ్చర్యకరంగా ఆ కొబ్బరికాయలనించి నీళ్ళకి బదులుగా మల్లెపూలూ, కనకాంబరాలూ, సన్నజాజులూలాంటి చిన్నిచిన్ని పూవులు వచ్చాయి.

భక్తులు ఆనందంతో చప్పట్లు కొట్టారు. వాళ్ళకి ఆశ్చర్యంగా విచిత్రంగా వుంది.

"ఇవి దేవతలు దేవలోకం నించి ప్రత్యేకంగా పంపించిన పుష్పాలు. ఈ పుష్పం వున్నంతసేపూ ఆపద మీ దగ్గరకి రాదు" స్వామి చెప్పాడు.

ఆ పూలు భక్తులు ఒక్కొక్కరికి ఒక్కో పువ్వు ఇచ్చాడు.

స్త్రీలు ఆ దేవతా పుష్పాల్ని కళ్ళకి అద్దుకుని తలలో పెట్టుకోగా, పురుషులు చెవుల్లో పెట్టుకున్నారు.

"ఇప్పుడు కణకణమండే నిప్పులమీద నడుస్తాను" అని మార్కండేయుల స్వామి ఎర్రగా కాలుతున్న నిప్పు కణికలు పోసి, వాటిమీద నడిచాడు.

స్వామి నిప్పులమీద నడవడంతో వచ్చిన భక్తులు విభ్రాంతి చెందారు.

తరువాత స్వామి మహిమగల నూనె ఇవ్వడం ప్రారంభించాడు.

భక్తులు 50 గ్రాముల కొబ్బరినూనె కొని తెచ్చుకుంటారు. స్వామి ఆ నూనెలో వేలు పెట్టి, ఆ వేలుని భక్తుల తలమీద రాస్తాడు. ఆశీర్వదించినట్లుగా వేలుకి అయిన నూనె వెంట్రుకలకి రాస్తాడు.

తరువాత భక్తులు చిటికెడు అంటే ఏడె




నిమిది బొట్లు నూనె కడుపులోనికి సేవించి, మిగతా నూనెని తలకి రాసుకుంటారు.

అంతే! ఆ నూనెతో వాళ్ళ సమస్యలు పరిష్కారమైపోతాయి.



రోజులు జరిగిపోతున్నాయి.

ప్రేమానందస్వామి ఆశ్రమం దినదినాభివృద్ధి చెందుతోంది. భక్తులు రావడం పెరిగింది.

గతంలో మాదిరిగా భక్తులు ఎప్పుడు పడితే అప్పుడు స్వామిని దర్శించుకునే అవకాశంలేదు.

పాస్‌ల పద్ధతి ప్రవేశపెట్టారు.

పాస్ కలిగిన భక్తులకి ఎప్పుడైనా ఆశ్రమ ప్రవేశం లభిస్తుంది కానీ సాధారణ భక్తులకి ఆదివారం మాత్రమే స్వామివారి ప్రత్యేకదర్శనం, తీర్థం దొరుకుతాయి.

ఆరోజంతా ఎందరు భక్తులైనా ఆశ్రమంలోనికి రావచ్చూ, పోవచ్చూ, ఆరోజు గేట్లు పూర్తిగా తెరుస్తారు.

ఆశ్రమానికి కొంతమంది శిక్షణ పొందిన సాయుధులతో రక్షణ ఏర్పాటుచేశారు. చీమకూడా లోనికి వెళ్ళడానికి వీల్లేనంతగా రక్షణ వ్యవస్థ ఏర్పాటు జరిగింది.

స్వామిని గాఢంగా నమ్మిన భక్తులకి మాత్రమే ఆశ్రమ పాస్‌లు ఇచ్చారు. పాస్‌లు పొందినవారిలో ఎక్కువమంది ధనికులు వున్నారు. వాళ్ళు ఎప్పుడైనాసరే ఆశ్రమంలోనికి రావచ్చు.

స్వామివారి కార్యాలకి వేటికైనా పాస్‌లు పొందిన భక్తులు వేల రూపాయలు విరాళాలు సమర్పిస్తూ వుంటారు.

రాధికా, రామక్రిష్ణా దంపతులకి కూడా పాసులు వున్నాయి. నూతన ఆశ్రమ ప్రారంభోత్సవానికి వాళ్ళుకూడా వచ్చి స్వామికి భారీగా, పెద్దమొత్తంలో విరాళం ఇచ్చారు.

ఆశ్రమ ఆవరణలోనే ఒకవైపు మూడు ఎకరాల స్థలంలో అనాధ బాలికల ఆశ్రమ పాఠశాల, అనాధ మహిళల సేవాసదనం వున్నాయి. దేశంలో అనాధలకి తరుగు లేదన్నట్లుగా పాఠశాలలోనూ, సదనంలోనూ బాలికలూ, మహిళలూ పూర్తిగా నిండిపోయారు.

ఈ రెండు సంస్థలలో ఆశ్రయం పొందినవాళ్ళకీ, అందులో పనిచేస్తున్న సిబ్బందికీ వసతులు ఏర్పాటు చేశారు.

పాఠశాలలో పనిచేయడానికి కూడా అనాధ మహిళల్నే ఏరికోరి ఉపాధ్యాయులుగా నియమించారు.

సదనంలోని అనాధ మహిళలకి కుట్లూ, అల్లికలూ, ఇతర చేతి వృత్తులలో శిక్షణ ఇస్తారు. శిక్షణ అయిన తరువాత వాళ్ళు ఆశ్రమంలోనే తమ వృత్తుల్ని ప్రారంభించుకోవచ్చు. వాళ్ళు తయారుచేసిన వస్తువులకి మార్కెటింగ్ చేసే సౌకర్యం కూడా ఆశ్రమం వాళ్ళే కల్పిస్తారు.

పాఠశాల, సదనం సంస్థల ఆవరణలోనికి ఆశ్రమ శిష్యులు మినహా ఇతర పురుషులు ఎవరికీ కూడా ఎప్పుడూ ప్రవేశం వుండదు.

స్వామివారికి కొత్తగా శిష్యులూ, శిష్యురాళ్ళూ పెరిగారు.

ఎక్కువ జీతం చెల్లిస్తూ పెద్దవయసు కలిగిన ఒక మహిళా డాక్టర్ని కూడా నియమించారు. ఆమెకి వైద్యంలో పెద్దగా నైపుణ్యం లేకపోయినా ఆశ్రమవాసులు బైటికి వెళ్ళకుండా ఆమె సేవలు వినియోగించుకోవచ్చు.

ఆమె స్వామికి పరమభక్తురాలు కూడా!

ఊరికీ, ఆశ్రమానికీ సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. ఆశ్రమంలో వుండేవాళ్ళు బయటికి వెళ్ళే అవసరమే వుండదు. అన్ని సౌకర్యాలు ఆశ్రమంలో సమకూర్చారు.

ఆశ్రమమే ఒక ప్రత్యేక ప్రపంచం!

దీర్ఘరోగాలతో బాధపడుతూ వచ్చేవారికీ, పిల్లలు కావాలనే కోరికతో వచ్చేవారికీ, దెయ్యాలూ, భూతాలూ వదిలించుకోవడానికి వచ్చే భక్తులకీ ఆశ్రమంలో రకరకాల స్థాయిల గదులు నిర్మించారు.

ఒకటో కేటగిరీ, రెండో కేటగిరీ, మూడో కేటగిరీ భక్తుల కోసం ఇలా మూడు కేటగిరీల రూములు వున్నాయి. వారివారి ఆర్థిక పరిస్థితిని బట్టి వారికి అవి కేటాయిస్తారు. స్టార్ హోటళ్ళలోని రూముల్ని తలపించే రూములు కూడా ఆశ్రమంలో వున్నాయి.

ఒక కేటగిరీ రూములకీ, మరో కేటగిరి రూములకీ ఎలాంటి సంబంధం వుండదు. ఒకచోటునుంచి ఇంకోచోటుకి వెళ్ళడానికి వీల్లేదు.

ఒక బిల్డింగ్‌కీ, మరో బిల్డింగ్‌కీ, ఒక షెడ్‌కీ మరో షెడ్‌కీ సంబంధం లేకుండా తీగలతో, పొదలాంటి మొక్కల కంచె వేసి కట్టుదిట్టం చేశారు.

దిగువస్థాయి భక్తులు వుండే గదులకీ, ఉన్నతస్థాయి భక్తులు వుండే గదులకీ, స్వామి ఆశ్రమానికీ, పాఠశాల, సేవాసదనం భవనాలకీ, షెడ్లకీ ఎలాంటి సంబంధం లేదు. అన్నీ వేటికి అవే విడివిడిగా వున్నాయి.

భక్తులు ఆశ్రమంలో వుండాలంటే గూఢచారుల్లాంటి కొందరు శిష్యులు అనేకరకాలుగా పరిశీలించి, పరీక్షించిన అనంతరం కొన్ని షరతులకి లోబడే అనుమతిస్తారు.

స్వామి నూతన ఆశ్రమం ప్రవేశం జరిగిన తరువాత భక్తులు అక్కడ వుండడానికి ఎక్కువగా . అనుమతి లభించడంలేదు. దానితో . తాత్కాలికంగా నివాసం వుండే భక్తులు తగ్గిపోయారు.

★ ★ ★

రాధిక, రామక్రిష్ణ దంపతులకి పండంటి కొడుకు పుట్టాడు.

వాళ్ళకి స్వామిమీద భక్తి రెట్టింపైంది.

పుట్టిన మూడునెలలకి స్వామి దర్శనానికి పసికందుని తీసుకువచ్చారు.

"మీ ఆశీర్వచనం కారణంగా మాకు పిల్లవాడు కలిగాడు స్వామీ! మా వంశం నిలిచింది. అసలు మాకు పిల్లలు పుట్టరేమో అని కూడా కలత చెందాం. మా ఇంటిపేరు మాతోనే అంతరించిపోతుందని భయపడ్డాం. మాకు వున్న ఆస్తిపాస్తులు మొత్తం ఎవరో లోకులకి ధారాదత్తం అవుతాయనుకున్నాం. మీ దర్శనభాగ్యం వలనే మా ఇంటిదీపం వెలిగింది స్వామీ" భక్తితో రామక్రిష్ణ అన్నాడు.

"అంతా భగవదనుగ్రహం. భగవంతుడే మనకి బిడ్డల్ని ప్రసాదిస్తాడు. నేను కేవలం భగవంతుని ప్రతినిధిని మాత్రమే. దేవుడు ఆజ్ఞాపించి చేయమని చెప్పిన పనులు చేయడం వరకే నా బాధ్యత. బిడ్డలు లేని వాళ్ళకి బిడ్డల్ని కలిగించమని దేవుడు నన్ను ఆదేశించడం వలనే నేను ఆ పనులు చేస్తున్నాను. శివుడు ఆజ్ఞ లేనిదే చీమ అయినా కుట్టదు అంటారు కదా. దేవుడు చూపు పడనివాళ్ళకి పిల్లలు పుట్టరు" వినయవిధేయతలతో నెమ్మదైన స్వరంతో నీళ్ళస్వామి అన్నాడు.

"పిల్లవాడికి మీరు నామకరణం చేయండి స్వామీ"

"పిల్లవాడికి ఎన్నో నెల? "

"మూడో నెల"

"ఈ నెలలో వద్దు. ఆరవనెల రానివ్వండి. ఇది మార్చినెలకదా. జూన్ నెలలో ఆశ్రమంలో పెద్దయాగం ఒకటి చెయ్యబోతున్నాను. ఆ యాగంలో సర్వదేవతల్ని




ప్రసన్నం చేసుకుంటాను. జూన్ నెలలో పిల్లవాడికి కూడా ఆరవనెల వస్తుందంటున్నారు. యాగం చేసే సమయంలోనే పిల్లవాడికి నామకరణం చేద్దాం"

"మీ ఇష్టం స్వామీ"

"దేశంలో అనాథ బాలికలు చాలామంది వున్నట్లు వుంది. ఇంకా చాలామంది అనాథలు వస్తున్నారు. వాళ్ళకోసం మరో బిల్డింగ్ నిర్మించాలి. ఈసారి రేకులు గాకుండా పక్కా బిల్డింగే నిర్మిద్దామని ఆలోచన. దానికోసం మీవంతు విరాళం..."

"ఎంత ఇవ్వమంటారో చెప్పండి స్వామీ"

"డబ్బు రూపేణా వద్దు. ఒక గది మీ పేరుతో నిర్మించండి. చాలు"

"అలాగే స్వామీ"

"అంతే కాదు. ఇప్పుడున్న ఈ బిల్డింగుల నిర్మాణాల సమయంలో మీరులేరు. కొత్త బిల్డింగ్ మీరే దగ్గరవుండి కట్టించాలి. ఇంజినీర్‌కదా మీరు. మీ నైపుణ్యం అంతా కొత్త బిల్డింగ్‌లో కనపడాలి"

"అంతకంటే ఇంక కావాల్సిందేంవుంది స్వామీ. మీకుగానీ, భక్తులకిగానీ సేవచేసే అదృష్టం రమ్మంటే వస్తుందా? తప్పకుండా నా పర్యవేక్షణలోనే బిల్డింగ్ నిర్మిస్తాను స్వామీ"

"జూన్ నెలలో యాగం వుంది. ఇంకా తేదీ నిర్ణయించలేదు. నిర్ణయించిన తరువాత ఫలానా తేదీన రమ్మని మీకు కార్యదర్శి వుత్తరం రాస్తాడు. అప్పుడు పిల్లవాడ్ని తీసుకురండి. అప్పుడే పేరుకూడా పెడదాం" స్వామి అన్నాడు.

తరువాత రాధికా, రామక్రిష్ణా పిల్లవాడ్ని తీసుకుని తమ వూరు వెళ్ళిపోయారు.



రాత్రి పదిగంటలు.

సెంటూ, అగరుబత్తీలూ, మల్లెపూల వాసనలతో విశాలమైన ఆ గది అంతా అదోరకమైన మత్తులాంటి వాసన ఆవరించివుంది.

గదిలో తక్కువ కాంతితో బులుగులైట్లు వెలుగుతోంది.

ప్రత్యేకంగా తయారుచేయించిన ఎత్తైన మంచం. ఆ మంచంమీద మెత్తటి పరుపులు, వాటిమీద స్వామివారు పవళించి వీడియోలో నగ్న చిత్రాన్ని తిలకిస్తున్నారు.

నోట్లో చుట్ట గుప్పుగుప్పున వెలుగుతోంది.

మంచంపక్కనే వున్న ఎత్తయిన స్టూలు మీద స్వీట్లూ, పండ్లూ అమర్చి వున్నాయి.

స్వామి వంటిమీద పెద్దగా బట్టలులేవు.

గది తలుపులు తెరుచుకున్నాయి.

16 సంవత్సరాల మణిమాలని వెంటబెట్టుకుని ఇద్దరు శిష్యురాళ్ళు లోపలికి తీసుకువచ్చి "మళ్ళీ వస్తాం" అని మణిమాలని అక్కడే వదిలి వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

"పిలిచారుట" మణిమాల భయంభయంగా స్వామిని అడిగింది.

అంతలో గది తలుపులు మూసుకున్నాయి. తలుపులకి బయట గడియ పడింది.

మణిమాల అది గమనించి తలుపు దగ్గరకి వెళ్ళింది. ఇంతలో స్వామి పిలిచాడు.

"ఇలా రా"

"నాకు భయంగా వుంది స్వామీ" మణిమాల వణికిపోతూ అంది.

"భయమెందుకే? ఇక్కడ ఎవరు వున్నారు? నేనేకదా, ఇలారా" సౌమ్యంగా పిలిచాడు స్వామి.

మణిమాల భయంతో వణికిపోతూ, వదిగిపోయి తలుపువద్ద నిలబడింది.

"ఇలా రమ్మంటున్నానా? " మంచంమీద పడుకున్న స్వామి కటువుగా పిలిచాడు.

మణిమాల కదల్లేదు.

స్వామి చిరాకుతో లేచి, మంచందిగి మణిమాల దగ్గరకి అడుగులు వేయడం మొదలుపెట్టాడు.

దాదాపు నగ్న శరీరంతో సమీపిస్తున్న ఏనుగులాంటి స్వామిని చూసి కెవ్వు మంటూ భయంతో పెద్దగా అరచింది మణి మాల.

స్వామి పిచికలా వున్న మణిమాలని పట్టుకుని ఎత్తి మంచంమీద పడేశాడు.

మణిమాల ఏడుస్తూ కేకలు పెడుతోంది.

మణిమాల తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. బంధువులు ఆమెని కొంతకాలం చూసి, చివరికి స్వామివారి అనాథ బాలికల ఆశ్రమ పాఠశాలలో చేర్పించి చేతులు దులుపుకున్నారు.

పాఠశాలలో పదవతరగతి చదువుతోంది మణిమాల. పసితనం వీడని ముఖంతో, అమాయకత్వం వుట్టిపడుతూ చదువే లోక మైనట్లు జీవిస్తుంది.

మణిమాల కేకలు, అరుపులు, ఏడుపులు అరణ్యరోదనలు అయ్యాయి.

అరచి గొడవ చేస్తున్నందుకు అదనంగా దెబ్బలు మాత్రం పడ్డాయి.

అర్ధరాత్రి దాటిన తరువాత తలుపులు తెరుచుకున్నాయి.

సౌజన్య, మరో స్త్రీ లోనికివచ్చి మణిమాల భుజంమీద చేయివేసి, నెమ్మదిగా నడిపించు కుంటూ అనాథబాలికల హాస్టల్ వైపు తీసు కుపోయారు.

"తప్పమ్మా... అలా ఏడవకూడదు. స్వామివారుకదా! స్వామివారు నిన్ను ఆవ హిస్తే నీ జన్మ ధన్యం అవుతుంది. అది పాపం కాదమ్మా. చాలా పుణ్యం వస్తుంది" అంది సౌజన్య.

"స్వామివారి చల్లని చూపు నీమీద పడిం దమ్మా. రేపటినుంచి నీకు ఏవి కావాలంటే అవి క్షణాలమీద సమకూరుతాయి. నవ్వుతూ వుండాలి. ఏది నవ్వూ" మరో శిష్యురాలు అంది.

స్వామి జరిపిన అత్యాచారం ఆ బాలికను ఎంతగా హింసించిందో, వీళ్ళమాటలు కూడా అలానే హింసపెడుతున్నాయి.

మణిమాలకి ఏడుపు ఇంకా పెరిగింది. ఇంకా పెద్దగా ఏడుపుకి లేచింది.

"నువ్వు ఏడ్పు ఆపాలి. ముందు ఆపు. ఎవరితో అయినా ఈ విషయం చెప్పావ నుకో! నీకు చాలా పెద్ద ప్రమాదం జరిగిపో తుంది. నిన్ను ఎవరూ రక్షించలేరు. ఇంతకుముందు ఇలాగే ఒకమ్మాయి గొడవ చేసి, హాస్టల్లో నలుగురికీ విషయం చెప్పింది"

"ఆ అమ్మాయిపేరు రాజేశ్వరి కదక్కా" శిష్యురాలు సౌజన్యని అడిగింది.

"అవును రాజేశ్వరే. నలుగురికీ చెబితే ఆ అమ్మాయికి ఏం జరిగిందో తెలుసా? ఆ అమ్మాయి మరుసటిరోజు తెల్లవారి హాస్టల్లో ఉరికి వేలాడుతూ కనిపించింది. కాళ్ళు నేల మీదనే వున్నాయి. మేం ముగ్గురమే అది చూసింది. వెంటనే పైన వురితాడు కోసి, కిందకి దించాం. కాళ్ళు నేలమీదనే వుంటే ఉరికి వూపిరి ఎలాపోయింది? ఎవరో ఆ అమ్మాయిని కావాలనే చంపి వురితీశారు"

"వీడు స్వామా? స్వామికాదు, రాక్షసుడు, యముడు, క్రూరుడు" వణికిపోతూ ఆవే శంతో, ఆగ్రహంతో అరిచినట్లే అంది మణి మాల.

"అరిచీ, గొడవచేసి ఎందుకు ప్రాణం మీదకి తెచ్చుకుంటావు. నీకు ఇప్పుడు ఏమైంది. రేపటినుంచీ నీకు ఏవి కావా లంటే అవి క్షణాలమీద వస్తాయి. పిచ్చి దానా... సుఖపడటం నేర్చుకో. ఎవరికైనా ఈ విషయం చెబితే నీ ప్రాణాలు

పోతాయి. ఎందుకు అనవసరంగా గొడవ చేసి బలయిపోతావు. నీవు ఆశ్రమం దాటి ఎక్కడికీ వెళ్ళే అవకాశం కూడా లేదు" సౌజన్య సౌమ్యంగా చెప్పింది.

మణిమాలని హాస్టల్‌కి తీసుకుపోయి, ఒక్కదానినే ఒక గదిలోనికి పంపించి వీళ్ళు తిరిగివచ్చారు.

రోజులు జరిగిపోతున్నకొద్దీ మహిళా సదనంలోనూ, ఆశ్రమ పాఠశాలలోనూ కొందరి వదనాలు కాంతిహీనమై పోతున్నాయి. ఆ రెండుచోట్లా భయంకరమైన నిశ్శబ్దం తాండవిస్తోంది.



జూన్ 14వ తేదీ యాగం వుందనీ, భార్యనీ, పిల్లవాడ్నీ తీసుకుని రమ్మని ఆశ్రమ కార్యదర్శినుంచి రామక్రిష్ణకి వుత్తరం వచ్చింది.

వాళ్ళ ఇద్దరితోపాటు, అమ్మని కూడా వెంటపెట్టుకుని పన్నెండవతేదీ బయలుదేరి పదమూడవతేదీన ఒకరోజు ముందుగానే ఆ దంపతులు ఆశ్రమానికి చేరుకున్నారు.

"పోయిన శుక్రవారం ఒక యాగం చేశాను. ఆ యాగంలో చాలామంది దేవతల్ని ప్రసన్నం చేసుకున్నాను. ఇది మరో యాగం. ఇది చిన్నయాగమే" స్వామి చెప్పాడు.

రామక్రిష్ణ వాళ్ళతోపాటు మరో ఏదు గురు దంపతులు కూడా యాగం కోసం వచ్చారు.

14వ తేదీ యాగం మొదలైంది. ఆరుగురు దంపతులు వచ్చి గదిలో ఆశీనులయ్యారు.

కాళికాదేవినుంచి కన్యకాపరమేశ్వరి వరకూ దేవతల బొమ్మలూ, ఆంజనేయస్వామినుంచి అయ్యప్పస్వామి వరకూ దేవుళ్ళ బొమ్మలూ గదిలో వరుసగా అమర్చి వున్నాయి.

బొమ్మలకి అగరుబత్తీలు వెలిగించి, కుంకుమతో బొట్లుపెట్టి వీళ్ళు రాకముందే పూజలు చేశారు.

ప్రేమానందస్వామివారు కొత్తగా త్రిశూలం చేతపట్టారు.

చొక్కా లేకుండా గుండెలమీదా, నుదుటిమీదా పెద్దపెద్ద విభూదిరేఖలు గీసుకున్నాడు. ముక్కుమీద నుంచి నెత్తిమీద వెంట్రుకల వరకూ పెద్ద కుంకుమబొట్టు పెట్టుకున్నాడు. తల జులపాలు విరబోసుకున్నాడు.

ఆకారంతోపాటు చేతిలో త్రిశూలం పట్టుకుని భయంకరరూపంతో వున్నాడు.

అలవాటు వున్న భక్తులు కాబట్టి వాళ్ళకి మామూలుగా వుందికానీ, కొత్తవాళ్ళు ఎవరైనా చూస్తే జడుసుకునేలా వుంది స్వామిఆకారం.

గది మధ్యలో పెద్ద ముగ్గువేసి, ఆ ముగ్గు మీద పసుపూ, కుంకుమా, కొన్ని పూలూ వెదజల్లి వున్నాయి.

ఆరుగురు దంపతులూ వచ్చిన తరువాత గది తలుపులూ, కిటికీలూ మూసేశారు.

పట్టపగలు. అయినా గదిలో కొద్దిగా చీకటిగానే వుంది.

"చీకటిగా వుంది కదా స్వామీ" ఒక భక్తుడు అన్నాడు.

"కొద్దిగా రహస్యంగా జరగాల్సిన పూజ. అందుకే తలుపులు వేయించాను. లైటు వుందిలే" అని స్విచ్ నొక్కడంతో ట్యూబ్ లైటు వెలిగింది.

గదిలో ఒక పక్కగా కొన్ని బొమ్మలు వున్నాయి.

ఆరు గడ్డితో చేసిన బొమ్మలు, ఆరు దూదితో చేసిన బొమ్మలు, ఆరు మట్టితో చేసిన బొమ్మలు వున్నాయి. మూడురకాల బొమ్మలూ మూడు సైజుల్లో వున్నాయి.

బొమ్మలు అన్నీ మనిషిరూపంలో తయారుచేశారు.

"మీ దంపతులు ఒక్కొక్కరూ మూడేసి బొమ్మలకి పూజలు చేయాలి. పూజలు చేసి బొమ్మల్ని ముగ్గుమీద వుంచండి" స్వామి ఆజ్ఞాపించాడు.

"పూజలు అంటే దండం పెట్టుకోవడమే కదా స్వామీ" ఒక భక్తుడు అడిగాడు.

"అవును. ముందు మీరు మూడు బొమ్మలు తీసుకోండమ్మా" రాధికకి చెప్పాడు.

రాధిక వెళ్ళి మొదటివరుసలో వున్న మూడుబొమ్మలకి దణ్ణం పెట్టుకుని ముగ్గు మీదకి తెచ్చింది.

అలాగే మిగతా ఐదుగురూ కూడా ఒక గడ్డిబొమ్మకీ, ఒక మట్టి బొమ్మకీ, ఒక దూది బొమ్మకీ దణ్ణంపెట్టి ముగ్గుమీద వుంచారు.

"ఇలాంటి పూజ దేశంలో ఎవరికీ తెలియదు. నేనే స్వయంగా యాగంచేసి ఈ పూజ కనుక్కున్నాను. యాగం అంటే దాదాపు తపస్సులాగానే చేశాను. ఇది సామాన్యమైన పూజకాదు. చిన్నయాగం ఇది. ఇక్కడవున్న దేవతలు అందర్నీ ఈ పూజ ద్వారా ప్రసన్నం చేసుకుని, గ్రహాల్ని తొలగించుకోవాలి. మీ పిల్లలకి ఏ అరిష్టాలూ లేకుండా గొప్ప జాతకులుగా తయారుకావడానికీ, వాళ్ళకి చుట్టుకున్న గ్రహాలు తొలగించడానికీ ఈ పూజ చేస్తున్నాను. మీకు ఏమైనా అనుమానాలు వుంటే అడగండి" స్వామి ప్రశ్నించాడు.

"మాకు ఏం అనుమానాలు లేవు స్వామీ"

"ఎన్నో గ్రహాలు వున్నాయి. కొన్ని గ్రహాలకి కొన్నిరోజుల పూజా విధానాలు వుంటాయి. అవి అన్నీ కొన్నిలెక్కలు. మీకు తెలియవు. ఇప్పుడు నేను పూజచేసి, దేవతల్ని ఆవాహన చేసుకుంటాను. మనెదురుగానే, మన కళ్ళముందే, మనం చూస్తూవుండగానే దేవతలు ఈ బొమ్మల్లో ప్రవేశించి, ఎవరికి ఎన్ని గ్రహాలు చుట్టుకున్నాయో చెపుతారు"

దంపతులు అందరూ ఆసక్తితోనూ, భయంతోనూ చూస్తున్నారు. దేవతలు ఎలా చెపుతారో చూద్దామని వాళ్ళకి చాలా వుత్కంఠగా వుంది.

"దేవతలు మనకి నోటితో చెప్పరు. అగ్నితో చెపుతారు. అంటే ఇక్కడ వున్న బొమ్మల్లో దేవతలు ప్రవేశించి, దగ్ధమైపోవడంద్వారా మనకి చెపుతారు. మీరు పూజ చేసిన దూదిబొమ్మ తగలబడితే మూడురోజులు పూజ చేస్తే సరిపోతుంది. మట్టి బొమ్మ తగలబడితే ఆరురోజులు పూజ చేయాలి. ఇక గడ్డిబొమ్మ తగలబడితే చాలా ప్రమాదం. వాళ్ళకి పెద్ద ఆపద పొంచి వుందన్నమాట. వాళ్లకి నవగ్రహాలు చుట్టుకున్నట్లు లెక్క? వాళ్ళు తొమ్మిదిరోజులు దీక్షతో పూజలు చేయాలి. ఏమంటారు? "

"అలాగే చేద్దాం స్వామీ" భక్తులు అందరూ ఒకే కంఠంతో అన్నారు.





ఆరుగురు దంపతులూ ముగ్గుచుట్టూ కూర్చుని, ఎవరి ఎదురుగా వాళ్ళ బొమ్మలు పెట్టుకుని దణ్ణం పెడుతూన్నారు.

"మూడు బొమ్మలకీ కొబ్బరికాయలు కొట్టండమ్మా"

అంతకు ముందే తెచ్చిపెట్టుకున్న కొబ్బరి కాయల్ని, ఒక్కో బొమ్మకీ ఒక్కో కాయకొట్టారు.

రాధిక కూడా మూడు బొమ్మలకీ మూడు కాయలు కొట్టింది.

స్వామి కళ్ళు మూసుకుని ఏవో మంత్రాల్ని నోట్లోనే చాలా సేపు చదివాడు. తరువాత కళ్ళు తెరచి ఆగ్రహంతో వురుముతూ, తీక్షణంగా చూస్తూ, ముఖంలో రకరకాల హావభావాల్ని ప్రదర్శిస్తూ, మంత్రాల్ని చిన్నగా వుచ్చరిస్తూ పెదాల్ని కదిలిస్తున్నాడు.

భక్తుల ఎదురుగానే నెమ్మదిగా కొన్ని బొమ్మల్లోనుంచి పొగరావడం ప్రారంభమైంది.

వాళ్ళు ఆశ్చర్యంగా చూస్తుండగానే నాలుగు గుడ్డబొమ్మలూ, రెండు గడ్డిబొమ్మలూ పొగవచ్చి, తరువాత పెద్ద మంట లేచి తగలబడిపోయాయి.

దంపతులు అందరూ నిశ్చేష్టులై చూస్తున్నారు.

కొంతసేపటికి తగలబడిపోయిన బొమ్మల స్థానంలో గుప్పెడు బూడిద మిగిలింది. మట్టిబొమ్మలు మాత్రం దగ్ధం కాలేదు.

రాధిక, రామక్రిష్ణ వాళ్లకి చెందిన గడ్డి బొమ్మ తగలబడిపోయింది.

"చూశారా... దేవతలు ఆ బొమ్మల్లో ప్రవేశించి, మంటరూపంలో అదృశ్యమైపోయారు. దూదిబొమ్మలు తగలబడిపోయిన వాళ్ళు మూడురోజులు పూజచేసి గ్రహాల్ని తొలగించుకోవాలి. గడ్డిబొమ్మలు తగలబడిపోయిన వాళ్ళు మాత్రం తొమ్మిది రోజుల పూజకి వుండాలి. ప్రతిరోజు నేనే స్వయంగా పూజచేసి, రోజుకో గ్రహాన్ని తొలగిస్తాను. మీ బిడ్డలు మాత్రం నిండు నూరేళ్ళు జీవించడమేకాదు, గొప్ప సంపన్నులవుతారు"

"పూజకి ఇద్దరమూ ఉండాలా స్వామీ? " ఒక భక్తుడు అడిగాడు.

"అవసరంలేదు. కన్నతల్లి ఒక్కరు వుంటే చాలు. ఒక గంట సేపు మాత్రమే పూజ జరిగేది. పూజ కూడా రోజుకోవిధంగా జరుగుతుంది. ఒకరోజు జరిగినపూజ మరో రోజు జరగదు. రేపట్నించే పూజ మొదలు పెడదాం"

"అలాగే స్వామీ" అని రాధిక, రామక్రిష్ణ లేచి వచ్చేశారు.

★ ★ ★

రామక్రిష్ణ వాళ్ళ అమ్మకూడా కొడుకూ, కోడలు వెంట ఆశ్రమానికి వచ్చింది. ఆమెకి మనుమడితోనే లోకం అయిపోయింది. మనుమడ్ని వదిలి ఆమె క్షణం వుండదు.

మనుమడి సంరక్షణ అంతా ఆవిడే స్వయంగా చూసుకుంటుంది.

పుట్టింటికి వెళ్ళి కాన్పు జరిగిన మూడవ నెలలోనే రాధికని అత్తవారింటికి తిరిగి తీసుకువచ్చారు.

ముద్దులొలికే పండంటి మనుమడ్ని తనకి ఇవ్వడంతో కోడలిమీద కూడా ఆ అత్తకి ప్రేమ వుప్పొంగిపోతోంది.

రెండో శనివారం, ఆదివారం వరుసగా రెండురోజులు శలవు దొరకడంతో పాటు, ఒకరోజు సెలవుపెట్టి కుటుంబంతో ఆశ్రమానికి వచ్చాడు రామక్రిష్ణ. తరువాత సెలవు పెట్టలేదు.

నాలుగోరోజు రామక్రిష్ణ ఆఫీస్‌కి వెళ్ళవలసిన పనికూడా వుంది.

"నేను సోమవారం రాత్రికి బయల్దేరి

మన వూరు వెళ్తాను రాధికా. మంగళవారం ఆఫీస్‌కి వెళ్ళాలి. సెలవు పెట్టలేదు. ఇక్కడ అమ్మ నీకు తోడుగా వుంటుంది కదా"

"టెలిగ్రాం ద్వారా సెలవు పంపించండి. లేకపోతే ఇలా అవసరం వచ్చింది సెలవుకావాలని ఫోన్ చేయండి. మీరుకూడా ఇక్కడ వుంటే బాగుంటుంది. పైగా మీరు అక్కడ తిండికి ఇబ్బంది పడతారు" రాధిక అంది.

"పర్లేదు. ఈ నాలుగయిదు రోజులు హోటల్లో తిండితిని నా తంటాలు ఏవో నేను పడతాను. తొమ్మిదోరోజు వచ్చి మిమ్మల్ని తీసుకుపోతాను"

"అలాగే వెళ్ళిరండి" అంది రాధిక.

మొదటి మూడురోజుల పూజకి రామక్రిష్ణ కూడా వున్నాడు.

మూడురోజుల పూజ అయిన తరువాత నలుగురు దంపతులు వెళ్లిపోయారు.

"తొమ్మిదో రోజు వచ్చి మిమ్మల్ని తీసుకుపోతాను" అని చెప్పి రామక్రిష్ణ కూడా బయల్దేరి వెళ్ళిపోయాడు.

రాధికా, మరో భార్య, భర్త మాత్రమే ప్రత్యేక పూజలకోసం ప్రత్యేక గదులలో వున్నారు.



రామక్రిష్ణ వాళ్ళ అమ్మ రాధికని తీసుకువచ్చి, స్వామి ఆశ్రమం అని పిలుస్తున్న ఇంద్రభవనం వద్ద వదిలి, తిరిగి తాము వున్న గదికి వెళ్ళిపోయింది.

ప్రతిరోజు ఒక గంటా, గంటన్నరసేపు పూజ వుంటుంది. రోజుకో విధమైన పూజ.

రాధిక పూజ గదిలోకి వెళ్ళింది.

అప్పటికే స్వామి గదిలో కూర్చుని వున్నాడు.

రాధిక వెళ్ళిన కొద్దిసేపటికి గదిలో లైట్లు ఆరిపోయాయి.

ఎర్రలైటు ఒకటి వెలిగింది. అది గదిలో కొంచెం వెలుగుతోంది.

"పూజ చేద్దామా? " స్వామి అడిగాడు.

"అందుకే స్వామీ వచ్చింది"

"పూజ మొదలుపెడదాం. ఎదురుగా ఎర్రలైటు వెలుగుతోంది కదా. ఆ లైటువద్ద త్రికాల లింగేశ్వరస్వామి వున్నాడు. ఆ స్వామిరూపం అంత తేలికగా కనపడదు. స్వామివద్దవున్న లైటు వైపు అలాగే చూస్తుండాలి" స్వామి చెప్పాడు.

"అలాగే స్వామీ" అని రాధిక లైటువైపు చూస్తోంది.

"అలాగే లైటువైపు చూస్తూండాలి. లైటు వేపే చూస్తూండాలి. అలాగే చూడాలి. త్రికాల లింగేశ్వరస్వామివైపు చూస్తూండాలి... అలాగే చూస్తుండాలి"

రాధిక అలాగే చూస్తోంది.

"నీకు స్వామి అంటే ఎంతో ఇష్టం. ఎంతోభక్తి. నువ్వు స్వామిని అభిమానిస్తావు. స్వామిని కోరుకుంటున్నావు. స్వామిలో ఐక్యం కావాలనుకుంటున్నావు"

రాధికని హిప్నటైజ్ చేసి తన ఆధీనంలోకి తెచ్చుకోవాలని స్వామి దాదాపు ఇరవై నిముషాలు ప్రయత్నించాడు. చెప్పిన మాటని పదేపదే చెప్పాడు.

తనశక్తిని అంతా వుపయోగించాడు. సాధ్యంకాలేదు.

రాధిక స్థిరనిశ్చయం, స్థిరమైన మనస్సు మీద స్వామి వశీకరణ యత్నం ఏమాత్రం ఫలప్రదం కాలేకపోయింది.

రాధిక చాలా స్థిరంగా అలాగే చూస్తూండిపోయింది.

తనే ఆమె ఆధీనంలోకి వెళ్ళేలా వుంది అని స్వామి ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.





రాధికకి అవేమీ తెలియలేదు. స్వామి చెప్పినట్లే చేసింది.

"త్రికాల లింగేశ్వరస్వామి రూపం కనిపించిందా? " అడిగాడు స్వామి.

"కనపడలేదు స్వామీ"

"అయితే స్వామి ప్రసన్నం కాలేదన్న మాట. రేపు మరో పూజ చేద్దాం"

"సరే స్వామీ"

"ఈ రోజుకి ఒక్కో దేవుడికి ఒక్కో కొబ్బరికాయ కొట్టి, ప్రతిదేవుడి ముందూ సాష్టాంగ ప్రణామం చేసి మూడు గుంజీలు తీయమ్మా" స్వామి ఆజ్ఞాపించాడు.

గదిలో చాలా బొమ్మలు వున్నాయి. స్వామి చెప్పినట్లే దేవుడి ప్రతి బొమ్మ ముందూ కొబ్బరికాయకొట్టి, సాష్టాంగపడి గుంజీలు తీసింది.

"ఇవ్వాళ్టికి చాలు. రేపు దిగంబర పూజ చేద్దాం. వెళ్ళిరండి" స్వామి ఆశీర్వదించాడు.

రాధిక తన గదికి వచ్చింది.

ఆరోజుతో ఐదురోజుల పూజ అయిపోయింది.

ఆరవరోజు రాత్రి తిరిగి పూజకి వెళ్ళింది రాధిక.

"రోజుక్కో రకంగా పూజ చేయాలి కదమ్మా! రేపు హోమపూజ చేద్దాం. పగలు అయినా ఆ పూజ చేయవచ్చు హోమం చుట్టూ రెండువందల పదహారుసార్లు ప్రదక్షిణచేసి మూడు కొబ్బరికాయలు కొడితే ఒక గ్రహం తొలిగిపోతుంది. ఇవ్వాళ దిగంబరపూజ చేద్దామా? "

"ఈ పూజ ఎలా చేయాలి స్వామీ? " ఆ పూజ ఏమిటో తెలియక అడిగింది రాధిక.

"నేను చెపుతాను. నువ్వు అలా కళ్ళుమూసుకుని కూర్చుని నేను చెప్పిన శ్లోకాలు స్మరిస్తూ వుండు" అని రాధికని కొన్ని దేవుడిబొమ్మల ముందు కూర్చోపెట్టాడు.

స్వామికూడా మరోవైపు వున్న బొమ్మల ముందు కూర్చుని ఏవో మంత్రాలు చదువుతూ, రాధికని కూడా పలకమంటూ చేతిలోని త్రిశూలాన్ని తిప్పాడు.

"ఇప్పుడు నువ్వు బట్టలు మొత్తం విప్పతీయాలమ్మా" మృదువుగా అడిగాడు స్వామి.

ఆ మాట వినడంతోనే షాక్ కొట్టినట్లు కళ్ళు తెరిచి చూసింది రాధిక.

"ఏమిటి స్వామీ? " ఆందోళనగా అడిగింది.

"దిగంబర పూజకదా! బట్టలు విప్పాలమ్మా"

"నాకు సిగ్గు స్వామీ! పరాయి పురుషుడు ముందు..."

"తప్పమ్మా! పరాయి పురుషుడు ఏమిటి? దేవుడిముందు అందరూ సమానులే! చెడ్డ దృష్టితో చూడకూడదు"

"అలా కాకుండా మరోరకంగా చేయండి స్వామీ పూజ!"

"ఇది తప్పనిసరిగా చేయాల్సిన పూజ. పూజ చేయడానికి ముందు నేను అడిగితే అలాగే చేద్దామన్నావు కదా"

"నేను ఇలా అనుకోలేదు స్వామీ"

"పర్లేదు. ఇందులో తప్పేమీవుండదు. పిల్లవాడికి చుట్టుకున్న గ్రహం తొలగిపోవాలంటే ఈ పూజ చేయకతప్పదు. అన్ని పూజలు చేసి ఈ ఒక్క పూజ చేయకపోతే ఏమీ వుపయోగం వుండదు. ఇప్పటివరకూ చేసిన పూజలు అన్నీ వ్యర్థం అవుతాయి"

"మరి ఎలా స్వామీ? "

"చేసేదేముంది? పూజ చేయడమే. మరో మార్గంలేదు. ఈ పూజ చేయకపోతే దేవుడికి ఆగ్రహం వస్తే మనం చేయగలిగింది లేదు. తరువాత ఏడ్చీ, బాధపడీ ప్రయోజనం వుండదు. లేకలేక పుట్టిన బిడ్డ"

"అయితే ఈ పూజ రేపు చేద్దాం స్వామీ" అప్పటికి తప్పించుకోవచ్చనే వుద్దేశంతో అంది రాధిక.

"సగం చేసి వదిలిపెడితే దేవుడికి కోపం రాకుండా వుంటుందా? అది ఇంకా పెద్ద వినాశనం! అలా చేయకూడదు"

రాధిక ఎలాగైనా ఆ ఒక్కపూజ తప్పించుకుంటే బాగుంటుందనే కోరికతో వుంది.

"పూజ ఎలా చేయాలో చెప్పండి స్వామీ. మీరు బైటికి వెళ్తే మీరు చెప్పినట్లు నేను చేస్తాను"

"నేను లేకుండా పూజ ఎలా కుదురుతుంది.? పూజ అయిన తరువాత నాకు ప్రతిరోజూ దేవతలు ప్రత్యక్షమవుతారు. వాళ్ళు నా ఒక్కడికే కనపడతారు. కనపడి గ్రహం తొలగిపోయినదీ, లేనిదీ చెపుతారు"

"ఎలా స్వామీ అయితే..."

"కానివ్వమ్మా, కాలం వృథా చేయవద్దు. ఏమవుతుంది? ఈ పాటికి పూజ కూడా అయిపోయి వుండేది. ఇందులో సిగ్గుపడాల్సిందీ, బిడియపడాల్సిందీ ఏముంది? ఇది పూజ కదా"

"కానీ..." ఏం చేయాలో తోచక సందిగ్ధంలో పడిపోయింది రాధిక.

"పూజ చేయక తప్పదమ్మా! ఇప్పటికే ఆలస్యమైపోయింది" ఇక ఆలోచించడానికి వ్యవధికూడా ఇవ్వకుండా తొందరపెట్టాడు స్వామి.

"ఒకమాట... గట్టిగా కళ్ళు మూసుకుని బట్టలు విప్పతీయాలమ్మా. కళ్ళు అసలు తెరవకూడదు. పెద్దశక్తి వస్తుంది. గొప్ప వెలుగు. ఆ వెలుగు కళ్ళలో పడితే కళ్ళుపేలిపోతాయి. జీవితాంతం అంధురాలివైపోతావు. గ్రహం తొలగిపోదు. గట్టిగా కళ్ళు మూసుకోవాలి"

రాధిక గట్టిగా కళ్ళు మూసుకుని బిడియపడుతూ, భయపడుతూ, ఆందోళన చెందుతూ శరీరంమీద వున్న బట్టలు ఒక్కొక్కటి విప్పతీయడం మొదలుపెట్టింది.

పెద్ద వెలుగు ప్రత్యక్షమైంది.

రాధిక కళ్ళు మూసుకున్నా ఆ వెలుగు కళ్ళలో పడుతోంది.

బట్టలు అన్నీ విప్పింది రాధిక.

స్వామి రాధిక చెంతకి వచ్చాడు.

దేదీప్యమానంగా వచ్చిన వెలుగుధాటికి రాధిక భయపడి ఇంకా గట్టిగా కళ్ళు మూసుకుంది.

స్వామి తన చెంతనే, దరిదాపులో దగ్గరగా వున్నట్లు మాటల్ని బట్టి గ్రహించింది.

ఆ వెలుగులో స్వామి కొన్నిపనులు చెప్పాడు. నగ్నశరీరంతో రాధిక స్వామి చెప్పినట్లే చేసింది.

అప్పుడు స్వామి చేతులు ఒకసారి తగిలాయి. శరీరం కూడా ఒకసారి తగిలింది. అయినా రాధిక భయంతో కళ్ళు మూసుకుంది.

ఇరవై నిముషాల తర్వాత "బట్టలు ఇస్తాను. కళ్ళు మూసుకునేకట్టుకో" అని రాధికకి స్వామి బట్టలు అందించాడు.

కళ్ళు మూసుకునే బట్టలు కట్టుకుంది రాధిక.

కొద్దిసేపటికి వెలుగు అదృశ్యమైపోయింది.

"ఇక కళ్ళు తెరువు" స్వామి అన్నాడు. కళ్ళు తెరిచింది రాధిక.

"ఎంత భయపడ్డావు? ఏమయింది? వెలుగు చూసినట్లయితే కళ్ళుపోయి వుండేవి. అంత శక్తి వుంది. సరే, మూడు టెంకాయలు కొట్టి వెళ్ళిపోమ్మా. రేపు పగలు హోమపూజ చేద్దాం" స్వామి చెప్పాడు.




రాధిక ఆందోళన తగ్గకుండానే, గుండెల నిండా వూపిరి పీల్చుకుని బయటపడింది.

★ ★ ★

నూనెస్వామి ఆశ్రమం ప్రారంభించి కొద్ది నెలలు అవుతోంది.

బాగా వెనుకబడిన ప్రాంతం, ప్రజలు అమాయకులు. మూఢనమ్మకాలు ఎక్కువ. జిల్లాలో మరోస్వామికూడా ఎవరూలేరు.

ఇన్ని కారణాలతో ఇక్కడ ఆశ్రమం ప్రారంభిస్తే బాగా సాగుతుందనీ, భక్తులు గుంపులు గుంపులుగా వస్తారనీ, తనకి రాబడి బాగుంటుందనీ, నీళ్లస్వామి ఆశ్రమం కంటే కూడా తన ఆశ్రమం అమితంగా అభివృద్ధి చెందుతుందనీ చాలా ఆశలు పెట్టుకుని చాలా కలలు కన్నాడు.

అయితే వాస్తవం వేరుగా వుంది.

తను ఆశించిన స్థాయికి ఆమడదూరంలో అభివృద్ధి వుండడంతో పాటు ఆదాయం కూడా అంతంతమాత్రంగానే వుంది.

నీళ్ళస్వామి పెద్దస్థాయిలో అభివృద్ధి చెందడానికి తనే ముఖ్యకారకుడు.

పెద్ద పెద్ద వ్యాపారుల్నీ, కంట్రాక్టర్లనీ స్వామివద్దకి తీసుకువచ్చాడు. ఎంఎల్ఏనీ, మంత్రినీ ఆశ్రమానికి రప్పించాడు.

అప్పటి అనుభవం ఇక్కడ తనకి వుపకరిస్తుందని భావించాడు.

తన ప్రయత్నాలు ఏవీ ఫలించడంలేదు.

ఇక్కడ ఎంఎల్ఏ మొదట్లోనే మొండి చేయి చూపెట్టాడు. వ్యాపారులు ఎవరూ తన ముఖం చూడడానికి కూడా రావడం లేదు.

ఒక్కోవారం అయితే వేళ్ళమీద లెక్కపెట్ట గలిగినంతమంది భక్తులు మాత్రమే వస్తున్నారు. భక్తులు తనవద్దకి ఎందుకు రావడంలేదో ఎంత ఆలోచించినా నూనెస్వామికి అర్థంకావడంలేదు.

ఒకవారం మహిమగల ఇసుక సృష్టించాడు. గాలిలోనుంచి విభూది అనేకసార్లు తెప్పించి చాలామంది భక్తులకి పంచాడు. తన బొమ్మ కలిగిన ఇత్తడి వుంగరాలు గాలిలోనుంచి తీసి ముఖ్యులనుకున్న భక్తులకి పంచాడు. మంటల్ని మింగాడు. మంటల్ని నోట్లోనుంచి తెప్పించాడు. నిప్పులమీద నడిచాడు. ముళ్ళకంప మీద పడుకున్నాడు. వళ్ళంతా సూదులు గుచ్చుకున్నాడు.

ఎన్నోరకాల మాయలూ, మహిమలూ, మహాత్యాలూ ప్రదర్శించాడు. అవి ఏవీ పని చేయలేకపోతున్నాయి.

నీళ్ళస్వామికి ఈ విద్యలు అన్నీ నేర్పింది తనే. ఇవి నీళ్ళస్వామికి నేర్పడానికి తను ఎంతో శ్రమించాడు. ఆయనకి ఒకసారి చెబితే అంత తేలిగ్గా అర్థం చేసుకోలేడు.

తను ఈ మహిమలు అన్నీ ఒక గారడీ వాడి వద్ద నేర్చుకున్నాడు. నీళ్ళస్వామి ఆశ్రమం అంతగా అభివృద్ధి చెందడానికి ఈ మహిమలు కూడా ఒక కారణమే!

వారంవారం వచ్చిన కొద్దిమంది భక్తుల ముందు తెచ్చిపెట్టుకున్న వుత్సాహంతో ఏవో మంత్రాలు చదువుతూ ఎన్నోరకాల వేషాలు వేస్తున్నాడు తను.

అయినా ప్రజలు అందరూ ఒకమాట మీద వున్నట్లుగా, పంతం పట్టినట్లు తన వద్దకి రావడంలేదు. ఏం చేయాలో నూనెస్వామికి తోచకుండా వుంది.

"మీ ముఖాన శని వుంది. మిమ్మల్ని చూసి వచ్చేవాళ్ళు కూడా వెనక్కిపోతాడు. ఇప్పుడు ఏం చేయాలి? ఉన్న డబ్బంతా మీ తాగుడుకీ, పెత్తనాలకీ, ప్రచారాలకీ తగలేస్తిరి" అని భార్య పార్వతి సాధింపులూ, వేధింపులూ ఎక్కువైపోయాయి.

"ఏం చేయాలిరా భగవంతుడా?" అని

నూనెస్వామి భగవంతుణ్ణి ప్రార్థించడం ప్రారంభించాడు.

★ ★ ★

వచ్చేవారం మంత్రి శివలింగం ఆశ్రమానికి వస్తున్నాడు.

మంత్రి జిల్లాలో నెలా, రెండునెలలకి ఒకసారి పర్యటిస్తుంటాడు. వీలైనన్ని ఎక్కువసార్లు జిల్లాకు రావడానికి ప్రయత్నిస్తుంటాడు.

జిల్లాకి వచ్చిన ప్రతీసారీ ఆశ్రమానికి మాత్రం మంత్రి తప్పనిసరిగా వచ్చివెళ్తుంటాడు. అయితే రహస్యంగా ఎక్కువగానూ, బహిరంగంగా తక్కువగానూ ఆశ్రమాన్ని సందర్శిస్తుంటాడు.

వచ్చేవారం మంత్రి ఆశ్రమానికి వచ్చినప్పుడు రాధికని జతచేయాలి.

మంత్రి దృష్టిలో రెండుసార్లు రాధిక పడింది. ఎలాగైనా సరే ఆమె కావాలని తనని అడిగాడు

మంత్రి నోరుతెరిచి ఫలానా మనిషి కావాలని తనని కోరినప్పుడు ఏర్పాటు చేయకుండా ఎలా వుండగలడు?

నిజానికి మంత్రికి తను ఎంతో రుణపడి ఉన్నాడు. మంత్రి అండదండలు తనకి లేకపోతే, తనపని మటాష్ కావడానికి ఎక్కువ సమయం పట్టదు.

మంత్రి స్త్రీ లోలుడు! పోల్చుకుంటే తనే కొద్దిగా నయం.

ఆశ్రమానికి మంత్రి వచ్చిన ప్రతీసారీ కొత్తకొత్త స్త్రీలని పరిచయం చేస్తున్నాడు. మంత్రి ఆశ్రమానికి వచ్చేదే అందుకోసం.

చాలామంది స్త్రీలు ఇష్టపూర్వకంగానే మంత్రితో గడపడానికి అంగీకరిస్తుంటారు. వాళ్ళు వ్యామోహానికో, డబ్బుకో, నగలకో, మంత్రితో అవసరమైన పనులకో లొంగిపోతుంటారు.

ఇప్పుడు రాధిక ఏమంటుందో? అంగీకరిస్తుందో, తిరస్కరిస్తుందో!

అంగీకరిస్తే ఎలాంటి సమస్యా వుండదు. తిరస్కరిస్తే నయానో, భయానో, బెదిరించో దౌర్జన్యంగా లొంగదీయకతప్పదు.

రాత్రి దిగంబర పూజకి మొదట్లో కాదూ, కూడదని పేచీపెట్టిన మనిషి చివరికి పూజ చేయకమానుకుందా?

ఇప్పుడూ అంతేకావచ్చు. కొత్త కాబట్టి మొదట్లో కొంచెం బెట్టుచేసినా చివరికి దారికిరాక తప్పుతుందా?

రకరకాల ఆలోచనలు మదిలో మెదులుతుండగా పట్టు పరుపుమీద పడుకుని చుట్టతాగుతూ నుసిని యాష్ట్రేలో వేస్తూ అనుకున్నాడు స్వామి, 'తనకి ఈ చుట్ట అంటే ఎంత ఇష్టమో, స్త్రీలంటే కూడా అంత ఇష్టమే'

అంతలో కాలింగ్‌బెల్ మోగింది. రమ్మని పిలిచాడు స్వామి.

ఆశ్రమ ప్రధానసేవిక వచ్చింది.

"ఇంజినీరు భార్యకి హోమపూజ వుందని చెప్పారటకదా స్వామీ! ఏ టైంలో చేద్దామో కనుక్కుని రమ్మంది. ఇప్పుడు రమ్మంటారా? సాయంత్రం రమ్మంటారా? "

"స్వామి ఏవో ముఖ్యమైన పూజల్లో వున్నారని చెప్పు. పగలు చేద్దాం అనుకున్నాం కానీ వీలుకాదని చెప్పు. రాత్రికి చేయాల్సిందే"

"వస్తాను స్వామీ" అని ఆమె వెళ్ళిపోయింది.

"హమ్మయ్య" అని వూపిరి పీల్చుకున్నాడు స్వామి.

రాత్రి దిగంబర పూజ సమయంలో తాము చేసిన పని ఒకవేళ తెలిసి వుంటుందని తాను కొంత సందేహించాడు. ఈరోజు హోమపూజకి సిద్ధమైందంటే రాత్రి విషయం ఏమీ తెలియలేదు.





రాత్రి గండం గడచింది. అసలు గండం ఈరోజు వుంది. ఎలా వుంటుందో? పరి పరి విధాలా స్వామి ఆలోచనలు సాగాయి.

★ ★ ★

రాత్రి పదిగంటలు.

స్వామివారికి రాధికతో పూజ చేయడానికి అప్పటికి తీరుబడి దొరికింది.

"ఈ సమయంలో ఏం పూజ? హాయిగా పగలు పూజ జరిగివుంటే బాగుండేది. కానీ తప్పదుకదా. రాత్రి దిగంబర పూజకి తను బాగా సిగ్గుపడింది. ఇవ్వాళ హోమపూజ అంటే ఎలా జరుగుతుందో? " రాధిక సంకోచిస్తూ, సిగ్గుపడుతూ స్వామివారు వుండే భవనానికి చేరుకుంది.

రాధిక వెంట ఇద్దరు ఆశ్రమ సేవికలు వున్నారు.

రోజూ పూజ జరిగే గదివేపు రాధిక వెళ్ళబోతుండగా ఒక సేవిక అంది, "అటు కాదమ్మా. ఇవ్వాళ కొత్తపూజ. మరోగదిలో జరుగుతుంది ఇవ్వాల్టిపూజ"

వాళ్ళవెంట రాధిక అనుసరించింది. రాధికని ఒక గదిలోనికి పంపించి వాళ్ళు వెళ్ళిపోయారు.

సంశయిస్తూనే గదిలోనికి వెళ్ళింది రాధిక.

స్వామి కుర్చీమీద కూర్చుని వీడియోలో చిత్రాన్ని తిలకిస్తున్నారు.

ఆ గదిలోని బొమ్మలు చూసి రాధిక విభ్రాంతి చెందింది. గదిలో గోడలకి అన్నీ పెద్దసైజు బూతుబొమ్మలు అలంకరించి వున్నాయి. సినిమాతారల బొమ్మలు వున్నాయి.

"తను దారి తప్పి ఈ గదిలోనికి రాలేదు గదా" అనుకుంది రాధిక.

"రా రాధికా..." స్వామి పిలిచాడు.

ఆ పిలుపుకి రాధిక మళ్ళీ. ఆశ్చర్యపోయింది. ఎంతో గౌరవంతో, మర్యాద వుట్టిపడుతూ పిలిచేస్వామి ఏకవచనంతో సంబోధించాడు.

రాధిక వీడియోవైపు చూసింది.

నీలిచిత్రం!

పరమ అసహ్యకర భంగిమలతో స్త్రీ, పురుషుడూ వికారపు చేష్టలూ, వికృత చేష్టలూ!

రాధిక నమ్మలేకపోతోంది. స్వామి ఏమిటీ, వీడియోలో బూతు సినిమాలు చూడటం ఏమిటి? తను పొరపడిందా? రాధిక నమ్మలేకపోతోంది.

రాధిక కొన్ని సెకన్లు వాటివైపు చూసి తల దించుకుంది.

"అదేమిటి స్వామీ" గొంతు పెగల్చుకుని, ఏం మాట్లాడాలో తోచక అంది.

"చూడు రాధికా... ఎప్పుడూ చూడలేదా? జీవితంలో పూజలూ, పునస్కారాలూ, వ్రతాలే కాదు, రక్తీ ముక్తీ అన్నీ కలగలసి వుండాలి. దైవభక్తితోపాటు జీవితాన్ని కూడా అనుభవించాలి"

"దేవసమానులైన మీరు..." రాధిక మాట పూర్తిచేయలేదు.

"ఇందులో తప్పేముంది? దేవతలు మాత్రం శృంగారం చేయలేదా? ఒక్కో దేవుడికి ఇద్దరేసీ, ముగ్గురేసీ భార్యలు. ఇద్దరు భార్యలు లేని దేవుడే లేడు. దాదాపు ఎంతో మంది దేవుళ్ళకి ప్రియురాళ్ళు కూడా వున్నారు. వెంకటేశ్వరస్వామికి బీబీనాంచారి ఏమవుతుంది? శ్రీకృష్ణ భగవానుడికి పదహారువేలమంది గోపికలట. ఇది తప్పు అని ఏ శాస్త్రం చెప్పడంలేదు. ఇది సృష్టికార్యం, సహజకార్యం"

స్వామి ధోరణికి రాధిక ఇబ్బంది పడింది. కొంతసేపు మాట్లాడలేదు.

త్వరగా పూజ అయిపోతే బాగుండు అని



మనసులో గట్టిగా కోరుకుంటోంది.

"పూజ చేద్దాం స్వామీ! పొద్దు పోతోంది"

"చేద్దాం. అటు చూడు"

రాధిక వీడియోవైపు చూసింది. నోట మాట రాలేదు.

పూర్తి నగ్నంగా ,తను. తన పక్కనే నగ్నంగా స్వామి. తన నడుముచుట్టూ చేతులు వేసి...

ఎలా జరిగింది?

తను దిగంబరపూజ చేసింది రాత్రిగదా! అంటే...

"బాగుందా, మనం కల్సి తీయించుకున్న వీడియో ఫిల్మ్"

"స్వామీ..." ఏడుపు వస్తుండగా అంది రాధిక.

"పర్లేదు. ముందు పూజ కానిద్దామా? " అంటూ కూర్చున్న స్వామి లేచాడు.

రాధికకి పరిస్థితి అర్థమయింది.

బయటికి వెళ్ళడానికి తలుపు వద్దకి వేగంగా వెళ్లింది. తలుపులు బిగించివున్నాయి. స్వామి రాధికని సమీపిస్తున్నాడు.

"తప్పు స్వామీ... పాపం స్వామీ" దీనంగా వేడుకున్నట్లే రెండు చేతులూ ఎత్తి నమస్కరిస్తూ రాధిక అంది.

"ఏమిటి తప్పు? మనం కల్సి వీడియో తీయించుకోవడమా? పూజ చేయడమా? "

"నేను అలాంటిదాన్ని కాదు స్వామీ"

"కొత్తలో ఎవరూ అలాంటివాళ్ళు కాదు, నీవు భయపడాల్సిన పనిలేదు. ఎవరికీ తెలియదు" .

"స్వామీ...".

"నీవు వూ అంటే చాలు, నీకు కోరినంత డబ్బూ, స్వర్గసుఖాలూ. ఆశ్రమంమీద పెత్తనం మొత్తం నీకే అప్పగిస్తాను. పైగా ఇది దేవుడి ఆజ్ఞ"

"స్వామీ" వేడుకుంటూ అంది రాధిక.

"ఇక్కడనించి నీవు తప్పించుకు వెళ్ళలేవు. గొడవచేసి లాభంలేదు. మంచిగా మంచం మీదకి వస్తావా సరే. లేకుంటే మనం తీయించుకున్న ఈ కేసెట్ మీవారు పని చేసే ఆఫీసులో ప్రతి ఒక్కరికీ ఒక్కోటి పోతుంది. మీ వీధిలో కూడా అందరికీ తెల్లవారేసరికి మా వాళ్ళు ఒక్కో ఇంటికి ఒక్కో క్యాసెట్ పంచి ఇస్తారు"

"దేవుని ప్రతిరూపం మీరు. పాపం స్వామీ" తనని సమీపిస్తున్న స్వామిని ప్రాధేయపడుతూ అంది రాధిక.

"పాపం కాదే, పుణ్యం. నేను నీలో ఐక్యమైపోతే నీ జన్మ తరించి పోతుందే. నీకు కోరినంత పుణ్యం వస్తుందే" స్వామి జుగుప్సాకరంగా మాట్లాడటం మొదలుపెట్టాడు.

స్వామినించి తప్పించుకోవడానికి రాధిక పెనుగులాడింది. పోట్లాడింది. అరిచింది. రక్కింది. కొరికింది. ఏడ్చింది. తప్పించుకోవడానికి శతవిధాలా ప్రయత్నించింది.

స్వామి పశుబలం ముందు రాధిక బలం ఏమాత్రం నిలబడలేకపోయింది.

తలుపులు ఇంకా తెరుచుకోలేదు. రాధిక సన్నగా ఏడుస్తూనే వుంది.

"ఎందుకు ఏడుస్తావు? ఎవరికీ తెలియదు. క్యాసెట్ కూడా ఎవరికీ ఇవ్వం. ఇంకో వారంరోజుల్లో మంత్రిగారు వస్తారు. మంత్రిగారితో కూడా ఒక నైటు వున్నావంటే చాలు, నా సమస్తం నీకే! ఆశ్రమం మొత్తం మీద నీ మాటకి ఎదురు వుండదు. ఆశ్రమం బాధ్యత మొత్తం నీ చేతులమీద నడపవచ్చు"

రాధిక ఏడుపు తగ్గలేదు.

"చెప్పు, మంత్రితో...!"

రాధికనించి జవాబు లేదు.

"ఆలోచించుకో. తొందరేమీ లేదు. రేపు





మీ ఆయన వస్తే వారంరోజులవరకూ చేయాల్సిన పూజలు కొన్ని వున్నాయని చెప్పు. వెనక్కి తిరిగి వెళ్ళిపోతాడు. మంత్రి మన ఆశ్రమానికి కావాల్సిన వాడు. ఇంతకు ముందు మనకి ఎంతో మేలు చేశాడు. ఇప్పుడైనా ఏ పని కావాల్సినా క్షణాలమీద చేసిపెడతాడు. మంత్రికి నీమీద మన సైంది. నువ్వే కావాలని ఇంతకుముందు కూడా అడిగాడు. మంత్రితో గడిపిన తరువాత క్యాసెట్ నీకు ఇస్తాను. దానిని నువ్వు ఏమైనా చేసుకో. రహస్యంగా చూసుకో, తగలేసుకో, పారేసుకో"

రాధిక మాట్లాడలేదు.

"ఆలోచించుకునే చెప్పు. ఈ క్యాసెట్‌లో నీ జాతకం అంతా వుంది. నీవు పరువుని కాపాడుకోదలుచుకుంటే నేను చెప్పినట్లు చేయి. నా మాట విను" సౌమ్యంగా చెప్పాడు స్వామి.

స్వామి బటన్ నొక్కడంతో కొద్దిసెకన్లకి తలుపులు తెరుచుకున్నాయి.

"ఈ విషయం మన ఇద్దరితోనే అంతం కావాలి. మూడో వ్యక్తికి ఎవరికైనా తెల్సిందో నీవు వుండవు. నీవు చెప్పిన ఆ మనిషిని కూడా వుంచం. చాలా తీవ్ర పరిణామాలు ఎదురవుతాయి. నేను ఏ విషయానికీ వెనుకాడను. అవసరమైతే ప్రాణాలు తీయడానికి కూడా సందేహించను. ఇప్పటికి నా చేతిలో కొందరు చచ్చిపోయారు కూడా"

రాధిక బాధని దిగమింగుకుంటూ గదికి చేరుకుంది.

"ఇంత పొద్దుపోయిందాకా వున్నావేమిటమ్మాయి? బాబు పాలకోసం చాలాసేపట్నించీ ఏడుస్తున్నాడు" అత్త అంది.

రాధిక వస్తున్న ఎక్కిళ్లని బలవంతంగా దిగమింగి మౌనం వహించింది.

"పూజ చేయడం అయిందా?" రాధిక మౌనంతో అత్త మళ్ళీ అడిగింది.

"ఆ" అంది రాధిక నిర్లిప్తంగా.

ఆమె బాబుని రాధికకి ఇచ్చిపడుకుంది.

బాబుకి పాలు ఇచ్చిన తరువాత రాధికకి ఎంతకీ నిద్రపట్టలేదు.

అత్త మరోవైపు గురకపెడుతూ నిద్రపోతోంది.

"స్వామి నిజంగా స్వామేనా? తను మోసపోయానా? " అని రాధికకి మొదటిసారిగా అనుమానం వచ్చింది.

స్వామి గాకపోతే ఈ మహిమలు అన్నీ చేయడం ఎలా సాధ్యమవుతుంది? ఇందులో మోసం ఏముంది? తన కళ్ళ ముందే ఎన్నో మహిమలు చేశాడుకదా!

స్వామి వద్ద గొప్ప శక్తులు, మహాత్యం లేకపోతే ఇవి అన్నీ ఎలా చేయగలిగాడు?

తను 14 సంవత్సరాలుగా పిల్లల కోసం ఎంత తపించింది? ఎన్నిచోట్లకి తిరిగింది? ఎంత మానసికక్షోభ అనుభవించింది?

స్వామి వద్దకి వస్తేనేకదా తనకి బిడ్డ కలిగింది.

మరి నిజంగా స్వామి అయితే ఈ పాపపు పనులు ఏమిటి? ఈ దుర్మార్గం ఏమిటి?

ఇలాంటి పాపపు పనులు చేసేవాళ్ళు స్వామిలు అవుతారా? స్వామి ఇంత దుర్మార్గుడు ఏమిటి?

రాత్రి దిగంబరపూజ అనీ... తనని గట్టిగా కళ్ళు మూసుకోమనీ కళ్ళు తెరవొద్దనీ.

పూజ పేరుతో తనని వీడియో తీశారు.

పెద్ద వెలుతురు వచ్చింది. అది వీడియో తీస్తుండగా వేసిన లైట్ల వెలుతురన్నమాట.

ఎంత మోసం జరిగింది!

తను కళ్ళు మూసుకుని వుండగా స్వామి

చేతులు తనకి తగిలాయి.

అసలు వీడియో తీయడం ఎలా సాధ్యమయింది? అంటే పక్కగదిలో వీడియో వాళ్ళు వున్నారన్నమాట. ఆ వీడియో వాళ్ళ ముందు కూడా తను నగ్నంగా.

ఇది పవిత్ర ఆశ్రమం కాదు. వీడు స్వామి కాదు.

ఏదో పెద్ద కుట్ర జరుగుతోంది.

తను జీవితంలో ఇతర పురుషుల్ని చూసి ఎరగదు.

తనకి భర్తతోనే జీవితం అనుకుంది. అలాంటిది ఈ విషయం అంతా రామక్రిష్ణకి చెప్పాలి.

విని, రామక్రిష్ణ ఏమంటాడు? తనని అనుమానిస్తాడా? తరువాత తనతో ఎలా ప్రవర్తిస్తాడు?

ఏమైనా కానీ... తనని ఏమైనా అననీ.

జరిగిన విషయం అంతా రామక్రిష్ణకి చెప్పాలి. అతని వద్ద తనకి దాపరికం వుండకూడదు.

రేపు ఉదయమే వస్తాడు రామక్రిష్ణ. వచ్చిన వెంటనే ఒక్కక్షణం ఆశ్రమంలో వుండకుండా వెళ్ళిపోవాలి. ఇక జీవితంలో ఈ ఆశ్రమం ముఖం చూడకూడదు.

తొమ్మిది గంటలు కావస్తుండగా రామక్రిష్ణ వచ్చాడు.

ఒక బుట్ట ఆపిల్ పండ్లూ, ఒక బుట్ట ద్రాక్షపండ్లూ స్వామివారికి తీసుకొచ్చాడు.

"ఏమైంది రాధీ... ఇప్పటివరకూ పడుకున్నావేం? " వస్తూనే అడిగాడు రామక్రిష్ణ.

"నాకు బాగులేదండీ. మీరు వస్తారనే ఎదురుచూస్తున్నాను. వెంటనే మన వూరు వెళ్ళిపోదాం"

"పూజలు మొత్తం చేయడం అయిపోయిందా? "

"పూజలు అయిపోయాయండీ. నాకు బాగులేదు. వూరు వెళ్దాం"

"ఎందుకు అంత తొందరపడుతున్నావు? వెళ్తాం కదా"

"ఇక్కడ నీళ్ళు నాకు సరిపడలేదు. పైగా మెన్సెస్. నిన్నట్నించీ ఒకటే కడుపునొప్పి. వెంటనే వెళ్ళిపోవాల్సిందే" అబద్ధం చెప్పింది రాధిక.

"డాక్టర్‌కి చూపెట్టుకుందాం"

"మన వూరు వెళ్ళి చూపెట్టుకుందాం. నేను మాత్రం ఇక్కడ నిమిషం వుండను" రాధిక విసుక్కుంటూ అంది.

"ఏం జరిగింది రాధీ? అలా వున్నావేం అసలు? ఎవరైనా ఏమైనా అన్నారా? మా అమ్మ ఏమైనా అన్నదా? "

"ఏం జరుగుతుంది? ఏం జరగలేదు. మనం వెళ్దాం"

"సరే, స్వామివారికి ఒక మాట చెప్పి వెళ్దాం"

"మీరు చెప్పిరండి. నేను సామాన్లు సర్దుతాను" అని రాధిక లేచి సామాను సర్దడంలో లీనమైపోయింది.

రామక్రిష్ణ మరోమాట మాట్లాడకుండా స్వామి వద్దకి వెళ్ళాడు.

ఆశ్రమసేవికలు లోపలకి వచ్చారు.

"రాత్రి విషయం ఎవరికీ చెప్పవద్దని స్వామివారి ఆజ్ఞ! వారి ఆజ్ఞని ధిక్కరించి ఎవరికైనా తెల్సిందో స్వామివారు శపించడం కానీ, చేతబడి చేయడం కానీ చేస్తారు. చెప్పినవాళ్లు, విన్నవాళ్ళు ఇద్దరూ మటాష్! మసైపోతారు. ఎవరికీ తెలియకూడదు. మీరు చెప్పకండి" లోనికి వచ్చిన సేవికల్లో ఒకరు స్పష్టంగా, ఎలాంటి సంకోచం లేకుండా రాధికకి చెప్పింది.

రాధికకి చాలా కోపం వచ్చింది. దుర్మార్గం చేసింది చాలక శపిస్తారా? చేత




బడి చేస్తారా?

"ఏం చేస్తారే నువ్వూ, నీ స్వామీ! ఇది ఆశ్రమం కాదే. బ్రోతల్ హౌస్. మీరంతా బ్రోతల్స్, తార్పుడుగత్తెలు, క్రిమినల్స్" అని పెద్దగా అరచి చెప్పాలనిపించింది రాధికకి.

కానీ తమాయించుకుని ఆ సేవిక మాట లకి మౌనం వహించింది.

స్వామి వద్దకి వెళ్ళి, రామక్రిష్ణ వినయంగా నమస్కారం చేసి చెప్పాడు.

"ఊరు వెళ్తున్నాం స్వామీ"

"అలాగే వెళ్ళిరండి" స్వామి దీవించాడు.

"త్వరలోనే మళ్ళీ వస్తాం స్వామీ"

"తప్పకుండా రండి. ఎక్కువగా ఆశ్రమానికి వస్తూండండి. మీకు పాసులు వున్నాయికదా"

"ఉన్నాయి స్వామీ"

స్వామి, రాధిక విషయం ఏం ప్రస్తావించలేదు.

బట్టలు అన్నీ సర్దుకుని రాధిక, రామక్రిష్ణ, వాళ్ళ అమ్మ వూరు ప్రయాణమై వచ్చేశారు.

ఇంటికి వచ్చిన రాధిక ఆ షాక్‌నించి తేరుకోలేకపోతోంది.

రామక్రిష్ణకి విషయం చెప్పాలని నిర్ణయించుకున్నా, ఎలా చెప్పాలో తోచకుండా వుంది.

రెండవరోజు రాత్రి చిన్నగా ఏడుస్తూ జరిగిన విషయం అంతా రామక్రిష్ణకి చెప్పింది.

రాధిక మాటలు విని రామక్రిష్ణ నిశ్చేష్టుడైపోయాడు. కొద్దిసేపు నోటమాట రాలేదు.

ఆశ్రమంలో వున్న రాధిక దగ్గరకి తను వెళ్ళినప్పుడు, గదిలోనికి వెళ్ళడమే ఆలస్యం, తను కనీసం కూర్చోకముందే వూరికి వెళ్దాం అని గొడవలానే అడిగింది.

రాధిక ధోరణికి ఏదో జరిగిందనే అనుమానం వచ్చింది రామక్రిష్ణకి. ఏదైనా జరిగితే చెపుతుందనే ఉద్దేశంతోనే అతను అడగలేదు.

ఇంత ఘోరాన్ని వూహించలేకపోయాడు.

తన రాధికని తను ఎంతో ప్రాణప్రదంగా ప్రేమించే రాధికని, తను అపురూపంగా చూసుకునే రాధికని...

అప్రయత్నంగా పళ్లు పటపట కొరికాడు రామక్రిష్ణ. చాలాసేపు మాట్లాడలేదు.

"నువ్వు చెప్పింది నమ్మలేకపోతున్నాను రాధీ... స్వామి ఇంత అకృత్యానికి వడిగట్టాడా?"

"వాడు స్వామి కాదండీ, పచ్చి మోసగాడు"

"స్వామి కాకపోతే ఇన్ని మహిమలు ఎలా చేయగలుగుతున్నాడు? చాలామంది అతను ఇచ్చిన నీళ్ళు తాగి తల్లులు అయ్యారుకదా. ఎంతోమందికి రోగాలు ఎలా తగ్గించగలిగాడు? మనమీద దుర్మార్గానికి పూనుకున్నాడు కానీ, స్వామి గాకుండా ఎలా పోతాడు?"

"నాకు రెండు రోజులనించీ ఇదే ఆలోచన! మీరు కూడా స్వామి చర్యల్ని గురించి వెనక్కి తిరిగి ఆలోచించండి. ఎంతమందికి రోగాలు తగ్గించగలిగాడు. ఎక్కడవరకో ఎందుకు, మీ ఆఫీసులో పనిచేసే గోపాలం అమ్మని మన మాటలు వినేకదా తీసుకొచ్చింది. ఆమెకి ఏం తగ్గింది? ఆమె ఆశ్రమానికి రాకపోతే బతికి అయినా వుండేదేమో. వాడు ఎవరి జబ్బులూ తగ్గించలేదు. కానీ అలా నమ్మించాడు"

"కొందరికి అయినా తగ్గలేదా? ఆశ్రమంలో వుంటున్న సౌజన్య విషయం ఏమిటి? ఆమెకి క్యాన్సర్ తగ్గలేదా?"

"ఆమెకి క్యాన్సర్ జబ్బు అని మనకేం తెల్సు? ఆమె చెబితే నమ్మడమేకదా. ఆమె

నిజంగా డాక్టర్ భార్యేనా? ఆమె స్వామి ఏజంట్ అని నా అనుమానం. ఆమె నడ వడికని చూస్తే అంత నమ్మదగిన మనిషిగా అనిపించడంలేదు"

"అంతే అంటావా? "

"ఆశ్రమంలో జరిగిన ఏ సంఘటన అయినా తీసుకోండి. అన్నీ ఎంత మోసంతో కూడుకున్నవో ఆలోచిస్తే అర్థం అవుతుంది" ఆవేశంగా, కోపంగా అంది రాధిక.

"ఆశ్రమానికి వెళ్తేనే కదా రాధీ మనకి పిల్లవాడు కలిగింది"

"వెళ్లకపోయినా పుట్టివుండేవాడేమో మన డాక్టర్‌గారు ఈ విషయంలో మన మాటల్ని అసలు నమ్మేది కాదు. మనల్ని ఎగతాళి చేసేది. ఆమెకీ, మనకీ అనేకసార్లు స్వామి విషయంలోనే వాదనలు జరిగాయి. స్వామిని అందరూ చాలా తేలికగా తిడు తుంటే, మనకి ఎంతో కోపం వచ్చేది. మనం అమాయకంగా వున్నామని నాకు అనిపిస్తోందండీ"

"అయితే ఇప్పుడు స్వామి విషయం ఏం చేద్దాం? "

"అదే నాకు అర్థం కావటంలేదు. ఏం చేస్తే బాగుంటుంది? వాడికి తగిన శిక్ష పడాలి. పోలీస్ కంప్లయింట్ ఇద్దామండీ"

"ఏమని ఇస్తాం రాధీ కంప్లయింట్? ఇలా జరిగిందని చెప్తే ముందు మనకి పరువుపోతుంది. పోలీసులవలన న్యాయం జరుగుతుందనుకోవడం భ్రమ! వాళ్ళు ఆధా రాలు కావాలంటారు. సాక్ష్యాలు చూపించ మంటారు. మనకి ఏం ఆధారాలు వున్నాయి, ఏం సాక్ష్యాలు వున్నాయి? పైగా వాడికి పలుకుబడి వుందీ, పవర్ వుందీ, పొలిటీషియన్సు తెల్సూ, పోలీసులు తెల్సూ కేసు పెట్టినా వాడిముందు నెగ్గలేం"

"పోలీసు అధికారులు ఆశ్రమానికి వచ్చినప్పుడు వాడికి వంగి వంగి సలాములు చేస్తుంటారు. పోలీసులవలన మనకి న్యాయం జరగదు. మరి ఎలాగండి? "

"వాడికి తగినశాస్తి చేయాలి. తగిన శిక్ష విధించాలి. నీ వంటిమీద వేసిన చేయిని అంతవరకూ తెగనరకాలి. వాడికి నేనే తగిన శాస్తి చేస్తాను" అన్నాడు రామక్రిష్ణ కోపంగా.

రామక్రిష్ణ ఎంత మంచిగా వుంటాడో, ఒక్కోసారి అంత మూర్ఖంగానూ వుంటాడు. కొన్ని విషయాల్లో అసలు వెనుకడుగువే యడు. మూర్ఖంగా ముందుకే పోతాడు. భర్త విషయం తెల్సిన రాధిక అతని మాట లకి కలత చెందింది.

"మీరు తొందరపడొద్దండీ. వాడి పాపం పండుతుంది. ఎల్లకాలం అందర్నీ మోసం చేయలేడుగదా. ఎవరో వాడికి తగినవాళ్లు తగిన శిక్ష విధిస్తారు. మీరు తొందరపడి వాడి జోలికి పోవద్దు" అంది రాధిక.

రామక్రిష్ణకి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఆలో చనలు! తెల్లవారేవరకూ అనేక రకాలుగా ఆలోచించి ఒక దృఢనిర్ణయానికి వచ్చాడు.

★ ★ ★

మరుసటిరోజు బాబుకి జ్వరం రావ డంతో రాధిక భయపడింది.

ఒకవేళ స్వామి చేతబడి చేశాడేమో అని మనసులో భయం కలిగింది. రామక్రిష్ణకి ఆ మాట చెప్పడానికి సంకోచించింది.

వెంటనే డాక్టర్‌కి చూపెట్టడం మంచిదనే ఉద్దేశంతో రామక్రిష్ణని కూడా వెంటపెట్టు కుని డాక్టర్ దగ్గరకి వెళ్ళారు.

వాళ్ళ ఫ్యామిలీ డాక్టర్ వైదేహి. దాదాపు పది సంవత్సరాలుగా వాళ్ళ కుటుంబంలో ఎవరికి బాగులేకపోయినా ఆమె వద్దకే వెళ్తుంటారు.

ఆమెతో బాగా పరిచయం కావడంతో పాటు బాగా సాన్నిహిత్యం కూడా ఏర్ప





డింది. ఫ్యామిలీ డాక్టరే గాకుండా ఫ్యామిలీ ఫ్రెండ్ కూడా అయ్యారు ఆవిడ.

నీళ్ళస్వామి నీటి మహిమని మాత్రం ఆమె మొదట్నించీ ఖండిస్తూనే వున్నారు. రాధికకో, రామక్రిష్ణకో బాగులేనప్పుడు ఆమె దగ్గరికి వెళ్తే ఆమె నవ్వుతూనే అంటారు.

"మీ నీళ్లస్వామి నీళ్లు పనిచేయలేదా ఏమిటి? అమృతమో, సంజీవినో, సర్వరోగ నివారిణో కానీ ఆ నీళ్లు వుండగా మీకు ఈ మందులు ఎందుకండీ? డబ్బు దండగ, చెంచాడు తీర్థం తీసుకుంటే పోయేదా నికి? "

"ఆశ్రమం ఇక్కడికి దూరం అయిపో యింది. దగ్గర అయినట్లయితే తీర్థమే తీసు కోకపోయామా? మీ దగ్గరకి ఎందుకు వచ్చేవాళ్ళం? " అని రామక్రిష్ణ కూడా నవ్వు తూనే జవాబు చెప్పేవాడు.

"ఏమిటీ, మొన్న నాలుగుసార్లు ఫోన్ చేసినా రింగ్ అవుతోంది కానీ రిసీవ్ చేసు కోలేదు. ఇంటికి లాక్ చేసి వూరు వెళ్ళారా ఏమిటి? " అడిగింది డాక్టర్ వైదేహి.

"అవును డాక్టర్, స్వామి దగ్గరకి వెళ్ళాం"

"మీకు ఇంకా ఆ పిచ్చి వదల్లేదా? "

"పిచ్చేనంటారా? " రామక్రిష్ణ నవ్వుతూ అడిగాడు.

"పిచ్చిగాక మరేమిటి? వాడెవడో దొంగ వెధవ తేలికగా డబ్బు కాజేయడానికి, నేను దేవుడ్నీ, నాకు శక్తులున్నాయి అంటే నమ్మి వాడిచుట్టూ తిరుగుతున్నారంటే ఏమనుకో వాలి? దాన్ని పిచ్చి అని కూడా అనరు, పిచ్చిని మించిన ఉన్మాదం"

"ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా వదుల్తోంది లెండి. కానీ మాకు అనుమానం డాక్టర్... మేం 14 సంవత్సరాలుగా పిల్లలకోసం ఎంత తపించామో మీకు తెల్సుకదా. ఆశ్రమానికి వెళ్తేనే మాకు బాబు పుట్టడం ఏమిటి? "

"వెళ్లకపోయినా పుట్టివుండేవాళ్ళు. మీరు అంతకుముందు వాడుతున్న మందులు అప్పుడు పనిచేసి వుండవచ్చు. ప్రెగ్నెన్సీ కోసం వాడే మందులు తక్షణ ప్రభావం చూపెట్టవు. నెమ్మదిగా పనిచేస్తాయి. అదే కాదు, యాభై సంవత్సరాల వయస్సులో తల్లి అయినవాళ్ళని నా సర్వీస్‌లో కొందర్ని చూశాను. కొంతమందికి ఆలస్యంగా పిల్లలు పుట్టే అవకాశం వుంది. మీది అలాంటి కేసు కావచ్చు"

ఆశ్రమంలో జరిగిన విషయం డాక్టర్‌కి చెప్పాలా, వద్దా అని చాలాసేపు తటపటా యించి చివరికి రాధిక అంది.

"నీళ్ళస్వామికీ, మాకూ ఒక విషయంలో గొడవ జరిగింది డాక్టర్. డబ్బు విష యంలో జరిగిన గొడవ. అప్పుడు ఆయన మమ్మల్ని చేతబడి చేస్తానని భయపె ట్టాడు. బాబుకి బాగా జ్వరం వస్తే భయ పడి తీసుకొచ్చాను"

"భలేవాళ్ళు మీరు. చదువుకున్నారు. లోకజ్ఞానం వుంది. అంత మూఢభక్తీ, మూఢభావాలూ ఏమిటి? చేతబళ్లు నిజంగా వున్నాయా? నిజంగా చేతబడివుంటే ఈ మారణాయుధాలూ, ఈ యుద్ధాలూ అన్నీ ఎందుకు? శతృత్వం వున్నవాళ్ళని చేతబళ్లు చేసి సంహరించేవాళ్ళు కదా! ఇవన్నీ ఉత్తచె త్తమాటలు" అని డాక్టర్ బాబుని పరీక్షిం చింది.

"టెంపరేచర్ వుంది. వాతావరణం మారి, ఎండలు పెరిగాయికదా. అందువలన వచ్చిన టెంపరేచర్ కావచ్చు. సాయంత్రా నికి తగ్గుతుంది. అలాంటి భయం ఏం పెట్టుకోకండి" అని బాబుకి మందులు రాసి ఇచ్చింది.

★ ★ ★

ప్రముఖ పారిశ్రామికవేత్త జగదీష్ ప్రేమానందస్వామివారి ఆశ్రమానికి స్వామి దర్శనానికి వచ్చాడు.

జగదీష్ కోటీశ్వరుడు. పట్టణంలో రెండు పెద్ద పరిశ్రమలు వున్నాయి. స్వామివారికి అత్యంత సన్నిహితుడు.

నూతన ఆశ్రమం నిర్మాణం కోసం జగదీష్ భారీగానే భూరివిరాళం సమర్పించాడు.

జగదీష్‌కి ఆశ్రమంలో ప్రత్యేక గది ఒకటి వుంది. అది ఆయనకే రిజర్వ్‌డ్. ఆయన కోసం ఎప్పుడూ ఆ గది ఖాళీగానే వుంటుంది.

నెలకి రెండు మూడు ఆదివారాలు జగదీష్ ఆశ్రమాన్ని సందర్శిస్తుంటాడు.

సకల సౌకర్యాలతో వున్న ఆ గదిలో జగదీష్ విశ్రాంతి తీసుకుంటూ వుండగా ఆశ్రమసేవిక అనసూయ వచ్చింది.

"విశేషాలేమిటి? " జగదీష్ అడిగాడు.

"ఏముంటాయి సార్, మామూలే"

"మహిళా సదనానికి కొత్తగా అమ్మాయిలు ఎవరూ రాలేదా? "

"లేదు సార్"

"మరి ఇవ్వాల్టి ప్రోగ్రాం" అంటూ జగదీష్ జేబులోనించి ఐదువందల రూపాయలు నోటు ఒకటితీసి "తీసుకో" అంటూ అనసూయకి ఇచ్చాడు.

ఆమె ఆ నోటు అందుకుంటూ అంది. "బాలికల పాఠశాలలో పనిచేయడానికి సరస్వతి అనే టీచర్ వచ్చింది సార్. ఆమె కూడా అనాథే. చాలా బ్యూటీఫుల్‌గా వుంటుంది. మీరు ఒకసారి చూస్తే వదిలిపెట్టరు సార్. అంత అందగత్తె ఆమె. కళ్లు చెదురుతాయనుకోండి. కానీ చాలా మొండిఘటం సార్. అంత తేలికగా లొంగే మనిషి కాదు"

"మరి ఎలా అయితే? "





"ఈమధ్య మనిషి కొద్దిగా మారింది. వచ్చినప్పుడయితే మగవాళ్ళని చూస్తే హడలిపోయేది. వీలవుతుందిలెండి. మీ గదికి తీసుకువస్తాను. మీరు మాయమాటలో మంచి మాటలో చెప్పి ఎలాగో మేనేజ్ చేసుకోండి. అడిగినంత డబ్బు ఇస్తే కాదంటుందా? డబ్బుకి లోకం దాసోహం కదా"

"డబ్బు ఎంత కావాలంటే అంత ఇద్దాం. డబ్బుకేం సమస్య? "

"ఇక్కడికి తీసుకొస్తాను. ఎలాగో లొంగతీసుకోండి"

"స్వామివారికి మాత్రం ఈ విషయం ఎలాంటి పరిస్థితిలో తెలియకూడదు. చాలా రహస్యంగా వుంచాలి"

"అమ్మో... స్వామివారికి తెలిస్తే ఇంకేముంది సార్? కొంప మునిగిపోదూ? ఆమెనీ, నన్నూ, చివరికి మిమ్మల్ని కూడా ఎవర్నీ ఆశ్రమంలో వుంచరు. ఎంత పెద్దవాళ్లు కానీ, చివరికి దేవుడైనా సరే తప్పు చేస్తే స్వామివారు అసలు క్షమించరు సార్. ఇలాంటి విషయాల్లో అయితే స్వామివారు చాలా స్ట్రిక్టూ, కరెక్టూ, పెరఫెక్టూ"

ముక్కున మూడు ఇంగ్లీషు ముక్కలు పెట్టుకుని తరచూ అవి వల్లెవేయడం అనసూయ అలవాటు.

సరస్వతిని తీసుకురావడానికి ఆమె వెళ్ళింది.

తను ఇలాంటివాడని స్వామివారికి తెలిస్తే తన పరువూ, విలువా, గౌరవం అన్నీ మంట గలిసిపోతాయని జగదీష్ భయం. ఈ విషయాలు స్వామికి తెలియవని జగదీష్ భావన.

అయితే స్వామికి తెలియకుండా ఆశ్రమంలో ఏ విషయమూ జరగదు. చివరికి చీమ చిటుక్కుమన్నా స్వామివారికి తెలియాల్సిందే.

స్వామి ఆదేశాలతోనే ఇలాంటి విషయాలు అన్నీ పకడ్బందీగా జరుగుతుం

టాయి.

"గాలానికి చేప చిక్కుకోవాలంటే ఎర కావాలి. ఎన్నో ఎరలు వేస్తేనే ఎన్నో రకాలు చేపలు పడుతుంటాయి. అలాగే భక్తుల్ని రాబట్టుకోవాలంటే రకరకాల ఎరలు వేయాలి" అని స్వామి తన ఆంతరంగికులతో అంటూంటాడు.

అనసూయ వెళ్ళి కొంతసేపటికి సరస్వతిని వెంటపెట్టుకుని వచ్చింది.

ఆశ్రమానికీ, అనాథ బాలికల పాఠశాలకీ, మహిళా సదనానికీ ఒకచోటునించి మరోచోటుకి వెళ్ళాలంటే అసాధ్యం. పగటిపూట అయితే గేట్లు తెరిచినా కాపలావాళ్ళు వుంటారుకానీ, రాత్రివేళ గేట్లు లాక్‌చేసి మరీ పహరా కాస్తుంటారు.

బయట వ్యక్తులు చూడటానికి చాలా కష్టంగా వుంటుంది కానీ అన్ని ప్రదేశాలకీ రహస్యమార్గాలూ, దొంగదారులూ వున్నాయి.

కాపలా వాళ్ళ కళ్లు కప్పి ఎవరికీ తెలియనిదారినించి సరస్వతిని తీసుకువచ్చింది అనసూయ.

జగదీష్ వాళ్ళ కోసమే ఎదురుచూస్తున్నాడు.

గదిలో సరస్వతిని వదిలి అనసూయ బయటికి వచ్చింది.

"డబ్బు ఎంత కావాలి? పర్లేదు. ఎంత కావాలంటే అంత తీసుకో. డబ్బు దగ్గిర నేను వెనుకాడను. నాకు బోలెడు డబ్బు వుంది" అన్నాడు జగదీష్.

అతను అప్పటికే బాగా మద్యం సేవించి వున్నాడు. మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి.

"నాకు డబ్బు ఎందుకండీ? నేనేం చేసుకుంటాను డబ్బు? నాకు మీరు కావాలి" అంది సరస్వతి

సరస్వతి మాటలతో ఉత్సాహపడిపోయాడు జగదీష్. పిచ్చిపిచ్చిగా మాట్లాడటం మొదలుపెట్టాడు.

"రాత్రి అంతా వుండమంటారా?" అడిగింది సరస్వతి.

"అంతకంటే ఇంక కావాల్సిందేం వుంది?"

"మీరు ఏం అనుకోనంటే ఒక మాట" సరస్వతి అంది.

"ఫర్లేదు, ఏం అనుకోను అడుగు"

"మీ నోరు వాసనగా వుంది. జస్ట్ మౌత్ వాష్ చేసుకుని రండి"

"ఓయస్... టూ మినిట్స్‌లో వస్తాను" సరస్వతి బుగ్గమీద చిటికె వేసి బాత్‌రూంలోకి వెళ్లాడు జగదీష్.

టీపాయ్ మీద మద్యం సీసా, గ్లాసులు వున్నాయి.

సరస్వతి క్షణం ఆలస్యం చేయకుండా జాకెట్‌లో దాచుకున్న ప్యాకెట్ తీసి అందులోని పౌడరు ఒక గ్లాసులో వేసి సీసాలోనించి మద్యం కొద్దిగా ఆ గ్లాసులో వంపింది. జగదీష్ బాత్‌రూంలోనించి వచ్చాడు.

సరస్వతిని దగ్గరకి తీసుకుని భుజం చుట్టూ చేతులు వేశాడు.

"అది విస్కీనా, బ్రాందీనా?" జగదీష్ దృష్టిని మందు మీదకి మరలిస్తూ సరస్వతి అడిగింది.

"విస్కీ వేసుకోనా ఒక పెగ్" అని జగదీష్ గ్లాసు అందుకుని సిప్ చేయడం మొదలుపెట్టాడు.

ఆ గ్లాసులోది నెమ్మదిగా తాగి గ్లాసు టీపాయ్ మీద పెట్టే సమయంలోనే కళ్లు మూతలు పడటం మొదలుపెట్టాయి.

కొద్దిసేపటికే మంచంమీద అడ్డంగాపడి స్పృహలో లేకుండా నిద్రలోకి వరిగిపోయాడు.

ఐదు నిముషాలు ఆగి సరస్వతి అతన్ని కదిలించింది. మన లోకంలో లేడు. మెల్లగా లేచి తలుపు తీసుకుని గదినించి బయటపడింది సరస్వతి.



ఆశ్రమ ప్రాంగణం అంతా ఉద్రిక్తంగా వుంది. అందరూ ఆందోళనపడి పోతున్నారు.

ఆశ్రమంనించి రాత్రి సరస్వతి తప్పించుకుని వెళ్లిపోయింది.

ఎంతో పటిష్టంగా పకడ్బందీగా వున్న కాపలా వ్యవస్థని ఛేదించుకుని ఎలా తప్పించుకుపోయిందో ఎవరికీ అంతుబట్టడం లేదు.

స్వామి శిష్యులూ, శిష్యురాళ్లూ, సేవికలూ, ముఖ్యులైన భక్తులూ అందరూ ఆశ్రమంలోని అన్ని గదుల్లోనూ గాలిస్తున్నారు.

స్వామి ముఖంలో కూడా గాభరా కనిపిస్తోంది.

సరస్వతి ఆశ్రమ పాఠశాలలో టీచర్‌గా పనిచేయడానికి వచ్చిన అనాధ వ్యక్తి.

అనాధ మహిళల సేవాసదనంలో వుంటూ పాఠశాలలోని లోయర్‌క్లాసులకి టీచర్‌గా పనిచేస్తోంది.

ఇటీవలనే ఆమె ఆశ్రమానికి వచ్చింది. అందంగా వుంటుంది.

స్వామి ఆమె మీద వరుసగా రెండు రోజులు అత్యాచారాలు జరిపాడు. అలాంటి అందమైన మనిషిని విఐపిలకి పరిచయం చేస్తే ఆశ్రమానికి వుపయోగంగా వుంటుందని స్వామి ఆలోచన.

కానీ అందుకు ఆమె ససేమిరా కాదని తిరస్కరించింది. ఎంతగా చెప్పినా కాదూ కూడదంది.

ఆమెని బెదిరించడానికీ బ్లాక్‌మెయిల్ చేయడానికీ వీడియో ఫిల్మ్ తీశారు. నగ్నంగా ఫోటోలు తీశారు.

చివరికి సరస్వతిని ఒప్పించమని అనసూయ నెత్తిమీద బాధ్యత పెట్టారు.

"ఏం సరస్వతీ.. స్వామి వారు చెప్పినట్లు చేయరాదూ? " అనసూయ అడిగింది.

అడిగిన అనసూయని కౌగిలించుకుని భోరుమని విలపించింది సరస్వతి.

"నన్ను ఈ పాప పంకిలంలో దించొద్దు అక్కా... నేను వెళ్లిపోతాను అక్కా... నేను ఈ ఆశ్రమంలో వుండలేను అక్కా"

"ఎక్కడికి వెళ్తావు? "

"ఎక్కడికైనా వెళ్లిపోతాను అక్కా! ఇక్కడ వుండటంకంటే అడుక్కు తిని జీవించడం మంచిది. నన్ను కాపాడక్కా"

"పిచ్చిదానా ఎక్కడికైనా వెళ్లడం అంత తేలిక అనుకుంటున్నావా? చాలా ప్రమాదం"

"ప్రమాదం అయినా ఫర్లేదక్కా! నువ్వే నన్ను రక్షించాలి. ఇది ఆశ్రమంకాదు, ఇది ఖైదు. ఇది ఖైదు అని ముందే తెలిస్తే వచ్చేదాన్నికాదు" అని సరస్వతి అనసూయ మీద పడి విరామం లేకుండా విలపించింది.





సరస్వతి దీనస్థితికీ బేలతనానికీ అనసూయ కరిగిపోయింది.

"ఇక్కడ్నించి తప్పించుకుని వెళ్లడం చాలా కష్టం. ఇంతకుముందు ఇలాగే ఒకరు తప్పించుకుపోవాలని ప్రయత్నించి దొరికిపోయారు. తరువాత వాళ్లు చాలా చిత్ర హింసలు అనుభవించారు"

"నాకు ఇక్కడ వుండటం అసలు ఇష్టంలేదక్కా"

"సరే నేను సాయం చేస్తాను. సదనాన్నించి బయటకి పోవాలంటే చాలా కష్టం. ఇంతకంటే వివపీలు వుండే గదుల్లోంచి తప్పించుకుపోయే అవకాశంవుంది. నేను చెప్పినట్లుచేయి" అని సరస్వతి తప్పించుకుపోవడానికి అనసూయ పథకం రూపొందించింది.

"నీవు పొరపాటున ఈ రాక్షసుల చేతికి దొరికితే నా పేరు మాత్రం బయటపెట్టొద్దు. నాక్కూడా చిక్కులొస్తాయి" అని అనసూయ హెచ్చరించింది.

"నా ప్రాణం పోయినా నీవు సాయం చేసినట్లు చెప్పనక్కా" అంది సరస్వతి.

అనసూయ చెప్పినట్లు సరస్వతి జగదీష్‌తో గడపడానికి అంగీకరించినట్లుగా నాటకమాడి తప్పించుకుపోయింది.

సరస్వతి జగదీష్‌తో రాత్రి వుండటానికి ఎలా అంగీకరించిందో స్వామి వారికి బోధపడటంలేదు.

తనకి తెలియకుండా ఆశ్రమంలో ఏదో పెద్ద కుట్ర జరుగుతున్నదని స్వామి భయపడిపోయాడు. ఎన్నో జాగ్రత్తలు తీసుకుని కట్టుదిట్టంగా కాపలా ఏర్పాటు చేసినా తప్పించుకుపోయిందంటే సామాన్యమైన విషయం కాదు.

ఇలాంటి కొన్ని సంఘటనలు జరిగితే అప్రతిష్టపాలు కావడమే కాకుండా ఆశ్రమాన్ని కూడా మూసివేసుకోవాల్సిన పరిస్థితి దాపురించవచ్చు

అసలు సరస్వతి అంగీకరించడం అంటేనే స్వామికి నమ్మసాధ్యం కావడంలేదు.

లోపలివాళ్ల సహకారం లేకుండా సరస్వతి ఒక్కతే తప్పించుకోవడం అనేది జరిగేపని కాదు.

లోపలివాళ్లు ఎవరు సహకరించారు?

అనుమానంలేదు. అనసూయే సహకరించి వుంటుంది.

స్వామి తన గదికి అనసూయని పిలిపించాడు.

"సరస్వతిని నువ్వు నిజంగా జగదీష్ గదిలో వదిలిపెట్టివచ్చావా?"

"నిజం స్వామీ! కావాలంటే జగదీష్ గారిని మీరు అడగండి. లేదా ఎవరిచేతనైనా అడిగించండి"

"జగదీష్ ఏమన్నాడు?"

"సరస్వతి గదిలోకి వెళ్లిన తరువాత కొద్దిసేపటికి జగదీష్ బయటకి వచ్చి నైటు అంతా వుంటుంది నన్ను వెళ్లిపొమ్మని చెబితే తిరిగి నా గదికి వచ్చాను స్వామీ"

"జగదీష్‌తో ఎంతసేపు వుందట? ఎన్నిగంటలకి బైటకి వెళ్లిందట?"

"తెలియదు స్వామీ"

"జగదీష్‌తో వుండటానికి నిజంగానే ఒప్పుకుందా? లేకపోతే ఏమైనా మోసం వుందా?"

"మోసం ఏమో స్వామీ! నేను అడిగిన వెంటనే చాలా సంతోషంగా ఒప్పుకుంది. మొదట్నించీ మొండికి పడుతున్న మనిషి ఎందుకు అంత సులభంగా ఒప్పుకుందో నాకు అర్థం కావడంలేదు స్వామీ"

"ఇవ్వాళ జగదీష్‌తో మాట్లాడావా?"

"మాట్లాడాను స్వామీ"

"సరస్వతి విషయం ఏమన్నాడు?"



"ఏం జరిగిందో నాకు తెలియదు, నేను నిద్రపోయాను అని చెపుతున్నాడు స్వామీ!"

"నాలుగు రోజులుగా రోజూ సరస్వతి నీ గదికి వస్తోందా?"

"లేదు స్వామీ"

"నిజం చెప్పు నాలుగు రోజుల్నించీ ప్రతి రోజూ సరస్వతి నీ గదిలోకి వస్తోంది. ఇద్దరూ ఏమిటో గంటల తరబడి మాట్లాడు కుంటున్నారు అవునుకదా"

"లేదు స్వామీ"

"సరస్వతి నీ గదికి రావడం కూడా అబద్ధమా?"

"నా గదికి మామూలుగానే వస్తోంది కానీ ప్రత్యేక కారణం లేదు స్వామీ"

"అసలు నా గదికే రావడంలేదు అన్నావు ఇంత క్రితం. సరస్వతి తప్పించుకుపోయే విషయం నీకు తెలుసా లేదా?"

"నాకు తెలియదు స్వామీ"

"నీవు ఇలా చెప్పవు" అని స్వామి కూర్చున్నవాడు అనసూయ దగ్గరకి వచ్చాడు.

"నాకు తెలియదు స్వామీ నన్ను నమ్మండి స్వామీ" అని అనసూయ భయంతో పెద్దగా అంది.

"అయితే నిజం చెప్పు నిన్నేం చేయను"

"నిజంగా నాకు తెలియదు స్వామీ"

"అలాగా?" అని స్వామి అనసూయ గొంతు పట్టుకున్నాడు.

"తెలియదు నీకూ... చెప్పు.. తెలియదూ" అని రెండు చేతుల్తో గొంతు వత్తడం మొదలు పెట్టాడు.

"తెలియదు స్వామీ" అని అనసూయ గట్టిగా అంటోంది.

అనసూయ మాటలతో స్వామి కోపం తారాస్థాయికి చేరుకుంటోంది. చేతులు బిగుసుకుంటున్నాయి. పళ్లు కొరుకుతున్నాడు.

"తెలియదూ.. నిజం చెప్పు" అంటూ ఉన్మాదిలా వూగిపోతూ అరుస్తున్నాడు.

పెనుగులాడుతూ, చేతుల్లోనించి తప్పించుకోవడానికి చూస్తూ గిలగిలలాడుతోంది అనసూయ.

ఆమె సమాధానంతో మరో ఆలోచన లేకుండా మరింత రెచ్చిపోయిన స్వామి నిజం చెప్పమని చేతులు బిగించాడు.

అప్పటికే ఘోరం జరిగింది. అనసూయ నాలుక వెలుపలకి పెట్టేసి కళ్లు తేలేసింది.

ఊహించని ఉపద్రవానికి స్వామి హతాశుడైపోయాడు.

క్షణంలో తేరుకుని అనసూయని మంచం మీద పడుకోబెట్టి ముఖం మీద చన్నీళ్లు చల్లి గొంతు దగ్గర చేతుల్తో సవరించడం మొదలుపెట్టాడు.

అయితే అప్పటికే అంతా అయిపోయింది. అనసూయ ప్రాణాలు పోయాయి. ఆమెని మంచంమీద పడుకోబెట్టి నీళ్లు చల్లడం వ్యర్థమైపోయింది.

గదిలో ఎవరూ లేరు. స్వామికి ఏం చేయాలో తోచలేదు. అంతపని అవుతుందని స్వామి భావించలేదు. స్వామికి ఒళ్లంతా చెమటలు పట్టాయి.

★ ★ ★

రాత్రి రెండు గంటలు.

నూనెస్వామి తన నివాసం కోసం నిర్మించుకున్న చిన్న బిల్డింగ్‌లో పడుకుని మంచి నిద్రలో వున్న సమయం.

భక్తుల కోసం నిర్మించిన పూరిషెడ్‌లో నలుగురు భక్తులూ, వాళ్ల కుటుంబ సభ్యులూ నిద్రపోతున్నారు.

భక్తుల్లో ఇద్దరు గాలిసోకినవాళ్లు, ఒకరు బిడ్డల కోసం వచ్చిన భక్తురాలూ, మరొకరు





రోగం తగ్గడం కోసం వచ్చిన భక్తుడూ.

వాళ్లు నిద్రలో వుండగా మిలిటరీ దుస్తుల్లాంటివి ధరించి తుపాకులు చేతబూనిన 8 మంది ఆశ్రమంలోకి ప్రవేశించారు. వాళ్లలో ఇద్దరు మహిళలు కూడా వున్నారు.

ఒక పురుషుడూ, మరొక మహిళా స్వామి నివశించే బిల్డింగ్ వద్దకి వెళ్లి మాట లేకుండా తలుపుల్ని పెద్ద శబ్దం వచ్చేలా తట్టేరు.

"ఎవరూ? " స్వామి పెద్దగా అరిచాడు.

ఇటు వైపునించి "మేమే" అనడం తప్ప స్పష్టమైన జవాబులేదు.

"ఎవర్రా తలుపుల్ని అలా కొట్టడం? మేం అంటే మీకు వూరూ పేరూ లేదా? వస్తున్నా వుండండి" పెద్దగా అరుస్తూ కోప్పడుతూ తలుపులు తెరుస్తూ "ఎందుకు తలుపుల్ని అలా కొడుతున్నారు? " అన్నాడు.

ఎదురుగా యూనిఫాం మనుషులు.

"ఎవరు మీరు? ఏం కావాలి? " వాళ్లని చూసి అర్థంకాక అడిగాడు స్వామి.

బయటకి వచ్చిన స్వామిని ఇద్దరు పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

"వదలండి. నా సంగతి తెలియదూ? నేను శపించానంటే మీరు మాడిమసై పోతారు. వదలండి" ఆగ్రహంగా పెనుగులాడుతూ అన్నాడు నూనెస్వామి.

"శపించరా చూద్దాం" అంటూ ఓ మహిళ స్వామి వీపుమీద ఒకటిచ్చుకుంది.

స్వామికి నిద్రమత్తూ, బెదిరింపు మత్తూ పూర్తిగా వదిలాయి. వీళ్లముందు తన ఎత్తుగడలు పనిచేయవనే విషయం బోధపడింది.

"ఏరా నువ్వు స్వామివా? జనం సమస్యలు పరిష్కరిస్తావా? జనం కోరిన కోర్కెలు తీరుస్తావా? " అంటూ రెండో వ్యక్తి నాలుగు దెబ్బలు కొట్టాడు.

"అమ్మో... బాబోయ్... వదలండి నాయనోయ్... నన్ను కాపాడండి. నన్ను రక్షించండి" అంటూ పెద్దగా అరిచాడు స్వామి.

"ఎవర్రా నిన్ను రక్షించేది? నీవే రక్షిస్తానంటున్నావు కదరా ప్రజల్ని" అని మరో రెండు దెబ్బలు కొట్టారు వాళ్లు.

పూరిపాకలో వున్న భక్తుల్ని లేపి దూరంగా ఒక చోటుకి తీసుకుపోయారు ఇంకొందరు యూనిఫారం మనుషులు. వారిలో కొందరు బిల్డింగ్ లోనికి జొరబడ్డారు.

"స్వామిని అని చెపుతూ ప్రజల్ని మోసం చేస్తావురా? మొత్తం ఎంత సొమ్ము కొట్టేశావు? పని చేసుకుని బతకలేవురా? " అంటూ ఒకతను కర్ర తీసుకుని నూనెస్వామిని కొట్టడం మొదలుపెట్టాడు.

నూనెస్వామి పెద్దగా పెడబొబ్బలు పెడుతూ ఏడుపు లంకించుకున్నాడు.

"చక్కగా పనిచేసుకుని బతుకు. నేను స్వామినీ, దేవుడ్నీ అని ప్రజల్ని మోసం చేశావా, జాగ్రత్త! ఈసారి నిన్ను చంపేస్తాం. నిన్ను ఎవరూ రక్షించరు" కొట్టడం ఆపి నూనెస్వామిని హెచ్చరించారు వాళ్లు.

"నేను దేవుడ్నికాను సార్! నేను మోసం చేయను. నన్ను వదిలిపెట్టండి సార్! మీ కాళ్లు మొక్కుతాను, ఏదో పొట్టకూటికి తంటాలు పడుతున్నాను సార్" రకరకాలుగా అరుస్తూ, ఏడుస్తూ ప్రాధేయపడ్డాడు నూనెస్వామి.

నూనెస్వామినీ, అతని భార్య పార్వతినీ దూరంగా కూర్చోపెట్టిన భక్తుల దగ్గరకి తీసుకుపోయి వీళ్లని కూడా అక్కడ కూర్చోపెట్టారు. వాళ్లకి కాపలాగా ఒకరు నిలుచుకున్నారు.

మిగతావాళ్లు బిల్డింగ్‌కి డైనమైట్లు అమర్చారు.



కొద్దిసేపటికి పెద్ద శబ్దంతో బిల్డింగ్ కుప్పకూలిపోయింది. పూరిపాకలకి కిరోసిన్ పోసి నిప్పంటించారు.

తమ పని తాపీగా పూర్తి చేసుకుని నూనె స్వామికి ఒక లెటర్ ఇచ్చి నినాదాలు చేసుకుంటూ వెళ్లిపోయారు వాళ్లు.

నూనెస్వామి దంపతులు కట్టుబట్టలతో మిగిలారు.

★ ★ ★

రోజులు జరుగుతున్నాయి.

రాధిక మామూలు మనిషి కావడానికి ప్రయత్నిస్తోంది. స్వామి ఆశ్రమంలో జరిగిన సంఘటన పీడకలలానే వుంది.

స్వామి గుర్తు వచ్చినప్పుడు తిట్టుకుంటోంది. రామక్రిష్ణ వుంటే అతనికి చెప్పి తిట్టిన తిట్టుతిట్టకుండా తిడుతోంది.

ఒకరోజు రామక్రిష్ణ అన్నాడు, "రాధీ... ఆఫీసు పనిమీద హైద్రాబాద్ వెళ్లాలి. వారం రోజులవరకూ తిరిగి రావడానికి వీలుకాదు. నాకు వెళ్లడం ఇష్టం లేకపోయినా మా ఆఫీసర్ వెళ్లి రావాల్సిందే అని కూర్చున్నాడు. వెళ్లక తప్పేటట్లు లేదు"

"తప్పనిసరైతే వెళ్లండి. నాకూ మా వూరు వెళ్లాలని వుంది. వెళ్లి చాలా రోజులు అవుతోంది. మొన్న మా నాన్న వచ్చినప్పుడు పిల్లవాడ్ని తీసుకుని రమ్మని చాలా సార్లు చెప్పాడు. మా అమ్మ కూడా పిల్లవాడ్ని చూడాలనుకుంటున్నదట. మీరు వెళ్లడానికి ముందు నన్ను మా వూళ్లో వదిలిపెట్టిరండి. మీరు తిరిగి వచ్చేరోజుకి నేనూ వస్తాను" అంది రాధిక.

"అలాగే బహుశా ఎల్లుండి సాయంత్రం వెళ్లాల్సి రావచ్చు రేపే నిన్ను మీ వూళ్లో దింపి వస్తాను. మళ్లీ వారం రోజుల్లో నువ్వు తిరిగి రావాలి"

"అలాగే వస్తాను. మా నాన్ననో, మా అమ్మనో తోడు పెట్టుకుని వస్తాను" అంది రాధిక.

మరుసటి రోజు దంపతులు ప్రయాణమై రాధిక వాళ్ల పుట్టిల్లు చేరుకున్నారు.

కూతురు, అల్లుడు, మనుమడు రావడంతో రాధిక తల్లిదండ్రులకి పండుగ అయింది. ఎంతో సంతోషించారు.

ఎడ తెగని కబుర్లు, మాటల్లో నీళ్లస్వామి ప్రస్తావన వచ్చింది.

"అప్పుడు మన వూరునించి చాలామంది నీళ్లస్వామి దగ్గరకు వెళ్లారుకదమ్మా! శ్యామల, కళ్యాణి, రమణ, సుప్రియ వీళ్లందరూ స్వామి దగ్గరకివెళ్తే నెలలు అని చెప్పారు. ఇప్పుడు వాళ్లు ప్రసవించారా లేదా? " రాధిక వాళ్ల అమ్మని అడిగింది.

"ప్రసవించడమా, పాడా? నీ ఒక్కదానికే గురి కుదిరింది. ఈ వూళ్లో చాలామందికి అసలు నమ్మకం కుదర్లేదమ్మా! ఇప్పుడు వాళ్లందరూ ఆ నీళ్లస్వామిని దుమ్మెత్తిపోస్తున్నారు. అయినా వెళ్లేవాళ్లు వెళ్తూనే వున్నారనుకో"

"వాళ్లందరూ నాతో తమకి నెలలు అని చెప్పారుకదా! లేకుండానే నెలలు అని ఎలా చెప్పారు? "

"అప్పుడు అలా చెప్పారు. నీతో చెప్పిన వాళ్లలో కొందరు మన ఇంటికి దగ్గరగా వున్నవాళ్లేకదా! వాళ్లని పిలుస్తాను వుండు" అని రాధిక అమ్మ కొందర్ని పిలుచుకు వచ్చింది.

వాళ్లు రాధికని ఆప్యాయంగా పలకరించారు. రాధిక వాళ్లని నీళ్లస్వామి విషయం అడిగింది. రామక్రిష్ణ కూడా అక్కడే వున్నాడు.

"ఆయన స్వామి కాదు. అంతా మోసం, నాటకం! ఆయన ఇచ్చిన తీర్థం తాగితే మన వూళ్లో ఒక్కరికీ పిల్లలు కలగలేదు. పోనీ రోగాలతో వెళ్లినవాళ్లకి కూడా ఒక్కరికీ





రోగం తగ్గలేదు. పైగా అక్కడికి పోయిన ఇద్దరు ముగ్గురికి రోగాలు ముదిరి పోయాయి కూడా"

"అప్పుడు మీకు నెలలు అని చెప్పారుకదా నాతో"

"నీళ్లస్వామి అందర్నీ అలా చెప్పమంటాడు. నెలలు రాకపోయినా నెలలు అని చెప్పాల్సిందే అంటాడు. అలా చెబితేనే గర్భం నిలుస్తుందీ లేకపోతే పోతుంది అని బెదిరిస్తాడు. ఇంక అలా చెప్పక తప్పుతుందా? " అంది కల్యాణి అనే ఆమె.

నీళ్లస్వామి తెలివిగా జనాల్ని మోసం చేయడం, తెలివిగా కోట్లకి పడగలెత్తడం, చదువుకున్న తాము కూడా వాడి మాయలో పడి మోసపోవడం. అవి తలుచుకుని రాధిక, రామక్రిష్ణ తమ తెలివి తక్కువతనానికి బాధపడుతూనే మరోవైపు బాగా కోపగించుకున్నారు.

ఆరోజు రాత్రి వుండి, మరుసటి రోజు ఉదయమే రామక్రిష్ణ ప్రయాణమై వెళ్లిపోయాడు.

★ ★ ★

ఆఫీసు పని అని చెప్పిన రామక్రిష్ణ ఆశ్రమానికి వెళ్లి నీళ్లస్వామి అంతు చూడాలనుకున్నాడు. విషయం తేల్చుకోవాలనుకున్నాడు.

ఇలా తను ఆశ్రమానికి వెళ్తున్నానని తెలిస్తే రాధిక అంగీకరించదనే ఉద్దేశంతో ఆఫీసు పని మీద వెళ్తున్నట్లు అబద్ధం చెప్పాడు.

ఆఫీసులో కొలీగ్స్‌కి అత్తవారి వూరు వెళ్తున్నట్లు చెప్పి సెలవు పెట్టాడు.

ఎందుకైనా మంచిదని బజారుకి వెళ్లి పదునైన కత్తి కొన్నాడు. దానిని భద్రంగా సూట్‌కేసులో పెట్టాడు. ఒక జత బట్టలు కూడా సర్దుకున్నాడు.

సాయంత్రం బయల్దేరి మరుసటి రోజు ఉదయానికి ఆశ్రమానికి చేరుకున్నాడు రామక్రిష్ణ. పాస్ వుందికాబట్టి లోనికి వెళ్లడానికి ఎలాంటి అభ్యంతరం వ్యక్తం కాలేదు.

రామక్రిష్ణ వచ్చాడని తెలిసి ప్రేమానంద స్వామి కంగుతిన్నాడు. ఎప్పుడూ కుటుంబ సమేతంగా వచ్చే రామక్రిష్ణ ఒంటరిగా వచ్చాడని సేవికలు స్వామికి తెలిపారు.

దొంగకి ఉలికిపాటు ఎక్కువ. పైగా స్వామికి చాలాముందు చూపు వుంది.

ఉదయం భజన సమయంలో రామక్రిష్ణని రమ్మని కబురు చేశాడు స్వామి. రామక్రిష్ణ వచ్చాడు.

స్వామి పీఠం మీద ఆశీనులై వుండగా, చుట్టూ చాలామంది భక్తులు కూర్చుని భజన చేయడం ప్రారంభించారు.

రామక్రిష్ణ కూడా భజనలో పాల్గొన్నాడు కానీ ఉత్సాహంగా మాత్రం లేడు. భజన జరుగుతున్నంతసేపూ అసహనంగా వున్నాడు.

భజన అయిన తరువాత స్వామి శిష్యులు మినహా మిగతా భక్తులు వెళ్లిపోయారు. స్వామి చెంతకు రామక్రిష్ణ వచ్చాడు. "నేను మీతో మాట్లాడాలి స్వామీ!"

"చెప్పు ఏమిటో? "

"ఇప్పుడు కాదు స్వామీ, ఏకాంతంగా మాట్లాడాలి!"

"ఇప్పుడు వీలుకాదుగదా? "

"మీకు ఎప్పుడు వీలైతే అప్పుడు"

"సరే చెపుతాను" అని స్వామి శిష్యులతో ఆంతరంగిక మందిరంలోనికి వెళ్లిపోయాడు.

ఇద్దరికీ మనసులో వ్యతిరేక భావం వుంది. అందుకే ఇద్దరూ గతంలో మాదిరిగా చనువుగా, నిస్సంకోచంగా మాట్లాడుకో

లేకపోయారు.

రాధిక విషయం అడగడానికే రామక్రిష్ణ వచ్చాడని స్వామి వూహించాడు.

రామక్రిష్ణ కదలికల్ని జాగ్రత్తగా గమనించమని ఇద్దరు వేగులకి పని పురమాయించాడు స్వామి.

రామక్రిష్ణ అందరితో మామూలుగానే మాట్లాడుతున్నాడు. స్వామికి సంబంధించి అనుకూలంగాకానీ వ్యతిరేకంగా కానీ ఎవరితో ఏమీ మాట్లాడలేదు. ఆ వేగులు మూడు రోజులు రామక్రిష్ణని అనుసరించి పరిశీలించినా ఏ విషయమూ చెప్పలేకపోయారు.

మూడు రోజులు గడిచిపోయాయి. రామక్రిష్ణ కలుసుకోవడానికి స్వామినించి పిలుపు రాలేదు.

నాలుగో రోజు సాయంత్రం స్వామిని కలుసుకోవడానికి రామక్రిష్ణకి అనుమతి లభించింది. శిష్యులు రామక్రిష్ణ దగ్గరకి వచ్చి సాయంత్రం స్వామీజీ ఒంటరిగా వుంటారు. కలుసుకోవడానికి రమ్మని చెప్పారు.

పూజ గదిలో స్వామి ఏకాంతంగా ధ్యానంలో కూర్చుని వుండగా రామక్రిష్ణ లోనికి దారితీశాడు.

ధ్యానం ముగిసిన తరువాత స్వామి అడిగాడు. "చెప్పండి... ఏమిటి విశేషాలు? "

రామక్రిష్ణ చుట్టూ పరికించి చూశాడు. దగ్గరలో ఎవరూ లేరు.

"రాధికని వీడియో తీశావట కదా? నాకు ఆ వీడియో క్యాసెట్ కావాలి" మొదట్లోనే ఏకవచనంతో సంబోధిస్తూ సూటిగా అడిగాడు రామక్రిష్ణ.

"ఏం వీడియో? " అమాయకంగా అడిగాడు స్వామి.

"నాటకాలు ఆడకు. నీ ఆధ్వర్యంలో రాధికని వీడియో తీశారా, లేదా? "

"వీడియోలు ఆశ్రమంలో ఎందుకు తీస్తారు? నీకేమైనా మతిపోయిందా? "

"మతిపోవడంవలనే నీ ఆశ్రమానికి వచ్చాం. మతిసరిగా వున్నవాడు ఎవడైనా నీ ఆశ్రమానికీ, నీ దగ్గరకీ ఎందుకు వస్తారు? నువ్వు ఎలాంటి స్వామివో ఇప్పుడు మాకు మహా బాగా తెల్సింది" కోపంగా అన్నాడు రామక్రిష్ణ.

"సరే ఇక నీవు వెళ్లిపోవచ్చు. మా సమయం వృధా చేయవద్దు"

"రోజంతా తిని తిరగడమేనా ఇంకా ఏమైనా ప్రత్యేకమైన పనివుందా నీ సమయం వృధా కావడానికి"

"మాటలు అనవసరం"

"అయితే వీడియో క్యాసెట్ ఇవ్వనంటావు"

"ఇవ్వను... ఏం చేసుకుంటావో చేసుకో" అన్నాడు స్వామి నిర్లక్ష్యంగా.

"నాతో తమాషారా నీకు? నీ అంతు చూస్తాను. మర్యాదగా క్యాసెట్ ఇస్తావా, ఛస్తావా? " అంటూ రామక్రిష్ణ బొడ్లో పెట్టుకున్న పదునైన కత్తి తీసుకుని స్వామి చొక్కా పట్టుకున్నాడు.

స్వామి చప్పట్లు కొట్టాడు.

క్షణంలోనే పక్కగదిలోనించి కాషాయబట్టలు ధరించిన ముగ్గురు మెరికల్లాంటి శిష్యులు వచ్చి రామక్రిష్ణని పట్టుకున్నారు.

రామక్రిష్ణనించి ప్రమాదాన్ని ముందే పసిగట్టిన స్వామి మెరికల్లాంటి శిష్యుల్ని తనకి అందుబాటులో వుంచుకున్నాడు.

రామక్రిష్ణ ఎగిరి స్వామి పొట్టమీద ఒక్క తన్ను తన్నేడు. స్వామి వెళ్లిదూరంగా పడ్డాడు.

"నన్నే తంతావురా" అని స్వామి లేచి వచ్చాడు.




రామక్రిష్ణ శిష్యులనించి తప్పించుకుని స్వామినీ, శిష్యుల్నీ కలిపి కొట్టడం మొదలు పెట్టాడు.

ఈతోపులాట, కొట్లాటలో రామక్రిష్ణ చేతి లోని కత్తిదూరంగా వెళ్లిపడింది.

దెబ్బలనించి కాచుకుంటూనే ఒక శిష్యుడు వడుపుగా వెళ్లి రామక్రిష్ణని పట్టుకున్నాడు. రామక్రిష్ణ ఆ శిష్యుడ్నించి తప్పించుకోవడా నికి పెనుగులాడుతూనే కత్తి అందుకోబోతు న్నాడు.

అయితే అప్పటికే స్వామి కత్తి అందుకు న్నాడు.

శిష్యులు రామక్రిష్ణని గట్టిగా పట్టుకు న్నారు. అయినా రామక్రిష్ణ పెనుగులాడు తూనే వున్నాడు.

"కత్తి తీసుకొచ్చావంటే నువ్వు నన్ను లేపెయ్యడానికే కదరా! పైగా నా మీద కాలు ఎత్తి నన్నే తంతావురా? ఇవ్వాళ ఎంత గండం గడిచిపోయింది. నేను జాగ్ర త్తగా వుండకపోయినట్లయితే ఈ పాటికి స్వర్గలోకంలో వుండేవాడిని. ఇప్పుడేకాదు. ఎప్పటికైనా నువ్వు నాకు ప్రమాదమే. నిన్ను వుంచకూడదు. నువ్వు కానీ వుంటే నాకే కాదు ఆశ్రమానికీ ప్రమాదమే! నిన్ను అడ్డు తొలగించుకోవడమే మంచిది. తరు వాత విషయం తరువాత అని కత్తి తీసు కుని రామక్రిష్ణ మీదకి వచ్చాడు.

శిష్యులు పట్టుకుని వుండగా స్వామి రామక్రిష్ణ పొట్టలోనూ, డొక్కలోనూ, గుండె లమీదా కత్తిపోట్లు పొడిచాడు. ఒక శిష్యుడు వారిస్తున్నా స్వామి ఆగలేదు.

రామక్రిష్ణ అక్కడికక్కడే నెత్తురు మడు గులో కుప్పకూలిపోయాడు. ఆ ప్రదేశం అంతా రక్తసిక్తమైపోయింది.

కిందపడిన రామక్రిష్ణ కొద్దిసేపు గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచాడు.

నెత్తురు చూసిన ఒక శిష్యుడు వణికి పోతూ కొయ్యబారి పోయి స్పృహతప్పాడు.

★ ★ ★

రామక్రిష్ణ వెళ్లి పదిరోజులైంది.

వారం రోజులకే వస్తానని చెప్పి పది రోజులకి కూడా రాకపోవడంతో ఎప్పుడు వస్తాడో తెల్సుకుందామని రాధిక భర్త ఆఫీ స్‌కి ఫోన్ చేసింది.

"ఆఫీసు పనిమీద వెళ్లలేదండీ! అత్తవారిం టికి వెళ్తున్నామని వారం రోజుల లీవ్ పె ట్టాడు. లీవ్ దాటి కూడా మూడు రోజు లైంది. ఆఫీస్‌కి కూడా ఎలాంటి ఇన్‌ఫర్మే షన్ లేదు. మేం కూడా రామక్రిష్ణగారి కోసం చూస్తున్నాం" అని ఆఫీసు వాళ్లు చెప్పారు.

ఆఫీసు పనిమీద వెళ్తున్నానని ఎక్కడికి వెళ్లాడు రామక్రిష్ణ.

ఏం పనులు వుంటాయి? ఎక్కడికి వెళ్లాడో రాధికకి అర్థం కాలేదు.

రాధికా, ఆమె తల్లిదండ్రులూ భయప డ్డారు.

అప్పటికప్పుడే అందరూ ప్రయాణమై రామక్రిష్ణ వాళ్ల వూరు వచ్చారు.

"నీతో మీ వూరు వచ్చాడు కదమ్మాయి" అంది రామక్రిష్ణ అమ్మ.

"నాతో వచ్చి మళ్లీ వెంటనే తిరిగి వచ్చారు అత్తయ్యా! ఆఫీసు పనిమీద హైద్రాబాద్ వెళ్లాలని నన్ను మా వూళ్లో వదిలి పెట్టారు. ఆఫీసులో అడిగితే అలాంటి పనేమీ లేదన్నారు!" అంది రాధిక.

రామక్రిష్ణ బంధువుల్నీ, స్నేహితుల్నీ అందర్ని ఎంక్వయిరీ చేశారు.

అందరూ తమకి తెలియదనీ, తాము చూడలేదనీ చెప్పారు.

స్వామి ఆశ్రమానికి వెళ్లి వుంటాడేమో అని రాధికకి అనుమానం. ఆ మాటే తండ్రితో అంది.

"అయితే అక్కడికి వెళ్లి కనుక్కుంటాను" అని ఆయన రామక్రిష్ణ ఫొటో తీసుకుని ప్రయాణమై నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లాడు.

ఆదివారం, భక్తులకి ఉచితంగా దర్శనం లభించే రోజు. రాధిక తండ్రి ఆశ్రమంలోనికి వెళ్లాడు.

ఆశ్రమంలో కనపడిన శిష్యులకీ, భక్తులకీ రామక్రిష్ణ ఫొటో చూపెట్టి, "ఇటీవల ఏమైనా కనిపించాడా? " అని అడిగాడు.

"ఈమధ్య కాలంలో ఆశ్రమానికి రాలేదండీ! ఇంతకుముందు ఆశ్రమానికి వస్తున్న మనిషే! ఇక్కడికి వస్తే వుంటాడుకదా! ఇక్కడికి రాలేదు. ఎక్కడికి వెళ్లాడో విచారించండి" అన్నారు ఆశ్రమవాసులు.

ఆయన ఒక రోజంతా ప్రయత్నించి నిట్టూరుస్తూ తిరిగి వచ్చాడు.

"నాకు నీళ్లస్వామి ఆశ్రమానికి వెళ్లి వుంటాడనే అనిపిస్తోంది నాన్నా! అంతకు మించి ఎక్కడికీ వెళ్లే అవకాశం లేదు"

"అక్కడ చాలామందిని ఎంక్వయిరీ చేశాను. వాళ్లు రాలేదంటున్నారు. అక్కడికి వెళ్తే తిరిగి రావాల్సిన మనిషికదా! నీకు చెప్పకుండా అసలు అక్కడికి ఎందుకు వెళ్తాడు? " అన్నాడు ఆయన.

"మరి ఏం చేద్దాం నాన్నా? "

"పోలీస్ కంప్లయింట్ ఇచ్చాం. పోలీసులు వెదుకుతున్నారు? "

"ఎప్పుడూ ఎక్కడికీ చెప్పకుండా వెళ్లిన మనిషికాదు. ఆఫీసుకో, బజారుకో వెళ్లేటప్పుడు కూడా నాలుగుసార్లు చెప్పి వెళ్లేవారు. అసలు చెప్పకుండా వెళ్లడం ఏమిటో అర్థం కాకుండా వుంది" అంది రాధిక కళ్లు తుడుచుకుంటూ విచారంగా.

"సరే... నేను మనవూరు వెళ్లి రేపు సాయంత్రానికి తిరిగి వస్తానమ్మా! ఉన్నపాటునే బయల్దేరి వచ్చాం. అక్కడ సముదాయించుకోవాల్సిన పనులు చాలా వున్నాయి"

"మీరు తొందరగా పనులు ముగించుకుని రండి నాన్నా!" అంది రాధిక.

ఆయన వాళ్ల వూరు వచ్చాడు.

మరుసటి రోజు ఉదయం ఆయనకి బజారులో నాగభూషణం కనిపించాడు.

"ఏరా భూషణం... స్వామి ఆశ్రమానికి భక్తుల్ని తీసుకుపోతున్నావా? " అడిగాడు రాధిక తండ్రి.

"ఏం తీసుకుపోవటంలెండి? మన ప్రాంతంనించి భక్తులు బాగా తగ్గిపోయారు. వీళ్లకి తెలివిమీరిపోయింది. అక్కడ స్వామి వారు కూడా అందరికీ అంత తేలికగా దర్శనం ఇవ్వడం లేదనుకోండి. అవునుగానీ ఈమధ్య మన అల్లుడుగారు నాకు ఆశ్రమం దగ్గర కనిపించాడండీ" అన్నాడు భూషణం.

"ఏమిటీ... మా అల్లుడా? నిజంగానా? "

"ఇందులో అబద్ధం ఏముందండీ? నిజంగానే కనిపించాడు. నాతో మాట్లాడాడు కూడా! ఒక్కణ్ణే వచ్చానని చెప్పాడు"

"ఇంట్లో చెప్పకుండా వెళ్ళాడ్రా. నీకు నిజంగా కనపడ్డాడా? గుర్తుచేసుకో. ఎన్ని రోజులవుతోంది? "

"ఇందులో గుర్తు చేసుకోవడానికి ఏముందండీ? పోయిన నెల పదిహేనో తేదీకదా నేను ఆశ్రమానికి వెళ్లింది. అదేరోజు నాకు కనపడ్డాడు, కనబడ్డమేకాదు, నాతో మాట్లాడాడు కూడానండీ"

రాధిక తండ్రికి ప్రాణం లేచివచ్చినట్లయింది.

ఇంట్లోనూ, వూళ్ళోనూ అవసరమైన పనులు పూర్తిచేసుకుని వెంటనే కూతురు




దగ్గరకి బయల్దేరి వెళ్ళాడు.

★ ★ ★

రామక్రిష్ణ నీళ్ళస్వామి ఆశ్రమానికి వెళ్ళాడనే విషయం స్పష్టమైంది.

ఆశ్రమ వాసులు రాలేదంటున్నారు.

రామక్రిష్ణని ఏమైనా చేసి వుంటారనే సంశయం, భయం రాధికకి పట్టుకుంది.

"నీళ్ళస్వామి ఆశ్రమం దగ్గరకి వెళ్దాం నాన్నా. అక్కడ నాకు తెల్సిన వాళ్ళున్నారు. వాళ్ళని అడిగితే ఏమైనా చెప్పొచ్చు. కొద్దిగా ఆధారం దొరికినా తరువాత తేల్చుకోవచ్చు" అంది రాధిక.

"అయితే తమ్ముడ్ని తీసుకుని వెళ్లు. వాడు నీకు తోడు వుంటాడు. ఈ వయసులో నేను ప్రయాణం చేయడం కూడా కష్టం" అన్నాడు ఆయన.

రాధిక వాళ్ళ పిన్ని కొడుకుని వెంటపెట్టుకుని, నీళ్లస్వామి ఆశ్రమం వున్న వూరుకి చేరుకుంది.

ఆశ్రమంలోనికి వెళ్ళడం అంత క్షేమంకాదని వూళ్ళోకి వెళ్ళింది.

ఆ వూరికి ఇప్పుడు బస్సులు వస్తున్నాయి. చిన్న బస్టాండు ఏర్పడింది. అక్కడ రెండు బడ్డీలూ, ఒక టీకొట్టూ వెలిశాయి.

రాధిక తమ్ముడు బస్టాండులో వున్న బడ్డీల వద్దకివెళ్ళి, రామక్రిష్ణ ఫొటో చూపెట్టి ఇటీవల ఏమైనా కనిపించాడా అని అడిగాడు.

"చూసినట్లే వుంది కానీ, గట్టిగా గుర్తు రావడంలేదు" అన్నారు ఒకరిద్దరు.

ఊళ్ళో నీళ్లస్వామి అంటే చాలామందికి గట్టి వ్యతిరేకత వుంది. రాధిక ఆరోజు ఒకరి ఇంట్లో వుండి, ఆశ్రమంలో తనకి తెల్సినవాళ్ళని బయటకి ఎలా పిలిపించాలా అని ఆలోచించింది.

ఆ ఇంటివాళ్లని సలహా అడిగింది.

"ఆశ్రమానికి కూరగాయలు సరఫరా చేసేది మన బంధువుల కుర్రాడే. అతని ద్వారా ఏమైనా పని జరగొచ్చేమో చూడండి" అన్నారు ఆ ఇంటివాళ్ళు.

రాధిక ఒక ఉత్తరం రాసి ఆ కుర్రాడికి ఇచ్చి, ఆశ్రమంలో తనకి తెల్సిన సేవికపేరు చెప్పి ఆమెకి రహస్యంగా ఇవ్వమని కోరింది.

ఆ కుర్రాడు వుత్తరం తీసుకుపోయి సేవికకి ఇచ్చాడు. ఆమెనుంచి ఎలాంటి ప్రత్యుత్తరం లేదు. ఆమె ఆ వుత్తరాన్ని చదివి, మనకెందుకు ఈ గొడవ అనే వుద్దేశంతో చింపి పారేసింది. అయితే ఎవరికీ విషయం కూడా చెప్పలేదు.

రాధిక ఆ వూళ్ళో ఎన్ని ప్రయత్నాలు చేసినా రామక్రిష్ణ ఎక్కడున్నాడో తెలుసుకోలేకపోయింది. రామక్రిష్ణ ఆచూకీ దొరక్కపోయినా, ఆశ్రమానికి వచ్చిన విషయం మాత్రం ధృవపరుచుకుంది.

తను చేసే ఈ చిన్న ప్రయత్నాల వలన ఇంకా ఆలస్యం అవుతుందనీ, రామక్రిష్ణని ఆశ్రమంలో బంధించి వుంచితే ఇంకా ప్రమాదంలో చిక్కుకుంటాడనీ, అతను తొందరగా బయటికి రావాలన్నా, ఏ విషయం తొందరగా తెలియాలన్నా స్థానిక పోలీస్‌స్టేషన్‌లో కంప్లయింట్ ఇవ్వడమే మంచిదని రాధిక అనుకుంది.

ఆ ఏరియా పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి విషయం ఎస్ఐకి చెప్పింది.

"ఏమిటీ, స్వామీజీ మీద అనుమానంగా వుందా?" రాధిక మాటలకి ఎస్ఐ ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ అడిగాడు.

"అవును సార్, స్వామి మావారిని ఏదో చేసి వుంటాడు సార్"

"స్వామీజీ మీవారిని ఏం చేస్తారమ్మా? ఎందుకు చేస్తారు?"

"నిజానికి అది ఆశ్రమం కాదుసార్. అక్కడ జరగని పాపం లేదుసార్"

రాధిక మాట్లాడుతూ వుండగానే వినలేను అన్నట్లుగా ఎస్ఐ 'రామరామ' అంటూ రెండుచేతులూ రెండు చెవులకీ అడ్డంగా పెట్టుకున్నాడు.

"మీవారు ఎక్కడికి అని చెప్పి పోయాడు?"

"ఆశ్రమానికి వెళ్తున్నాననే చెప్పి వచ్చాడు సార్"

"ఆశ్రమానికి అనిచెప్పి వచ్చిన మనిషి ఆశ్రమంలో వుండాలికదా. దారిలో ఎక్కడైనా మిస్సయ్యాడేమో"

"ఎలా మిస్సవుతాడు సార్?"

"మరి ఎక్కడికి పోయినట్లు? చెప్పేదానికి తలా తోకా వుండాలి. నోరువుంది కదా, నాలిక వుంది కదా అని ఎలా అంటే అలా మాట్లాడితే కుదురుతుందా?" ఎస్ఐ చిరాగ్గా అన్నాడు.

"స్వామి ఆశ్రమానికి మావారు వచ్చినట్లు చూసిన వాళ్ళు చెపుతున్నారు. ఆశ్రమంలో అడిగితే వీళ్ళు రాలేదని చెపుతున్నారు. వీళ్ళే మావార్ని ఏదో చేసి వుంటారు సార్" రాధిక కళ్ళంట నీళ్ళు తిరుగుతుండగా వస్తున్న ఏడుపుని దిగమింగుకుంటూ అంది.

"ఏంచేద్దాం? కడివెడంత గుమ్మడికాయ కూడా కత్తిపీటకి లోకువట. అలా వుంది నీ వాలకం. స్వామీజీ మీద ఆరోపణలు చేయడం తేలికే. బురద చల్లడం ఎంతసేపు పడుతుంది? అవతలివాళ్ళ స్థాయి కూడా ఈ రోజుల్లో ఎవరూ చూడటంలేదమ్మా"

"అక్కడ చాలా పాపాలు జరుగుతున్నాయి సార్"

"పవిత్ర భారతదేశంలో పాపాలు జరగని చోటేదమ్మా? పాపాత్ములకి అన్ని చోట్లా పాపాలు కనపడుతూనే వుంటాయి. ఏం చేద్దాం? స్వామి... దైవ స్వరూపుడు... భక్తుల కొంగుబంగారం... స్వామిని నిందించడం అంటే అంతకంటే పాపం ఇంకేముంటుంది తల్లీ? ఎవరు పాపాలు చేస్తున్నారో తెలుస్తూనే వుందికదా. కలికాల మహాత్యం" అన్నాడు ఎస్.ఐ. కసి కలగలిసిన వేదాంత ధోరణితో.

ఆయన నుదుటిమీద కుంకుమతో పెద్ద బొట్టు పెట్టుకుని వున్నాడు.

"వాడు స్వామికాదండీ"

"కళ్ళు పోతాయమ్మా అలా దూషిస్తే... మేం ఆగే కొద్దీ స్వామిజీని నువ్వు ఇంకెంతగా దూషిస్తావో. నీనోటినుంచి మేం ఇంకా ఎలాంటి పాపపు మాటలు వినాల్సి వస్తుందో? వాదన ఎందుకు, కాగితంమీద ఒక రిపోర్ట్ రాసి ఇచ్చి వెళ్లిపోండి. మా ప్రయత్నాలు మేం చేస్తాం" అన్నాడు ఎస్.ఐ.

"మీరు ఆశ్రమం సోదా చేయాలి సార్. ఆశ్రమంలోనికి వెళ్ళి గాలిస్తే మావారి ఆచూకి దొరుకుతుంది?"

"మేం చేస్తాం కదా. మీరు రిపోర్ట్ రాసి మాట్లాడకుండా వెళ్లిపోండి. మా డ్యూటీ మేం చేస్తాం" కసురుకున్నట్లుగా ఎస్.ఐ. అన్నాడు.

ఎస్.ఐ. తిరస్కార ధోరణిని రాధిక కూడా తిరస్కారంతోనే చూసింది.

అవసరం తనది.

"మీరు సీరియస్‌గా ప్రయత్నించాలి సార్"

"ఏమ్మా... మీరు చదువుకున్నవాళ్ళకి మల్లే వున్నారు. ఒక్కసారి చెబితే అర్థం చేసుకోవాలి. మీరు రిపోర్ట్ రాసి ఇచ్చి పోండి. మా ప్రయత్నం చేస్తాం అంటున్నాం కదా. మీరు ఇక్కడ వుండకూడదు. మీరు ఎక్కువసేపు ఇక్కడుంటే





చిక్కుల్లో పడతారు. మిమ్మల్ని ఎవరూ కాపాడలేరు" రాధికని బెదిరిస్తూ ఎస్ఐ అన్నాడు.

మొండివాడు రాజుకంటే బలవంతుడు. రాధిక ఎస్.ఐ. మాటల్ని పట్టించుకోలేదు.

రాధిక కదిలేలా లేదని, బైట తనకి వేరే పని వుండడంతో "రైటర్‌కి రిపోర్ట్ రాసి ఇచ్చిపోండి" అని చెప్పి ఎస్.ఐ. మోటార్‌సైకిల్ స్టార్ట్ చేసుకుని స్టేషన్‌నుంచి వెళ్ళిపోయాడు.

రాధిక రైటర్ దగ్గరకి వెళ్ళింది.

"మేం భార్యాబిడ్డలతో కాపురం చేసుకోవడం మీకు ఇష్టంలేదా తల్లీ? " రైటర్ అడిగాడు.

"అదేంటి సార్ అలా అంటున్నారు? "

"అవునమ్మా, స్వామివారికి వ్యతిరేకంగా మేం ఏమైనా చర్యలు తీసుకుంటే, పై అధికారులు మమ్మల్ని ఇక్కడ వుంచరు. ఏ అదిలాబాదుకో, కరీంనగర్‌కో నక్సలైట్లమధ్యకి పోయి చావండ్రా అని మాకు క్షణాల మీద ట్రాన్స్ఫర్ కాగితాలు పంపిస్తారు"

"సార్"

"అంతేనమ్మా మరి. మీరు రిపోర్ట్ రాసి ఇచ్చిపోండి" అని రైటర్ మరోమాటకి అవకాశం ఇవ్వకుండా న్యూస్‌పేపర్ చదువుకోవడంలో మునిగిపోయాడు.

స్టేషన్‌లోని సిబ్బంది తీరుకి రాధిక నిరుత్సాహపడిపోయింది. వీళ్ళవలన తనకి న్యాయం లభించడం జరిగే పనికాదని నిర్ధారించుకుంది.

ఎస్.ఐ. కనీసం తను చెప్పేమాటలు కూడా పూర్తిగా వినలేదు. ఎస్.ఐ. నీళ్ళస్వామికి భక్తుడనే విషయం అతని మాటల్లోనే తెలుస్తోంది.

పోలీస్ ఉన్నతాధికారుల వద్దకి వెళ్తే ఏమైనా ప్రయోజనం కలగవచ్చు

రామక్రిష్ణ అదృశ్యం వెనుకవున్న శక్తుల్ని వెలికితీసే వరకూ తను విశ్రమించకూడదు.

తనబిడ్డ తండ్రిలేని బిడ్డ కాకూడదు.

ఏమైనా సరే, నీళ్ళస్వామి విషయం తేల్చుకోవాల్సిందే. రామక్రిష్ణని వాళ్ళే ఏదో చేసి వుంటారు.

రాధిక బిడ్డని చంకన వేసుకుని బయల్దేరింది.

ఈ స్టేషన్‌లోని ఎస్.ఐ.తో పాటు ఇతర పోలీస్‌సిబ్బంది అందరూ స్వామి తొత్తులే. ఆశ్రమంనుంచి ఈ పోలీసులు అందరికీ నెలనెలా భారీగా బహుమానాలూ, మామూళ్ళూ అందుతుంటాయి. పైగా అవార్డులు, రివార్డులు, ప్రమోషన్లకోసం నీళ్ల స్వామి మోచేతినీళ్ళు వీళ్ళు తాగుతుంటారు.

ఉన్నతాధికారుల్ని కలుసుకుని, విషయం చెప్పి న్యాయం చేయమని కోరాలని రాధిక నిశ్చయించుకుంది.

★ ★ ★

అక్కడికి ముప్ఫయ్ కిలోమీటర్ల దూరంలో వున్న డిఎస్పీ కార్యాలయానికి చేరుకుంది రాధిక. వెంట ఆమె పిన్నికొడుకు సుధీర్ కూడా వున్నాడు. సుధీర్ ఎంఎస్సీ అయిన తరువాత యూనివర్శిటీలో పిహెచ్‌డి చేస్తున్నాడు.

రాధిక వెళ్ళిన సమయానికి డిఎస్పీ వున్నాడు. రాధిక ఆయనకి విషయం అంతా చెప్పింది. స్వామి తనమీద దుర్మార్గం చేసిన విషయం మాత్రం రాధిక ఎవరికీ చెప్పదలచుకోలేదు. చెప్పినందువలన ప్రయోజనం ఏమీ వుండకపోగా, తను లోకువ కూడా అవుతానేమో అని రాధిక భావించింది.

"మీ వారిని స్వామి ఆశ్రమంలో బంధించి వుంటారంటావు. మమ్మల్ని వెళ్ళి సోదా చేయమంటావు. అంతేకదా" డిఎస్పీ

అడిగాడు.

"బంధించడంగానీ, ఏమైనా చేయడంకానీ చేసి వుంటారని అనుమానం సార్" రాధిక వినయంగా అంది.

"ఒకవేళ ఆయన అక్కడ లేకపోతే ఏంచేద్దాం? "

"అక్కడికి వెళ్ళినట్లు చూసినవాళ్ళు చెప్పారు సార్. తరువాత మాకు కనపడ లేదు"

"మేం వెళ్ళి సెర్చ్ చేస్తాం. అక్కడ మీ ఆయన ఆచూకీ దొరకదు. తరువాత ప్రేమానందస్వామి మీమీద పరువునష్టం దావా వేస్తాడనుకోండి. మీరు కేసులో ఇరు క్కోవాల్సి వస్తుంది"

"పర్లేదు సార్. మీరు న్యాయం చేస్తారనే ఆశతోనే వచ్చాను"

"ఓ.కే. మీరు రేపు వుదయం కనబ డండి. మేం ఈరోజే వెళ్ళి ఎంక్వయిరీ చేస్తాం" అని డిఎస్పీ రాధికకి హామీఇచ్చి జీపు రెడీ చేయమని డ్రైవర్‌కి చెప్పి, దగ్గర లోనే వున్న నివాసానికి భోజనానికి నడిచి వెళ్ళాడు.

తెలియని వూరు. రాధిక ఎక్కడికీ వెళ్ళద లచుకోలేదు. దగ్గరలోనే వున్న హోటల్‌లో టిఫిన్ చేసి వచ్చి స్టేషన్‌లోనే కూర్చుంది.

డిఎస్పీ బృందం వెళ్ళి సోదాచేసి వచ్చి చెప్పేవరకూ స్టేషన్‌నుంచి కదలకూడదను కుంది.

"ఎక్స్‌క్యూజ్‌మీ. మీకు అభ్యంతరం లేక పోతే మా ఇంటికి వచ్చి విశ్రాంతి తీసు కోండి" ఒక కానిస్టేబుల్ రాధిక చెంతకి వచ్చి వినయంగా అడిగాడు.

"పర్లేదండీ. ఇక్కడే వుంటాను"

"మా ఇంటికి రండి. నా భార్యాపిల్లలు కూడా వున్నారు. పసిబిడ్డతో, ఎండలో ఎందుకు? మీరు మా ఇంటికి వస్తే మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి కూడా"

"ఇక్కడ మాట్లాడండి. ఏమిటో? "

"కాదండీ, ఇంటికిరండి"

రాధిక తప్పించుకోలేకపోయింది. కానిస్టే బుల్ రాధికని తాము వుండే క్వార్టర్‌కి తీసుకెళ్ళాడు.

కానిస్టేబుల్ భార్య రాధికని సాదరంగా ఆహ్వానించింది.

ముద్దులొలికే రాధిక బిడ్డని తీసుకుని ముద్దాడింది.

"మీరు ఎప్పుడు తిని వచ్చారో, ఏంపాడో. ముందు భోంచేయండి" అంది ఆమె.

రాధిక ముఖమాటంతో వద్దంటున్నా, భోజనం చేసేవరకూ కానిస్టేబుల్ దంప తులు వూరుకోలేదు.

"మీ వారు నీళ్లస్వామి ఆశ్రమానికి ఎందుకు వెళ్ళారో తెల్సుకోవచ్చా? " భోజ నాలు అయిన తరువాత రాధికని అడిగాడు కానిస్టేబుల్. అతనిపేరు భాస్కర్.

"మాకు భక్తి ఎక్కువండీ. నీళ్లస్వామిని బాగా నమ్మాం. అయితే వాడు మమ్మల్ని బాగా అన్యాయం చేశాడు. కొత్తగా ఆశ్రమం కట్టించేటప్పుడు డబ్బు అప్పుగా ఇచ్చాం. మావారు ఆ అప్పు అడగటం కోసం వెళ్ళా రనుకుంటాను. ఇంటిదగ్గర మాకు కనీసం స్వామి ఆశ్రమానికి వెళ్తున్నట్లు కూడా చెప్ప లేదు" రాధిక అంది.

"మీ వారు డబ్బు ఇచ్చినట్లు ఆధారాలు ఏమైనా వున్నాయా? "

"ఏంలేవు సార్. వుంటే ప్రాబ్లం ఏం వుంటుంది? "

"ఆధారాలు కూడా లేకపోతే నీళ్ళస్వామి ఎందుకు భయపడతాడు? మీ వారిని ఏమైనా చేసే అవసరం ఎందుకు వుంటుంది? మీ డబ్బుకి ఎగనామం పెట్ట దలుచుకుంటే నీకు మేం బాకీలేం, బయటికి




దయచేయమంటాడు. మీరేం చేయగలరు? అంతకుమించి వార్ని ఏదో చేస్తారనీ, చేసారనీ భావించడం పొరపాటు"

రాధిక తడబడింది. తనమీద జరిగిన అత్యాచారం విషయం చెప్పదలచుకోలేదు. చివరికి అంది,

"అక్కడ ఘర్షణ జరిగి వుండొచ్చు. ఏది ఏమైనా మావారు ఆశ్రమానికి వచ్చినట్లు మాకు రూఢిగా తెల్సింది. చూసినవాళ్ళు చెప్పారు. అయితే ఆశ్రమంలో వాళ్ళు మావారు ఆశ్రమానికే రాలేదంటున్నారు. అందుకే వీళ్ళని అనుమానిస్తున్నాం" రాధిక అంది.

"మీరు ఎన్నిసార్లు ఆశ్రమానికి వెళ్ళారు? "

"చాలాసార్లు వెళ్ళాను"

"ఎందుకు వెళ్ళారు? "

"దేవుడని నమ్మాం. అందరూ దేవుళ్ళ దగ్గరకి ఎందుకు వెళ్తారో మేం కూడా అందుకే వెళ్ళాం"

"అయితే నీళ్ళస్వామి దేవుడని ఇప్పుడు నమ్మడం లేదా? "

"లేదు. వాడు అసలు దేవుడుకాదు. పచ్చి మోసగాడు"

"ఎందుకు మీరు అలాంటి అభిప్రాయానికి వచ్చారు? "

"ఆశ్రమంలో కొంతకాలం వున్నాను. అక్కడ పరిస్థితులు అన్నీ చూశాను. అది అసలు పవిత్రమైన స్థలమేకాదు. అక్కడ చాలా ఘోరాలు జరుగుతున్నాయి"

"నిజమా? " కానిస్టేబుల్ భాస్కర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును... అక్కడ అంతా మోసం. జనం దగ్గర డబ్బు కాజేయడానికి దేవుడని చెప్పి నాటకం ఆడుతున్నారు. వాడు నిజంగా దేవుడయితే ప్రజల దగ్గర డబ్బు తీసుకోవాల్సిన పనేమిటి? దేవుడు డబ్బేం చేసుకుంటాడు? తనకి కావాల్సినవి. తనే శక్తుల్ని వుపయోగించి సృష్టించుకోవచ్చు కదా"

రాధిక తర్కానికి భాస్కర్‌కి సంతోషం కలిగింది.

"ఇంత చక్కగా మాట్లాడుతున్నారు. మంచి పాయింట్లు అడుగుతున్నారు. మంచి విమర్శ చేస్తున్నారు. ఇంత బాగా ఆలోచించగలిగిన మీరు స్వామిని నమ్మడం ఏమిటండీ? ఎలా నమ్మారు? "

"ఆలోచన లేకుండా గుడ్డిగా నమ్మాం. కొంతమంది ముందే మమ్మల్ని హెచ్చరించారు. అయినా మేం చూస్తూ చూస్తూ వెళ్ళి బురదగుంటలో పడ్డాం. మావారు ఎక్కడున్నా ఆయనని అప్పగించేవరకూ వూరుకోను. అవసరమైతే సుప్రీంకోర్టుకైనా వెళ్తాను. ముఖ్యమంత్రి వద్దకైనా వెళ్తాను. ఎన్ని కష్టనష్టాలైనా ఎదుర్కొంటాను. మా వారిని చూపెట్టేవరకూ వెనుదిరగను" రాధిక మాటల్లో కృతనిశ్చయం తొణికిసలాడింది.

"మంచిదే. ఇప్పుడు మీకు మా పోలీసుల వలన న్యాయం జరుగుతుందని భావిస్తున్నారా? "

"న్యాయంకోసం పోరాడుతాను"

భాస్కర్ చిన్నగా నవ్వి అన్నాడు, "నీళ్ల స్వామి మీద యాక్షన్ తీసుకోవడం, కేసుపెట్టడం అంత తేలికైన విషయంకాదు. ఆయన తలుచుకుంటే ఎస్పీలని సైతం తెల్లవారేసరికి మార్పించగలడు. స్వామికి ఇవ్వాళ పైస్థాయిలో అంత పలుకుబడి వుంది. పెద్దస్థాయి నాయకులు, మంత్రులు సైతం నీళ్ళస్వామికి దాసోహం అంటున్నారు. అలాంటి వ్యక్తి ఆశ్రమాన్ని సోదాచేయడం సామాన్యమైన విషయంకాదు. నిజంగా ధైర్యంచేసి, ఆశ్రమాన్ని సోదాచేస్తే,

ఆ పనిచేసిన పోలీసాయన మరుసటిరోజుకి రాష్ట్రానికి సరిహద్దున వున్న ఏ జిల్లాకో ట్రాన్ఫర్రై, అక్కడ పనికిమాలిన పోస్టులో పడి కుక్కలా బతకాలి"

"డిఎస్పీ ఆశ్రమాన్ని సోదాచేసి వస్తానని నాకు ప్రామీస్ చేశారు సార్"

"చేస్తే మంచిదేకానీ, నువ్వు అలాంటి ఆశలు పెట్టుకోవద్దని నా సలహా. నీవు భక్తి కోసం స్వామి ఆశ్రమానికి వెళ్తే నీకు అక్కడ ఎలాంటి న్యాయం లభించిందో, ఇక్కడ అంతకంటే ఉన్నతమైన న్యాయం లభిస్తుందనుకోవద్దు"

"అదేమిటి సార్ అలా అంటున్నారు? "

"నిజం నిష్ఠూరంగా వుంటుంది. విన్నప్పుడు కొంచెం బాధగా కూడా వుంటుంది. నువ్వు నా చెల్లెలిలాంటిదానివని భావిస్తున్నాను. ఒక పోలీస్‌గా నేను నీతో ఈ మాటలు చెప్పకూడదు. నిజం మాట్లాడడం నా లక్షణం. నిజం వింటే మీరసలు తట్టుకోలేరు"

"ఏమిటి సార్ నిజం? "

"మా డిఎస్పీ ఆశ్రమాన్ని సోదా చేయడం వుత్తమాట! ఈరోజు ఆశ్రమానికి వెళ్ళి రావాలని నిన్నట్నించీ అంటున్నాడు. స్వామితో డిఎస్పీసార్‌కి ఏదో మాట్లాడవలసిన పని వుంది. అందుకు వెళ్ళాడు ఆశ్రమానికి. అంతే తప్ప సెర్చ్ చేయడానికి ఎంతమాత్రంకాదు. అక్కడ స్వామితో మీ విషయం కూడా చెపుతాడు. ఒకవేళ స్వామి మీవార్ని కిడ్నాప్ చేస్తే ఇంకా పకడ్బందీగా వేరేచోటుకి తరలించవచ్చన్నమాట"

కానిస్టేబుల్ మాటలకి రాధిక ఖిన్నురాలై పోయింది.

"మరి ఎలా సార్ ఇప్పుడు? నన్నేం చేయమంటారు? "

"స్వామి ఆగడాల్ని అరికట్టాలంటే ఒకవ్యక్తిగా మీరు ఎదుర్కోవడం చాలా కష్టం. అది జరిగే పనికూడాకాదు. స్వామి బండారం బట్టబయలుచేసి, వాడి దోపిడీ దౌర్జన్యాల్ని ఎదుర్కోవాలంటే చాలా కృషి చేయాలి. ఒక పెద్ద వుద్యమం జరగాలి. అంతకు మించిన మార్గంలేదు"

"ఇదంతా మీరు నాకు ఎందుకు చెపుతున్నారో అర్థం కావడంవలేదు. ఇప్పుడు నేను ఏంచేస్తే బాగుంటుంది? "

"హేతువాద సంఘం వారిని కలవండి. హేతువాద సంఘం అంటే మూఢనమ్మకాలకీ, మూఢవిశ్వాసాలకీ, దేవుళ్ళకీ, దెయ్యాలకీ వ్యతిరేకంగా పోరాడే సంఘం. దేశంలో వూరికి ఒకడుగా వెలిసిన దొంగ స్వాములు, దొంగసన్యాసులు, దొంగ బాబాలకి వ్యతిరేకంగా మా సంఘం పోరాడుతుంది. ఈ స్వాములు అనే వాళ్ళందరూ పనిలేకుండా జనం సొమ్ముని తేరగా తినమరిగినవాళ్ళు! మూఢనమ్మకాల్ని ప్రోత్సహించే వాళ్ళు"

"అయితే మీరు దేవుడు, దెయ్యంలాంటివి లేవంటారు? "

"అవును, అవి పరమ మూఢనమ్మకాలు. హేతువాద సంఘం జిల్లా ప్రెసిడెంట్ ఈ టౌన్‌లోనే వుంటాడు. మీరు వెళ్ళి ఆయన్ని కలుసుకోండి. ఫలితం వుంటుంది. నేను మీతో మాట్లాడిన విషయాలు ఇక్కడే, ఇప్పుడే మర్చిపోండి. నా వుద్యోగ ధర్మానికి విరుద్ధంగా కూడా మీకు కొన్ని విషయాలు చెప్పాను. వీళ్ళు నన్నేం చేయలేరనుకోండి"

"అంటే? "

"అంతా లంచగొండి వెధవలు కదా! నిజాయితీగా వుండేవాళ్ళంటే టెర్రర్. అందుకే నా జోలికి అసలు రారు. మిమ్మల్ని తీసుకువెళ్ళి ఆ సంఘం ప్రెసిడెంట్ కుమార్‌గారి ఆఫీసువద్ద వదిలిపెట్టి రావాలని వున్నా, వేరే పని వుండటం వలన రాలేకపోతున్నాను. అడ్రస్ ఇస్తాను. మీరు వెళ్ళి కలు




సుకోండి"

"అలాగే సార్"

"డిఎస్పీ వచ్చిన తరువాత దర్యాప్తు ఎంత వరకు వచ్చిందో ఎంక్వయిరీ చేయండి. నేను మీతో చెప్పిన విషయాలు నోరుజార వద్దు! నేను ఇలా అన్నట్లు తెలిస్తే ఫీలవుతాడు"

"మీరు నా మేలు కోరి చెప్పిన విషయాలు ఎవరితో అయినా ఎలా చెపుతాను? "

చీకటి పడుతున్న సమయానికి స్వామి ఆశ్రమాన్నించి డిఎస్పీ తిరిగి వచ్చాడు. అప్పటివరకూ రాధిక అక్కడే వుంది.

"మీవారి ఆచూకి కొంత దొరికిందమ్మా" రావడంతో డిఎస్పీ అన్నాడు.

ఆ మాటలకి రాధిక సంతోషంతో వూపిరి పీల్చుకుంది.

"మీ వారు పోయిన నెల 15వ తేదీ ఆశ్రమానికి వచ్చారటమ్మా! స్వామీజీని కూడా దర్శించుకున్నారట! స్వామీజీతో మాట్లాడారట. తరువాత వూరికి వెళ్తున్నామని చెప్పారట. వూరికి అని చెప్పి ఎక్కడికి వెళ్ళినట్లో అర్థంకావడంలేదు"

"ఇంతకుముందు ఆశ్రమానికి అసలు రాలేదని చెప్పారు సార్"

"ఎవరు చెప్పారు? అవన్నీ వుత్తమాటలు. మధ్యలో అనేక రకాల మాటలు పుడుతుంటాయి. నేను డైరెక్ట్‌గా స్వామీజీతోనే మాట్లాడాను. ఆయనే మీవారు వచ్చినట్లు చెప్పారు"

"మావారు కనపడకుండా పోవటానికీ, ఆశ్రమానికీ సంబంధం వుంటుందని నాకు అనిపిస్తోందిసార్"

"అలాంటి సంబంధం వుండే అవకాశం ఎంతమాత్రంలేదు. ఆశ్రమాన్ని ఎలాంటి పరిస్థితిలో కూడా వేలెత్తి చూపించలేం! అది పవిత్రమైన, ఉన్నతమైన స్థలం" చేతిని కళ్ళకి అద్దుకుంటూ అన్నాడు డిఎస్పీ

చేతికి ఆరోజు స్వామి బహూకరించిన బంగారు వుంగరం తళతళా మెరుస్తోంది.

స్వామి అనుమతి లభించడంతో డిఎస్పీ బృందం ఆశ్రమాన్ని సందర్శించింది. స్వామీజీ తమకి మంచి స్వాగత ఏర్పాట్లు చేశారు. తను రామక్రిష్ణ విషయం చెపుతుండగానే గాలిలోనించి వుంగరం తెప్పించి స్వామి తనకి బహూకరించాడు.

ఇది మహత్యం కలిగిన వుంగరం! ఇది ధరిస్తే అనుకున్న పనులు సత్వరం జరగడమేగాక ఎలాంటి అవరోధాలు ఎదురుకావు. ఎలాంటి పాపాలు చుట్టుకోవు. ఈ వుంగరం వలన తన జాతక చక్రం కూడా అద్భుతంగా మారిపోతుందని స్వామీజీ సెలవిచ్చాడు.

"మేం ఎంక్వయిరీ చేస్తాం, మీరు వెళ్ళి రండి" కొద్దిసేపు తరువాత డిఎస్పీ అన్నాడు.

"మావారు కనబడకుండాపోవటానికీ, ఆశ్రమానికీ ఖచ్చితంగా సంబంధం వుంది సార్. ఆశ్రమం వాళ్ళే మావార్ని ఏదోచేసి వుంటారు"

"మా ఎంక్వయిరీలో తేల్తుంది కదా? "

"మీరు ఎంక్వయిరీ చేసినా, చేయకపోయినా నిజం బైటపడి తీరుతుంది. అయితే కొంత ఆలస్యం జరగవచ్చు! దోషులు జైలు వూచలు లెక్కించేవరకూ విశ్రమించను. వాడు స్వామికాదు, కసాయి. ఆ కసాయితో జైలుకూడు తినిపించేవరకూ నా పంతం వీడను" రాధిక ఆగ్రహంగా, చాలెంజ్ చేసినట్లుగా అని డిఎస్పీ కార్యాలయంనించి విసురుగా వచ్చేసింది.

★ ★ ★

"ఏ. కుమార్, మెజీషియన్, ప్రెసిడెంట్,

హేతువాద సంఘం" అని రెండు చిన్న గదుల ఇంటిముందు బోర్డ్ వేలాడగట్టి ఉంది.

కానిస్టేబుల్ భాస్కర్ రాసి ఇచ్చిన అడ్రస్ స్లిప్ తీసుకుని వచ్చిన రాధిక తేలిక గానే అడ్రస్ గుర్తించగలిగింది.

ఆ ఇంటిని కుమార్ ఆఫీసుగా వుపయో గించుకుంటాడు. నివాసం వేరేచోట.

"రండి రండి రాధికగారూ... బాగు న్నారా? " లోనికి వస్తున్న రాధికనీ, ఆమె తమ్ముడ్నీ కుర్చీలో కూర్చున్న కుమార్ లేచి ఆహ్వానించాడు.

ఆశ్చర్యపోయింది రాధిక.

తమ మధ్య కనీస పరిచయంలేదు. ఇంతక్రితం తనని ఒక్కసారి కూడా చూడ లేదు. నూటికి నూరుపాళ్ళూ అపరిచిత వ్యక్తి తను.

తనపేరు ఎలా తెల్సింది? తనని ఎలా గుర్తించగలిగాడు?

"ఏమిటి అంతగా ఆశ్చర్యపోతున్నారు? మీపేరు ఎలా తెల్సిందనుకుంటున్నారా? "

"అదేకాదు, నా మనసులోని మాటని కూడా ఎలా గ్రహించగలిగారా అని? "

"మీ మనసులోని మాట ఏమిటి? ముఖం చూసి ఎవరి చరిత్ర అయినా చెప్ప గలను. మీవారు రామక్రిష్ణ. ఇంజినీర్. కొద్దిరోజులుగా కనిపించడంలేదు. దొంగ స్వామి ఆశ్రమానికి వచ్చాడు. మీ వారిని ఆశ్రమంవాళ్ళు ఏమైనా చేసి వుంటారని మీ భయం! సరిపోతుందా, ఇంకా మీ చరిత్ర చెప్పమంటారా? "

"వద్దండీ" అంది రాధిక ఆశ్చర్యం మీద ఆశ్చర్యంతో.

"నా దగ్గిర చాలా మహాత్యాలు వున్నా యండీ. ఎవరి జాతకాలు అయినా ఇట్టే చెప్పేయగలను. భూత వర్తమాన భవి ష్యత్ కాలాలు చెప్పగలను"

"మీ దగ్గిర మహాత్యాలు వుండటం ఏమి టండీ? "

"ఓం... హ్రీం... క్రీం... భ్రీం... ఫ్రీం..."

అంటూ కుమార్ చేయిపైకిలేపి గాలిలో తిప్పి బంగారు వుంగరం తెప్పించి అన్నాడు, "నేనంటే ఏమనుకుంటున్నారు? "

నీళ్లస్వామి అయితే భక్తులు అందరూ తన్మయంగా భజనలో లీనమైపోయిన తరు ణంలో చేతులు తిప్పి చిన్నచిన్న వస్తువులు సృష్టించేవాడు. ఎదురుగా భక్తులు వుంటే స్వామి వాళ్ళ దృష్టిని మళ్ళించేవాడు.

కుమార్ తనతో మాట్లాడుతూనే, తన దృష్టి మరల్చకుండానే తన సమక్షంలోనే వుంగరం తెప్పించాడు.

"తీసుకోండి వుంగరం" కుమార్ రాధికకి వుంగరం అందించాడు.

"నాకు ఎందుకండీ వుంగరం? " అంటూ రాధిక చూడటానికన్నట్లు వుంగరాన్ని చేతు ల్లోనికి తీసుకుంది.

"అమ్మ ఆశ! నిజంగా మీకు వుంగరం ఇస్తాను అనుకుంటున్నారా ఏమిటి? అది ఎంత లేదనుకున్నా నాలుగువేలు విలువ చేస్తుంది. అది మీకు ఎందుకు ఇస్తాను? నేను ఏ స్వామి అవతారమో వేస్తే, అప్పుడు భక్తులుగా విచ్చేసిన వారికి బహూకరించినా వుపయోగం వుంటుంది. వాళ్ళు అంతకు పదిరెట్లు సమర్పించుకుంటారు భక్తితో. మీకు ఎందుకు ఇస్తాను ఈ వుంగరం"

"నాకు మీ వుంగరం ఎందుకండీ? నేను చూద్దామని తీసుకున్నాను. అంతే తప్ప మీ వుంగరం తీసేసుకున్నానని భయపడి పోతున్నారేమిటి? అలా భయపడకండి. మీ వుంగరం వద్దని చెపుతున్నాను కదా" అంది రాధిక తను కూడా హాస్యంగా.

కుమార్ చురుకుగా వుండడంతోపాటు, సమయస్ఫూర్తిగానూ, చక్కగానూ మాట్లాడ





తాడని రాధిక గ్రహించింది.

"మీరు చేయి తిప్పి వుంగరం తెప్పించడం నాకు ఆశ్చర్యంగా వుందండీ"

"మహాత్మ్యాలు అంటే ఏమనుకున్నారు? మోసం చేయదలచుకుని స్వామి వేషం వేసుకుంటే జనం వేలంవెర్రిగా వస్తారు. భక్తి పేరుతో వచ్చినవాళ్ళ దగ్గిర డబ్బు గుంజి లక్షాధికారిని కావచ్చు వాళ్ళతో నిత్యం పూజలు అందుకోవచ్చు నీళ్ళస్వామి కొద్ది మహాత్మ్యాలే చేయగలడు. నేను అంతకు పదిరెట్లు మహాత్మ్యాలు చేయగలను. ఎందుకంటే నా వృత్తే మేజిక్ కాబట్టి. నేను మెజిషియన్‌ని కాబట్టి"

"వుంగరం ఎలా తెప్పించారో చెప్పండి సార్? "

"ఒక్క వుంగరం ఏమిటి? ఏదయినా గాలిలోనుంచీ, శూన్యంనుంచీ తెప్పించగలను. మీరు భక్తురాలు కదా. మీరు నిత్యం పూజలు చేసుకోవడానికి శివలింగం కావాలా? " అని కుమార్ గాలిలో చేయి తిప్పి శివలింగం తెప్పించాడు.

"ఇది గొప్ప మహిమలు కలిగిన శివలింగమండీ. ఈ శివలింగానికి పూజలు చేస్తే మీకు డబ్బే డబ్బు"

ఇందులో ఏదో హస్తలాఘవం వుందనే విషయం రాధికకి బోధపడింది.

"ఇవి మీరు ఎలా తెప్పించారు? "

"చెప్పమంటారా? ఇది కేవలం ట్రిక్! ఇందులో మహాత్మ్యం అనేది అణుమాత్రం కూడాలేదు. ఇందులోనేకాదు, ప్రపంచంలోనే మహాత్మ్యాలు అనేవిలేవు. నేను చేసింది గారడీవాడు చేసేపని. బజారుల్లోను, పేవ్‌మెంట్‌లమీదా గారడీలు చేసే వాళ్ళు ఎవరైనా ఇలాంటి వస్తువులు చాలా తేలికగా తెప్పించగలరు. స్వామివేషం వేసుకున్న దొంగవెధవలు ఎవరైనా ఇలా రుద్రాక్షలు, వుంగరాలు, లింగాలు తెప్పిస్తే మీలాంటివాళ్ళు మరో ఆలోచన లేకుండా వాడి కాళ్ళమీద సాష్టాంగ పడిపోయి వాడికి పూజలు చేస్తారు. ఇది కేవలం గారడీ తప్ప మరొకటికాదు"

"నీళ్ళస్వామి చేసేది కూడా గారడీయేనా? "

"ఒక్క నీళ్ళస్వామి ఏమిటి? ఏ స్వామి, ఏ బాబా అయినా చేసేది ఈ గారడీపనే! నీళ్ళస్వామి ప్రత్యేకత ఈ గారడేకాదు, అబద్ధాలు చెప్పడం, మోసం చేయడం దగ్గర్నించి చాలా ఘోరాలు కూడా చేస్తున్నాడని మా అనుమానం"

"ఇంతకుముందు నన్ను ఎప్పుడూ చూడలేదు. నన్ను ఎలా గుర్తించారు? నేను ఈ వూరు వచ్చిందే ఈరోజు"

"సింపుల్. గంటక్రితం కానిస్టేబుల్ భాస్కర్ ఫోన్ చేసి మీరు వస్తున్నట్లు చెప్పాడు. నా దగ్గరికి మీరు తప్ప కొత్తగా వచ్చేవాళ్ళు ఎవరూ లేరుగదా"

"మంచివాళ్ళేనండీ. బలే జోక్ చేశారు. భాస్కర్‌గారు విషయం మొత్తం చెప్పారా? "

"ఫోన్‌లో కొంత చెప్పాడు. అసలు ఏం జరిగిందో నాకు పెద్దగా అర్థం కాలేదండీ"

"జరిగిన విషయం చెపుతాను" రాధిక తనకి పిల్లలు లేకపోవడం దగ్గర్నించీ, ఆరోజు డీఎస్పీ దగ్గరకి వెళ్ళి వచ్చిన విషయం వరకూ వివరంగా చెప్పి, చివరికి అంది.

"మావారి ఆచూకీ తెలుసుకోవాలి. నీళ్ళస్వామి గాడి ఆగడాల్ని అరికట్టి, వాడ్ని కటకటాల వెనక్కి పంపించాలి"

"మా సంఘం అందుకే కృషి చేస్తోంది. మీవారి ఆచూకీ తెలుసుకోవాలంటే మీరు ఇక్కడ వుండిపోక తప్పదు. మీరు మా ఇంట్లో వుండండి. మీకు ఎలాంటి



అసౌకర్యం జరగదు. మీవూరు వెళ్ళిపోతే ఇక్కడ కథ నడవడం కష్టం. వాడికి వ్యతిరేకంగా పెద్దస్థాయిలోనే వుద్యమం జరగాలి"

"ముందు మావారి ఆచూకీ తెలుసుకోవాలండీ"

"ఎస్పీనీ కలిసి మాట్లాడదాం. జిల్లాలో పెద్ద పోలీస్ అధికారి ఆయనేకదా! ఆయన మంచివాడైతే మనకి న్యాయం జరగవచ్చు"

అందరూ ఆటోలో కుమార్ ఇంటికి వెళ్ళారు. అక్కడ ఒకామెను చూసి...,

"ఈమె సరస్వతి. స్వామి ఆశ్రమంనుంచి తప్పించుకువచ్చింది. నీళ్ళస్వామి బాధితురాలు" అని రాధికకు పరిచయం చేశాడు కుమార్.

పరస్పర పరిచయాలు అయ్యాయి.

"నన్ను పిచ్చికుక్క కరిచిందండీ. ఆ కుక్క కాటునుంచి ప్రస్తుతం కోలుకుంటున్నాను. ఆ కుక్క అలాగే వుంది. అది ఇంకా చాలా మందిని కరిచే ప్రమాదం వుంది. కరుస్తూనే వుంది కూడా. ఆ పిచ్చికుక్కని చంపెయ్యాలి"

"నాకు మీరు చెప్పేది అర్థం కావడంలేదు" అంది రాధిక.

"సరస్వతిమీద ఆశ్రమంలో దారుణంగా అత్యాచారం జరిగింది. ఆ పనిచేసింది సాక్షాత్తూ నీళ్ళస్వామే.ఆమెని ప్రాస్టిట్యూట్‌ని చేయాలని ప్రయత్నించగా, తప్పించుకుని వచ్చింది. ఇక్కడికి రావడం మాత్రం లేటయింది. వెంటనే ఇక్కడికి వచ్చి వున్నట్లయితే కేసుపెట్టి, వైద్యపరీక్షలు జరిపి కొంత అలజడి చేసి వుండేవాళ్ళం. అయితే తన మీద దౌర్జన్యం జరిగిన మూడునెలల తరువాత ఇప్పుడు వచ్చింది. కేసు ఎలా నిలుస్తుంది ఇప్పుడు? "

"అప్పుడు ఎందుకు రాలేదు? " రాధిక అడిగింది.

"నాకు ఇక్కడికి రావాలని తెలియదు. మొన్ననే ఒకరు మీ దగ్గరకి వెళ్లమని చెబితే వచ్చాను. స్వామి అంత తేలికగా మారడు. వాడి బుద్ధి మారదు. ఇప్పటికీ ఆశ్రమంలో అరాచకంగానే వుంటాడు. ఎవరో ఒకరి మీద మళ్లీ ఏదో ఘోరం చేయకపోడూ, మనకి దొరక్కాపోడు" అంది సరస్వతి.

సరస్వతి వైపు అలాగే చూస్తుండిపోయింది రాధిక.

సన్నగా, తెల్లగా వుంది. మనిషి చురుకుగా వుంది. చూడగానే ఆకర్షించే ముఖం. అందంగానే వుంది అనిపించింది రాధికకి.

తనమీద స్వామి చేసిన అత్యాచారం విషయం రాధిక భర్త రామక్రిష్ణకి మినహా మరెవరికీ చెప్పలేదు. సిగ్గో, బిడియమో, అవమానభారమో, మరొకటో ఆ విషయం ఇతరులు ఎవరికీ చెప్పదలుచుకోలేదు. చెప్పినందువలన ప్రయోజనం లేకపోగా తనని చిన్నచూపు చూస్తారని భావించింది.

సరస్వతి వయసులో తనకంటే చిన్న అయినా ఎంత ధైర్యంగా ప్రవర్తించింది.

తన మీద జరిగిన దౌర్జన్యాన్ని కుక్కకాటుతో పోల్చుకుంది. ఎంత చక్కటి పోలిక.

తనకి జరిగిన అవమానం గురించి అందరికీ నిర్భయంగా చెపుతోంది.

తన ప్రమేయం ఏమీ లేదు. తన బాధ్యతలేదు. తన నేరం లేదు. తనని నిందితురాలిగా లోకం ఎందుకు చూస్తుంది?

ఒకవేళ ఎవరైనా సంకుచిత వ్యక్తులు అలా చూసినా వాగినా తను పట్టించుకోకూడదు. శరీరానికి ఒక గాయం అయింది. ఇది కూడా గాయం లాంటిదే! ఆ గాయాన్ని మాన్పే ప్రయత్నం చేయాలి. అంతేకానీ అయ్యో గాయం అయిందే అని కుమిలిపోతూ విలపించడం ఏం సబబు అవుతుంది?





మన తప్పు లేకుండానే కుక్క కరిచింది. కుక్క కరిచిందే అని బాధపడుతూ కూర్చో వడం కంటే ఆ కుక్కని తరిమి కొట్టడం, చావగొట్టడం ఉత్తమమైన పని.

సరస్వతి వెలిబుచ్చిన ఆ అభిప్రాయాలకి ఆమె మీద రాధికకి మనసులో అభిమానం, గౌరవం కలిగింది.

మరుసటిరోజు రాధిక, సరస్వతి, కుమార్ మరో నలుగురు హేతువాద సంఘం సభ్యులు వెళ్లి ఎస్పీని కార్యాలయంలో కలిసారు.

ముందు రాధిక ఎస్పీకి తన భర్త కనపడని విషయం చెప్పింది.

"మీరు స్థానిక స్టేషన్‌లో రిపోర్ట్ చేశారా? " ఎస్పీ అడిగాడు.

"చేశాం సార్"

"ఎస్ఐ ఏమన్నాడు? "

"ఆయన మమ్మల్ని సరిగా రిసీవ్ చేసుకోలేదుసార్!" రాధిక జరిగిన విషయం చెప్పింది. డిఎస్పీని కలిసిన విషయం కూడా చెప్పింది.

ఎస్పీ ఎస్ఐకి ఫోన్ చేశాడు.

"రాధిక భర్తగారు ఆశ్రమానికి వచ్చిపోయారట సార్. ఆయన స్వామికి మంచి భక్తుడు కూడానట సార్! ఆశ్రమం వాళ్లు ఆయనని మాయం చేయడం అనేది ఉత్త మాట. వీళ్లు కేవలం స్వామి మీద అకారణ ద్వేషం పెంచుకుని నింద వేస్తున్నారు సార్!" ఎస్ఐ వినయంగా చెప్పాడు.

వైరలెస్ సెట్లో డిఎస్పీని లైన్‌లోనికి రమ్మని చెప్పి డిఎస్పీతో కూడా మాట్లాడాడు.

"వీళ్లు స్వామి మీద అపోహపడుతున్నారు సార్! అంతే తప్ప ఎలాంటి ఆధారాలు లేవు సార్!" అని డిఎస్పీ కూడా ఎస్ఐ చెప్పినట్లే అవే మాటల్ని వల్లించాడు.

"విన్నారుకదా మీరు? నేను కూడా స్వయంగా దర్యాప్తు జరుపుతాను. ఏ కొద్ది ఆధారం దొరికినా మా వాళ్లు అంత సులువుగా విడిచిపెట్టరు కేసు. అయినా ప్రయత్నిద్దాం" అన్నాడు ఎస్పీ.

తరువాత సరస్వతి తనమీద స్వామి జరిపిన దౌర్జన్యం విషయం కూడా చెప్పింది.

"ఇది జరిగి ఎన్ని నెలలు అవుతోంది? "

"దాదాపు మూడు నెలలు సార్!"

"అప్పటినుంచీ ఇంతవరకూ ఎందుకు రిపోర్ట్ చేయలేదు? "

"ఆశ్రమంనించి నేను తప్పించుకు పారిపోయి ఒకచోట తలదాచుకున్నాను. ఆశ్రమంవాళ్లు నా కోసం గాలిస్తున్నారేమో అని అక్కడినించి బయటకి రావడానికే భయపడ్డాను సార్! కొద్దిరోజులు ఆగిన తరువాత వీళ్లని కలుసుకోమని ఒక వ్యక్తి చెబితే మొన్న కలుసుకున్నాను"

"ఇప్పుడు మేం కేసు ఎలా పెట్టాలి? ఏం ఆధారాలు వున్నాయి? "

"నేను చెప్పింది అబద్ధం కాదు సార్! సత్య ప్రమాణకంగా చెపుతున్నాను సార్!"

"నీ మాటలు నేను నమ్ముతాను. చట్టాలూ, కోర్టులూ, న్యాయం ఇలాంటి మాటలు నమ్మవు. వాటికి కావాల్సింది ఆధారాలు"

"నేను అబద్ధం చెప్పడంలేదు. నేను చెప్పే మాటలు పూర్తి నిజంసార్! ముందు స్వామిని అరెస్టు చేయండి. మీరు స్వయంగా ఇంటరాగేట్ చేస్తే ఇంకా అనేక నిజాలు బయటపడతాయి సార్"

"కేసు బలంగా లేనప్పుడు అరెస్ట్ చేయడం సాధ్యంకాదు. పైగా అతను ప్రజల్లో పలుకుబడి గలిగిన మనిషి! స్వామిగా పూజలు అందుకుంటున్నాడు. ఆయనకి వేలమంది భక్తులు వున్నారు. లా



అండ్ ఆర్డర్ సమస్య వుత్పన్నమవుతుంది"

స్వామిని అరెస్ట్ చేయమని వీళ్లు చేసిన డిమాండ్‌ని ఎస్పీ ఏమాత్రం ఖాతరు చేయ లేదు. అరెస్టు చేసే ప్రసక్తే లేదని స్పష్టంగా తేల్చి చెప్పాడు.



హేతువాద సంఘం ఆధ్వర్యంలో నీళ్ల స్వామిని అరెస్ట్ చేయాలని డిమాండ్ చేస్తూ కలెక్టర్ కార్యాలయం ముందు నిరా హారదీక్ష ప్రారంభించారు.

"దొంగస్వామి ఆగడాల్ని అరికట్టండి. దొంగస్వామిని కఠినంగా శిక్షించండి" అనే పేరుతో కొన్ని వేల కరపత్రాలు ముద్రించి పంచుతున్నారు.

నిరాహార దీక్షలో రాధిక, సరస్వతి, ఇంకా ఇద్దరు హేతువాద సంఘం సభ్యులు పాల్గొ న్నారు.

స్వామిని అరెస్టు చేసేవరకూ దీక్ష విర మించకూడదనే కృత నిశ్చయంతో, గట్టి పట్టుదలతో వున్నారు.

దీక్ష నాలుగవ రోజుకి చేరుకుంది.

పత్రికలు కూడా శిబిరం గురించి వార్తలు ప్రచురిస్తున్నాయి.

స్వామి తన పీఠం కదిలిపోతున్నట్లుగా భావించాడు. తనకి వ్యతిరేకంగా ఒకనాడు తన పాదాలమీద పడిన భక్తులే శిబిరం నిర్వహిస్తున్నారు.

స్వామి తనకి అనుకూలురైన పోలీస్ అధికారుల్ని సంప్రదించాడు.

"ఎలాగైనా దీక్ష శిబిరం లేకుండా చేయాలి. నేను తలుచుకుంటే శిబిరాన్ని క్షణంలో నామంత్ర శక్తిద్వారా బూడిదగా మార్చగలను. కానీ అది మంచిపద్ధతికాదు. మంత్రశక్తిని చెడ్డ కార్యాలకి వినియోగించ కూడదు. మీరు ఆ శిబిరాన్ని లేపెయ్యండి. ఎంత డబ్బు ఖర్చు అయినా పర్లేదు" స్వామి పోలీస్ అధికారులకి నోట్లకట్టలు అందించాడు.

చాలామంది పోలీస్ అధికారులకి స్వామి గాడ్‌ఫాదర్. స్వామి ఆదేశాలు వాళ్లకి అందాయి.

అర్ధరాత్రి శిబిరం మీద పోలీసులు బంది పోటు దొంగలకి మల్లే దాడిచేశారు.

ఎదురు తిరిగినవాళ్లకీ, ప్రతిఘటించిన వాళ్లకీ నాలుగు వడ్డించి అందర్నీ వ్యానులో వేసుకుని స్టేషన్‌కి తీసుకుపోయారు.

శిబిరాన్ని నామరూపాల్లేకుండా ధ్వంసం చేశారు.

"మీరు ఆడవాళ్లు అందంగా వున్నారు. మంచి కుటుంబాలనించి వచ్చారు. ఎందుకు మీకు లేనిపోని దీక్షలు? మరో సారి ఇలాంటి శిబిరాలు నిర్వహించారంటే మక్కెలు విరక్కొడతాం జాగ్రత్త" అన్నారు ఆఫీసర్లు.

హేతువాదులకి సీరియస్ వార్నింగ్ ఇచ్చి మరుసటి రోజు మధ్యాహ్నం విడిచిపె ట్టారు. వాళ్లని అప్పటివరకూ లాకప్‌లో వుంచారు.

పోలీస్ యంత్రాంగాన్ని స్వామి ఎంతలా





ఆకట్టుకున్నాడో హేతువాదులకి మరింత స్పష్టంగా అర్థమైంది మరోసారి.

★ ★ ★

రాధిక వాళ్ల నాన్నకీ, ఆ ప్రాంతపు ఎంఎల్ఏకీ దూరపు బంధుత్వం వుంది.

ఎంఎల్ఏ ద్వారా పోలీస్ అధికారుల మీద వత్తిడి తీసుకువచ్చి అల్లుడి జాడ తెల్సుకుందామని ఆయన ప్రయత్నాలు మొదలు పెట్టాడు.

ఎంఎల్ఏని కలుసుకున్నాడు.

మరోవైపు సహోద్యోగులు కూడా రామక్రిష్ణ జాడకోసం ప్రయత్నాలు మొదలు పెట్టారు. వాళ్లు కూడా ఎంఎల్ఏని కలిశారు.

దూరం అయినా ఎంఎల్ఏ స్వయంగా వచ్చి ఎస్పీని కలుసుకుని విషయం చెప్పి కేసుని సీరియస్‌గా ఎంక్వయిరీ చేయమని కోరాడు.

ఎస్పీ రంగంలోనికి దిగాడు.

కొంతమంది సిబ్బందిని వెంటపెట్టుకుని స్వామిని దర్శించాలనే నెపంతో ఆశ్రమానికి వెళ్లాడు.

పోలీస్ కళ్లు అక్కడ అన్ని కోణాలూ క్షుణ్ణంగా గాలించాయి.

రామక్రిష్ణకి సంబంధించి ఎలాంటి ఆచూకీ లభించలేదు.

కానీ ఆశ్రమం మీద ఒక కన్నువేసి వుంచటం మంచిదనే ఉద్దేశం స్వామిని దర్శించిన ఎస్పీకి బలంగా అనిపించింది.

★ ★ ★

స్వామి అనాథ బాలికల ఆశ్రమ పాఠశాలలో శ్రీవాణి పదవ తరగతి చదువుతోంది. శ్రీవాణికి 17 సంవత్సరాల వయస్సు.

ఇప్పుడు శ్రీవాణి గర్భవతి.

గమనించి చూస్తే పొట్ట ఎత్తుగా వచ్చినట్లు కనబడుతోంది. శ్రీవాణి భయంతోనూ, అమాయకత్వంతోనూ ఎవరికీ ఏమీ చెప్పలేదు. కొందరు విద్యార్థులు పసిగట్టారు. ఆశ్రమం అంతా విషయం పాకిపోయింది. స్వామికి కూడా తెలిసింది. కొన్ని విషయాలు స్వామికి సెకన్లలోనే తెలిసిపోతాయి. స్వామి వెంటనే డాక్టర్ ఈశ్వరమ్మని పిలిపించాడు.

"విన్నారా? స్కూల్లో చదువుతున్న శ్రీవాణి గర్భవతి అయిందట. మీరు వెంటనే దానిని తీసివేయండి. ఇప్పుడు ఆశ్రమం మీద కొంతమందిలో వ్యతిరేకత పెరుగుతోంది. హేతువాదులు పనిగట్టుకుని ఆశ్రమానికి వ్యతిరేకంగా దుష్ప్రచారం చేస్తున్నారు. ఈ సంఘటన తెలిస్తే మనం ఆశ్రమం ఇక నడపలేం! ఏదయినా విషయం బయటకి పొక్కితే నిండా మునిగిపోతాం! మీరు వెంటనే ఆ అమ్మాయిని పిలిపించి టెస్ట్‌చేసి, అది ఏమిటో చూడండి!" స్వామి చెప్పాడు.

డాక్టర్ ఈశ్వరమ్మకి పెద్ద వయసు. భర్తా, పిల్లలూ ఎవరూలేరు. ఆర్థిక స్తోమతు లేక తల్లిదండ్రులు ఆమెకి వయసు మళ్లిన వ్యక్తితో వివాహం జరిపించారు. పెళ్లయిన పదిహేనేళ్లకి ఆయన తనువు చాలించాడు.

పిల్లలు లేరు. ఒంటరి అయింది. ఇతర బాదరబందీలేదు.

ఆమెకి వైద్యంకంటే ఆధ్యాత్మిక విషయాలు అంటేనే ఎక్కువ ఆసక్తి. రోజూ ఉదయం మూడు గంటలూ, సాయంత్రం మూడు గంటలూ పూజ, ధ్యానంలోనే నిమగ్నమవుతారు.

పూజ సమయంలో అన్ని రకాల స్తోత్రాలు, శ్లోకాలు, కీర్తనలు చదువుతూ అందరు దేవుళ్లనీ స్మరిస్తారు.

ఆమె పూజకోసమే ఆశ్రమంలో ప్రవేశించింది. ఆమెకి ఆ వాతావరణం, అక్కడ

పూజలు, వ్రతాలు, భజనలు బాగా నచ్చాయి.

వైద్యంలో ఆమె పెద్దగా నిష్ణాతురాలు కాదు. వైద్యం బాగా తెలియదు. ఆ రంగంలో తెలుసుకోవాలనే జిజ్ఞాస కూడా ఆమెకి లేదు.

మనిషిలో చురుకుదనం లేదు. మన్ను తిన్న పాముకి మల్లే వుంటుంది.

డాక్టర్ ఈశ్వరమ్మ శ్రీవాణిని తన క్లినిక్‌కి పిలిపించింది. ఆమె ఒక రూంని తన క్లినిక్‌గా వాడుతున్నారు.

శ్రీవాణికి పరీక్షలు జరిపి స్వామి వద్దకి వెళ్లింది ఈశ్వరమ్మ.

"ఆ అమ్మాయికి ఆరవ నెల జరుగుతోంది స్వామీ! ఇప్పుడు అబార్షన్ చేయకూడదు"

"ఎలాగో చేయాలి డాక్టరమ్మా! చేయకపోతే ఇబ్బందుల్లో పడతాం. కొన్ని సమస్యల్లో ఇప్పటికే ఇరుక్కొన్నాం. మళ్లీ మరో సమస్యని ఎక్కడ నెత్తికి ఎత్తుకుందాం"

"చాలా ప్రమాదం స్వామీ! పెద్ద ప్రాణానికి ముప్పు రావచ్చు"

"ఎలా డాక్టరమ్మా? ఈ రోజుల్లో ఆపరేషన్లు చేసి కడుపులో వున్న బిడ్డల్ని తీస్తున్నారు. నవమాసాల బిడ్డని పొట్టలోనించి కోసి తీస్తున్నారు. ఇంత చిన్న విషయానికి సందేహిస్తున్నారేమిటి? "

"కాదుస్వామీ! పెద్ద ప్రాణానికి పెద్ద ప్రమాదం"

"అవన్నీ ఎందుకు? శ్రీవాణికి గర్భం లేకుండా చేయండి. మరో ఆలోచన పెట్టుకోవద్దు. లేకపోతే అసలు ఆశ్రమమే చిక్కుల్లో పడుతుంది" స్వామి అభ్యర్థించినట్లుగా ఆజ్ఞాపించాడు.

అయిష్టంగానే స్వామి ఆదేశానుసారం శ్రీవాణికి అబార్షన్ చేసింది డాక్టర్ ఈశ్వరమ్మ. శ్రీవాణి బాధ చెప్పనలవికాదు. విపరీతమైన రక్తస్రావం.

రెండు రోజులు తీవ్రంగా రక్తస్రావం జరిగి, భయంకరంగా బాధపడి, హఠాత్తుగా శ్రీవాణి కన్నుమూసింది.

స్వామికి ముచ్చెమటలు పోసాయి.

ఒకవైపు ఆశ్రమానికి వ్యతిరేకంగా ప్రచారం సాగుతోంది.

వాళ్లు ఆందోళన చేస్తున్నారు. ఉద్యమం జరుగుతోంది.

ఇంతలో శ్రీవాణి మృతి. విషయం బయటకి పొక్కితే తనకి కటకటాలు ప్రాప్తించక తప్పదు.

ఇప్పటికే ఆశ్రమంలో మూడు మరణాలు! మూడూ అసహజ మరణాలే! అదీ ఏడాది వ్యవధిలోనే.

ఇప్పుడు ఎవరైనా పసిగడితే ప్రమాదం.

ఆశ్రమాన్ని తాత్కాలికంగా మూసివెయ్యడం మంచిది.

కొద్ది రోజుల ఆగితే ఎవరికీ అనుమానాలు వుండవు. విషయం మాసిపోతుంది. పూర్తిగా విషయం మరుగునపడిపోయినప్పుడు ఆశ్రమాన్ని తెరుచుకోవచ్చు ఇప్పటికిప్పుడు మునిగిపోయిందేమీలేదు.

స్వామి మరో ఆలోచనలేకుండా ఆశ్రమాన్ని మూతవేస్తున్నట్లు ప్రకటించాడు.

పాస్ కలిగిన భక్తులకి కూడా తాత్కాలికంగా ప్రవేశం లేకుండా చేశారు.

★ ★ ★

కుమార్ పరిచయంతోనూ వ్యక్తిగత అనుభవాలతోనూ రాధికలో హేతువాద భావాలు పెరిగాయి.

ప్రశ్నించడం నేర్చుకుని తర్కబద్ధంగా ఆలోచిస్తోంది.

మూఢభావాల్ని చీరేస్తూ మాట్లాడు




తోంది. రాధిక చైతన్యానికి మూడు దశాబ్దాలుగా హేతువాద ఉద్యమంలో వున్న కుమార్ నివ్వెరపోయాడు.

స్వామి చేసినవి అన్నీ గారడీ విద్యలే అని రాధికకి స్పష్టంగా అర్థమైంది. కానీ అవి ఎలా చేశాడో తెలియలేదు. ఆ విషయమే కుమార్‌ని అడిగింది.

"నీళ్లస్వామి చేసిన మహిమలు చేయండి. అవి ఎలా చేశారో తెల్సుకుందామని నాకు ఇంట్రెస్ట్‌గా వుంది"

"వాడు చేసిన మహిమలు చెప్పండి. అవి చేసి మీకు చూపెడతాను" అన్నాడు కుమార్.

స్వామి దగ్గరకి మొదటిసారి వెళ్లినప్పుడు తన చేతిలోనూ, కొందరి చీరెల్లోనూ తీర్థం పోసి దానిని మండించిన విషయం చెప్పింది.

"ఇంతేనా? చేస్తాను చూడండి"

కుమార్ రూంలోనికి వెళ్లి కొద్దిసేపు తరువాత ఒక సీసాలో తీర్థం తెచ్చి అక్కడే వున్న సంఘం సభ్యుడి చేతిలో ఆ తీర్థం పోసి అగ్గిపుల్లగీసి వెలిగించాడు.

దాదాపు రెండు నిముషాలు ఆమంట వెలిగింది. అతని చేతికి ఏమీ కాలేదు.

"అవును .. ఆ మాయావిచేసింది కూడా ఈ ట్రిక్కే! దీనిని ఎలా చేశారు?"

"ఆరుపాళ్ల కార్బన్ డైసల్ఫైడ్‌నూ, నాలుగు పాళ్ల కార్బన్ టెట్రా క్లోరైడ్‌నూ కలిపి తీసుకొచ్చాను. ఆ రసాయనాల ద్రావణమే ఈ తీర్థం. ఈ తీర్థాన్ని అరచేతిలో కానీ, గుడ్డమీద కానీ వేసి మండించవచ్చు ఎలాంటి సెగ తగలదు. దీనిని కూల్ ఫైర్ అంటారు"

"బావుంది. ఇది చెప్పండి. దేవుళ్లు మాట్లాడతారని చెప్పి మూడు రకాల బొమ్మలు పెట్టాడు. అవి మండిపోయాయి"

అని రాధిక తాము పూజ చేసిన విధానం మొత్తం వివరించింది.

పాత లుంగీ తీసుకున్నాడు కుమార్. దానిని బొమ్మగా మడత పెట్టాడు.

గదిలోకి వెళ్లి గోలీకాయ పరిమాణం కలిగిన పల్చటి తడిబట్ట తెచ్చాడు. మడత పెట్టిన లుంగీ మధ్యలో ఆ తడిబట్ట పెట్టాడు.

"చూడండి. కొద్దిసేపట్లో ఆ లుంగీ తగలబడుతుంది. తడి బట్టలో నేను తెచ్చి లుంగీలో పెట్టింది పచ్చభాస్వరం. తడిబట్ట కొద్దిసేపట్లో ఆరిపోతుంది. తరువాత గాలిలో వున్న ఆక్సిజన్‌ని పచ్చ భాస్వరం గ్రహించి దానంతట అదే మండిపోతుంది. గడ్డితో, దూదితో, గుడ్డలతో బొమ్మలు చేసి, వాటిలో తడిబట్టలో భాస్వరం వుంచితే కొద్దిసేపటికి అవే మండిపోతాయి"

కుమార్ వివరణతో రాధిక మనసు సంతోషంతో తేలికపడింది.

వాళ్ళు అలా చూస్తూ వుండగానే గుడ్డలో నించి సన్నగా పొగ రావడం ప్రారంభమై కొద్దిసేపట్లోనే మంట వచ్చి గుడ్డ తగలబడి పోయింది.

"అన్నీ చెప్పారు కానీ, గాలిలోనించి వస్తువులు ఎలా తెప్పించగలిగారండీ?"

"గాలిలోనించి కాదు. పొడవుగా వున్న లాల్చీ చేతులలో అవసరమైనవి ముందుగానే దాచి పెట్టుకుని సమయం వచ్చినప్పుడు చేతిని కిందికి వంచితే అవి చక్కగా అరచేతిలోనికి వస్తాయి. ఇలా చూడండి" కుమార్ తన చొక్కా చేతిలోపల అమర్చిన చిన్న జేబు చూపెట్టి, అందులో ఉంగరం పెట్టి, గాలిలో చేయితిప్పి ఉంగరాన్ని తెప్పించాడు.

"ఇంకోరకంగా కూడా తెప్పించవచ్చు. కుడిచేతి బొటనవేలికీ, చూపుడువేలికీ మధ్య చిన్న శివలింగాన్నో, రుద్రాక్షనో, ఉంగరాన్నో పెట్టుకుని జనాన్ని దీవిస్తున్నట్లు చేయితిప్పి

అరచేతిలోనికి రప్పించవచ్చు"

కుమార్ ఆ ట్రిక్ కూడా చేసి చూపెట్టాడు.

"బాగుందండీ" అంది రాధిక.

"పిసి సర్కార్ అనీ, మా మెజీషియన్లకి గురువులాటి వ్యక్తి, మేజిక్ చేసి దేవుళ్ళుగా ప్రచారం పొందుతున్న దొంగస్వాములకి ఒక సవాల్ విసిరాడు. అరచేతిలో పట్టే వస్తువులు గాకుండా గాలిలో చేతులు తిప్పి గుమ్మడికాయనో, కనీసం బత్తాయికాయ అయినా తెప్పించమని సవాల్ విసిరాడు. ఆ ప్రశ్నకి ఒక్క స్వామినించి సమాధానం లేదు. గుమ్మడికాయ అంటే గాలిలో చేయి తిప్పి నటించి తెప్పించడం సాధ్యం కాదు గదా"

"అవును. స్వామి కూడా మెళ్ళో హారానికి తగిలించుకునే పరిమాణం కలిగిన చిన్న చిన్న శివలింగాల్నో, తాయెత్తుల్నో తెప్పించేవాడు" అంది రాధిక.

"అన్నా... అన్నా... నీళ్ళస్వామి ఆశ్రమాన్ని మూత వేశాడంటన్నా?" వగరుస్తూ హేతువాద సంఘం కుర్రాడు లోనికి వచ్చి చెప్పాడు.

"పీడా వదిలిపోయింది" అన్నాడు కుమార్.

"ఎందుకు మూసేశాడు" రాధిక అతన్ని అడిగింది.

"మూసివేసినట్లు తెలిసిందక్కా. ఎందుకు మూత వేశారో కారణం తెలియదు. మళ్ళీ ప్రకటించేవరకూ ఎవరికీ ప్రవేశం లేదట. పాస్ల్ని కూడా రద్దు చేశారట" ఆ కుర్రాడు చెప్పాడు.

"కారణం ఏమై వుంటుంది?" కుమార్ ఆశ్చర్యంగా రాధికని అడిగాడు.

"స్వామి ఆశ్రమాన్ని అంత సులువుగా మూసి వేసేరకం కాదు. ఏదో పెద్ద సంఘటనే జరిగివుంటుంది. అందుకే తాత్కాలికంగా మూసివుండవచ్చు" అంది రాధిక కారణాల్ని ఊహిస్తూ.

"ఏదో తెలియకుండా పోతుందా?" కుమార్ అన్నాడు.

"ప్రస్తుతానికి కార్యక్రమాలు పెద్దగా వుండవుకదా. నేను మా వూరు వెళ్తాను. వాడు ఆశ్రమం తిరిగి తెరిస్తే మళ్ళీ వస్తాను. అక్కడ అన్నీ పాపాలే జరుగుతున్నాయి. మనం ఎలాగైనా ఏదో ఒక ఆధారం సంపాదించి వాడ్ని జైల్లోనికి పంపించాలి. వాడికి శిక్షపడి కటకటాలు లెక్కిస్తేనే నా మనసుకి శాంతీ, విశ్రాంతీ" అంది రాధిక.

ప్రయాణమై బిడ్డని తీసుకుని వూరికి వచ్చింది రాధిక.

రామక్రిష్ణ కోసం రాధిక తల్లిదండ్రులు కూడా గాలిస్తూనే వున్నారు. వాళ్ళు కూడా వచ్చి, కూతురు దగ్గర అదే వూళ్ళో వుంటున్నారు.



కొద్దిరోజులు గడచిన తరువాత కూమార్ దగ్గరనించి రాధికకి ఉత్తరం

వచ్చింది.

"రాధికగారూ...

వచ్చేనెల ఆరవతేదీ నీళ్ళస్వామి ఆశ్రమం పునఃప్రారంభిస్తున్నాడు. ప్రారంభానికి కేంద్రమంత్రి శంకరయ్య, కొందరు రాష్ట్ర మంత్రులు వస్తున్నారు. ఆ రోజు భారీ ఎత్తున నిరసన ప్రదర్శన నిర్వహిస్తే బాగుంటుందని హేతువాద సంఘం ఆలోచన. తప్పకుండా రండి"

రాధిక వాళ్ళ నాన్నకి విషయం చెప్పింది.

"పసిబిడ్డని తీసుకుని నువ్వెందుకమ్మా అంత దూరం? అల్లుడుగారు కనపడకుండా పోవడానికీ, ఆశ్రమానికీ సంబంధం వుండ దమ్మా. ఎస్పీగారు కూడా స్వయంగా దర్యాప్తు చేశారుకదా. నువ్వెళ్లి అక్కడ చేసేదేం వుంది? "

"స్వామి పెద్ద మోసగాడు నాన్నా! మీ అల్లుడి అదృశ్యానికీ, స్వామికీ ఖచ్చితంగా సంబంధం వుంది. వాడిచేత జైలు కూడు తినిపించాలి. మీరు నన్ను అభ్యంతర పెట్టకండి" అంది రాధిక దృఢంగా.

ఆయన మాట్లాడలేదు.

రాధిక కొడుకుని తల్లి వద్ద వదిలి ప్రయాణమై ఆశ్రమ ప్రారంభానికి రెండు రోజుల ముందు వచ్చింది.

ఒకప్పుడైతే ఆశ్రమ ప్రారంభం జరిగితే ఆ కార్యక్రమానికి ఉత్సాహంగా వచ్చేది. ఇప్పుడు అందుకు వ్యతిరేకంగా అంతకంటే ఎక్కువ ఉత్సాహంతో, పట్టుదలతో ఒక బాధ్యతగా భావించి వచ్చింది.

కుమార్, రాధిక, ఇతర హేతువాద సంఘం సభ్యులు తమకు తెల్సినవాళ్లనీ, పరిచయస్తుల్నీ కలుసుకున్నారు.

ఎక్కువ జనసమీకరణ చేసి భారీ ఎత్తున భారీస్థాయిలో నిరసన ప్రదర్శన నిర్వహించాలని నిర్ణయించారు.

హేతువాదంమీద అభిరుచి లేకపోయినా, స్వామివలన మోసపోయిన వాళ్ళు చాలా మంది నిరసన ప్రదర్శనలో పాల్గొనడానికి సంసిద్ధత వ్యక్తపరిచారు.

కేంద్రమంత్రి, రాష్ట్రమంత్రులు, అధికార్లు, అనధికార్లు, వ్యాపారవేత్తలు, ప్రముఖులు, పారిశ్రామికవేత్తలు తదితరులు ప్రారంభానికి వచ్చారు.

చాలా చాలా పెద్ద స్థాయిలో స్వాగత ఏర్పాట్లు, కార్యక్రమ ఏర్పాట్లు జరిగాయి.

పెద్ద సంఖ్యలో భక్తులు కూడా విచ్చేశారు. అడుగడుగుకీ పోలీసులు వున్నారు. ఆశ్రమ ప్రవేశద్వారం ఎదురుగా ప్లేకార్డులు పట్టి, స్వామికి వ్యతిరేకంగా నినాదాలు ఇస్తూ నిరసన తెలుపుతున్నారు.

నిరసనకారులు గణనీయ సంఖ్యలోనే వున్నారు. వాళ్ళ నినాదాలు, అరుపులతో ఆ ప్రాంతం హోరెత్తిపోతోంది.

అలా వాళ్ళ నినాదాలు ఒక గంటసేపు కొనసాగాయి.

ఇంతలో అక్కడికి నాలుగు పోలీస్‌వ్యాన్లు దూసుకువచ్చాయి. పోలీసులు బూట్లు టక టక లాడించుకుంటూ వ్యానుల్లోనించి దూకారు.

వాళ్ళని చూసి హేతువాదుల నినాదాలు ఉధృతమయ్యాయి.

ఆ నిరసనకారులమీద పోలీసులు పడి స్త్రీ పురుష విచక్షణ లేకుండా చిత్తం వచ్చినట్లు కొట్టి, బలవంతంగా వ్యానుల్లోకి వాళ్ళని ఈడ్చి స్టేషన్‌కి తీసుకుపోయారు.

ఎలాంటి ఆటంకం లేకుండా స్వామి ఆశ్రమ పునఃప్రారంభం విజయవంతంగా జరిగింది.

సభ రాజకీయవేత్తలు, స్వామి పరస్పర పొగడ్తలతో, అభినందనలతో సాగింది.

ప్రముఖులైన ఆహూతులు ప్రేమానంద

స్వామి పాదాలమీద సాష్టాంగపడి, దణ్ణాలు పెట్టుకుని ఆశీస్సులు పొందారు.

వ్యానుల్లో కుక్కి తీసుకుపోయిన ఆందోళనకారుల్ని పోలీసులు ఒకరోజు నిర్బంధించి వాళ్ళ అడ్రసులు తీసుకుని విడిచిపెట్టారు.



"స్వామి ధాటికి మనం ఏం సరిపోతామండీ? ఆశ్రమాన్ని ప్రారంభించే కార్యక్రమానికి ఎంతమంది జనం వచ్చారు? ఎన్ని కార్లు? ఎంత హంగామా? ఎంత పోలీస్ బందోబస్తు? అసలు ప్రభుత్వ యంత్రాంగమే వాడి చేతిలో వున్నట్లు వుంది? వాణ్ణి మనం ఎదుర్కోగలమా? ఇది జరిగేపని అని నాకు అనిపించడం లేదు" పోలీస్‌స్టేషన్‌నించి ఇంటికి వచ్చిన తరువాత కుమార్ అన్నాడు.

రాధిక, సరస్వతి వున్నారు. కుమార్ భార్య పనిచేసుకుంటూ అక్కడో ముక్క, అక్కడో ముక్క చెవిలో వేసుకుంటోంది.

కుమార్ మాటలకి రాధిక విస్మయంతో అంది. "హేతువాద సంఘం జిల్లా అధ్యక్షులు మీరు. అంత నిరాశగా మాట్లాడుతున్నారేమిటి? "

"నిరాశ కాదు, ఉన్నమాట ఇది! వాడ్ని ఎదుర్కోవడం అంటే ఎలుకపోయి కొండని ఢీకొన్నట్లే కదండీ? "

"ఏం కొండ అనుకుంటున్నారు? కాగితపు కొండ అది. ఎలుకపోయి ఆ కాగితపు అడుగుభాగం కొరికితే కొండ కుప్పకూలిపోతుంది. వెనుకడుగు వేస్తే ఏ పనీ జరగదు. కొంత ఆలస్యం జరగవచ్చేమో కానీ అన్యాయం అపజయం పాలుకాక తప్పదూ, స్వామి కటకటాల వెనక్కి నడవకా తప్పదు"

"ఏమోనండీ, నాకు నమ్మకం కుదరడం లేదు. జనం ఎంత మూఢనమ్మకాలతో వున్నారూ, ఎంత అమాయకత్వంతో వున్నారూ. అసలు వాడ్ని ఎలా నమ్ముతున్నారో నాకు అంతుబట్టడంలేదు"

"బాగుంది మీ హేతువాదం! జనంలో మూఢనమ్మకాలు లేకపోతే ఇక మన సంఘం ఎందుకండీ? మూఢవిశ్వాసాల్ని పారదోలటానికే కదా మన సంఘం వుంది. జనం అంధ విశ్వాసాలతో వుండబట్టే దొంగ స్వాములు, సన్యాసులు, బాబాలు వూరికి ఒకరు వెలిశారు. నిన్న మొన్నటివరకూ నేను మూఢభక్తిలో మునిగిపోలేదా? నాకు కొద్దిగా హేతువాదభావాలు వచ్చాయంటే అది మీ స్నేహం కారణంగానే! నాకు ఇంకా పూర్తిగా శాస్త్రీయ దృక్పథం అలవడిందనుకోవడంలేదు. నాకూ ఇంకా కొన్ని నమ్మకాలు వున్నాయనిపిస్తోంది. అంత తేలిగ్గా పోవు కదా. ఏమైనా ఈ స్వామికి శిక్ష పడేవరకూ మన ఉద్యమం విరమించకూడదు" రాధిక అంది.

ఆమె వాగ్ధాటికి కుమార్ సిగ్గుపడిపోయాడు.

కొద్దినెలల క్రితమే హేతువాద సంఘంలోనికి వచ్చిన రాధిక ఎంత సూటిగా మాట్లాడింది. తను ఎంత అనాలోచితంగా మాట్లాడాడు. నిజానికి తనే మూఢభావాల్లో వున్నాడు"

"సారీ... ఏదో నిరాశతో మాట్లాడాను. మన ప్రయత్నం మనం చేద్దాం. వాడికి వ్యతిరేకంగా ప్రజల్లో ప్రచారం చేద్దాం" అన్నాడు కుమార్.

నీళ్ళస్వామికి వ్యతిరేకంగా పోరాడాలంటే తమ సంఘం శక్తి ఒకటే చాలదనీ, భావ సారూప్యం కలిగిన ఇతర సంఘాల సహకారం కూడా అవసరమని భావించారు.

జిల్లాలో వున్న పౌరహక్కుల సంఘం, రైతుకూలీ సంఘం, విద్యార్థి యువజనసంఘాల బాధ్యుల్ని వెళ్ళి కలుసుకున్నారు.




"ఒకే! నీళ్ళస్వామిమీద పోరాడటానికి మాకేం అభ్యంతరం లేదు. అందరం కలిసి ఆ దొంగ వెధవకి వ్యతిరేకంగా పనిచేద్దాం" అన్నారు వాళ్ళు.

అన్ని సంఘాల ముఖ్యులతో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు.

సమావేశ చర్చల పర్యవసానంగా ఒక సమితి ఆవిర్భవించింది.

ఆ సమితికి కన్వీనర్‌గా రాధికని ఎన్నుకున్నారు.

"నేనెందుకండీ? నాకేం అనుభవం వుంది? " అంది రాధిక.

"మీరు వుండాల్సిందే. మీరు గట్టి పట్టుదలతో వున్నారు. మీరు కన్వీనర్‌గా వుంటేనే న్యాయం జరుగుతుంది"

లందరూ రాధిక వుండాల్సిందేనంటూ పట్టుబట్టారు.

దశలవారీగా ఆందోళన కార్యక్రమాలు నిర్వహించాలని తీర్మానించారు.

గ్రామాల్లో తిరిగి ప్రచారం చేయడం, ప్రభుత్వ కార్యాలయాల ముందు ఆందోళన చేయడం, ఘెరావ్‌లు చేయడం, నిరహారదీక్షలకి పూనుకోవడం, ఊరేగింపులు తీయడం, బంద్‌లు పాటించడం, స్వామి బాధితుల్ని ప్రభుత్వ అధికారుల వద్దకి తీసుకుపోయి న్యాయం చేయమని కోరడం ఇలా వీలైన అన్నిరకాల కార్యక్రమాల్ని సమితి రూపొందించింది.

నిద్రాహారాలు మాని రాధిక సమితి కార్యకలాపాల్లో పాల్గొంటోంది.

సమితిలో వున్న ఇతర సంఘాలవాళ్ళు బాగా సహకరిస్తున్నారు.

అనేక సందర్భాలలో రాధిక ఎస్పీనీ, ఇతర పోలీస్ అధికారుల్నీ, రెవిన్యూ అధికారుల్నీ సంఘ సభ్యులతో వెళ్ళి కలుసుకుంటోంది.

రామక్రిష్ణ ఇక కనిపించడనీ, ఆశ్రమం వాళ్ళే అతనిని అదృశ్యం చేశారనే నిశ్చయానికి వచ్చింది రాధిక.

ఆమె జిల్లావ్యాప్తంగా అందరికీ పరిచయమైంది. పత్రికలు ఆమెని గూర్చి విశేషంగా రాస్తున్నాయి.

రాధిక పేరు వింటేనే స్వామికి హడలెత్తిపోతోంది. గజగజా వణికిపోతున్నాడు. అయినా ఆశ్రమానికి సుదూరప్రాంతాల నించి వస్తున్న భక్తుల సంఖ్య మాత్రం పెరిగింది. వాళ్ళు సాధారణభక్తులు కారు. ఆర్థికంగా ఉన్నతస్థాయిలో వున్నవాళ్ళూ, బాగా ధనికులూ. ప్రేమానందస్వామివారి ఆశ్రమం చూసి తరించిపోతున్నారు.



"రాధికగారూ... మీకు రిజిస్టర్ లెటరండీ" కుమార్ చెప్పాడు.

లోపలనించి రాధిక వచ్చి, "ఎక్కడ్నించి వచ్చి వుంటుందీ? " అంటూ సంతకం చేసి తీసుకుంది.

కవర్ చింపి లోపల వున్న కాగితం

తీస్తూ "పెద్ద ఉత్తరమే! ఎవరు రాసి వుంటారూ? " అనుకుంది.

అక్షరాలు వంకరటింకరగా, సరిగా చదువురానివాళ్ళో, చిన్నపిల్లలో రాసినట్లు వుంది.

"శ్రీమతి రాధికగారికి...

సౌజన్య అనేక నమస్కారాలు తెలుపుతూ వ్రాయునది.

నా పేరు చదవగానే వెంటనే నేనెవరో మీకు గుర్తు రాకపోవచ్చు. ఆశ్రమంలో స్వామి భక్తురాల్ని. ఇప్పుడు మీకు గుర్తు వచ్చివుంటుందనుకుంటున్నాను.

ఆశ్రమంనించి రహస్యంగా మీకు ఈ ఉత్తరం రాసి, రహస్యంగా పోస్ట్ చేస్తున్నాను.

నేను చాలా పాపాత్మురాలిని. చాలా పాపాలు చేశాను. నా పాపాలకి పరిష్కారంగా నేను ఈ లోకంనించి శాశ్వతంగా వైదొలుగుతున్నాను. మీకు ఈ ఉత్తరం చేరే సమయానికి నేను ఈ లోకంనించి నిష్క్రమించి వుంటాను.

నేను డాక్టర్ భార్యని అనీ, నాకు క్యాన్సర్ జబ్బుఅనీ మీకు చెప్పాను. మీరు నిజమే కాబోలు అని నమ్మారు. మీకే కాదు, ఆశ్రమానికి వచ్చే అందరు భక్తులకీ అలాగే చెప్పి నమ్మించాను. అది పూర్తి కట్టుకథ.

స్వామి నాటకంలో కీలుబొమ్మని నేను. నాకు ఇస్తున్న జీతానికి గడ్డి తిని, డబ్బు కోసం వాడు చెప్పమన్నట్లు చెప్పాను. ఆడమన్నట్లు ఆడాను.

మీరు ఆశ్రమానికి వచ్చిన మొదట్లో మీ బంగారునగ నేనే దొంగిలించాను. మీరు బాత్‌రూంలోనికి వెళ్లినప్పుడు నేను గదిలోనికి వచ్చి దొంగతనానికి పాల్పడ్డాను. స్వామి అది కనుక్కున్నాడు.

నా దగ్గరనించి ఆ నగ తీసుకుని మరుసటిరోజు గాలిలోనించి తెప్పించినట్లు నాటకం ఆడి నగ మీకు ఇచ్చాడు. గాలిలోనించి తెప్పించడం అబద్ధం. చొక్కా చేతికి వున్న జేబులోనే ఆ గొలుసుపెట్టి, ఎక్కడ్నించో తెప్పించినట్లుగా కనికట్టు చేశాడు.

మీవారు పనిచేసే ఆఫీసునించి వచ్చిన మా వూరి గోపాలం చెప్పినట్లు నేను దొంగ సుబ్బాయినే. నా గత చరిత్ర చాలా హీనమైనదీ, నీచమైనది.

నా గతజీవితంకంటే ప్రస్తుత జీవితం ఇంకా నీచమైనది.

నేను చేసిన పాపాలకి శిక్షగానే ఆశ్రమంలో వున్న నా కూతురు బలైంది. అభం శుభం తెలియని నా కూతురిమీద ఆశ్రమంలో చాలాసార్లు అత్యాచారాలు జరిగాయి.

ఆశ్రమానికి వచ్చిన ఎందరో ఆడపిల్లలకి నేను చేసిన అన్యాయం, దారుణాలవలన వాళ్ళ ఉసురు తగిలి నా బిడ్డ బలైంది.

ఆశ్రమానికి వస్తున్న గోవిందశెట్టికి మనిషి అవసరమనీ, భార్య లేదనీ, కోరినంత డబ్బు ఇస్తాను రమ్మని అడిగితే స్వామి అనుమతితో అతని వెంట మైసూరు వెళ్ళాను. వాళ్ళు బాగా ధనికులు, నన్ను ఆదరంగానే చూశారు.

నేను చేసిన పొరపాటు నా బిడ్డని ఆశ్రమంలో వదిలివెళ్ళాను.

నేను అటు మైసూరు వెళ్ళగానే ఇక్కడ ఆశ్రమంలో వున్న నా బిడ్డ శ్రీవాణిని పాడు చేశారు. నా చిన్నారి కూతురు శ్రీవాణి గర్భవతి అయింది. తను ఎవరికీ చెప్పుకోలేకపోయింది. పాపం పుణ్యం తెలియని శ్రీవాణికి అబార్షన్ చేయడంతో మరణించింది.

నా బిడ్డని కడసారి చూపు చూడటానికి కూడా నేను నోచుకోలేదు. నాకు తగినశాస్తి జరిగింది. నా తప్పులకి దేవుడు తగిన శిక్ష విధించాడు.





నేను గోవిందశెట్టి ఇంట్లో కొన్ని రోజులు వుండివచ్చాను. ఇక్కడికి వచ్చేవరకూ నాకు విషయం తెలియదు. ఎవరూ కబురంపలేదు.

వచ్చిన తరువాత అడిగితే ఆశ్రమంలో వున్న పెద్దలు శ్రీవాణి ఆత్మహత్య చేసుకున్నదని చెప్పారు. ఆశ్రమంలో వున్న నా స్నేహితురాలు నాకు అసలు విషయం చెప్పింది.

ఆశ్రమంలో ప్రాణం విలువ గోటితో సమానం.

ఇది పవిత్ర స్థలంకాదు, చాలా అపవిత్రమైన స్థలం!

ఇది ఆశ్రమంకాదు, బలవంతపు వ్యభిచార గృహం.

నేను ఒక విషయం రాయడానికి చాలా బాధపడుతున్నాను. మీవారు రామక్రిష్ణ లేరు. రామక్రిష్ణగారిని స్వామి హత్య చేశాడు. మీవారి శవాన్ని ఆశ్రమంలో వున్న బాత్‌రూం పక్కగా పెద్ద గొయ్యి తీసి అందులో పూడ్చివేయించాడు. ఈ రహస్యం కొద్దిమందికే తెలుసు.

ఈ విషయాలన్నీ నేను మైసూరునుంచి తిరిగి వచ్చాక నా స్నేహితురాలిద్వారా తెలిశాయి. మీరిక్కడే వున్నట్టు తెలిసి రాస్తున్నాను.

లంకెబిందెలు వున్నాయనే వంకతో బాత్‌రూం పక్కగా పెద్ద గొయ్యి తవ్వించాడు. మీవారి శవాన్ని ఆ గొయ్యిలోనే పూడ్పించాడు. తవ్విన ఆ గొయ్యిమీద ప్రస్తుతం గచ్చురాయి పరిచారు.

ఆశ్రమ సేవిక అనసూయని కూడా స్వామి చంపేశాడు. ఆమె శవాన్ని కూడా బాత్‌రూంకి ఎడమవైపు వున్న స్థలంలో గొయ్యి తవ్వించి పూడ్పించాడు.

వీడికంటే కసాయివాడు చాలా నయం. వీడు చాలా దుర్మార్గుడు, నికృష్టుడు!

కన్నకూతుర్ని చేజేతులా పోగొట్టుకున్న నా పాపాలకి విముక్తిలేదు.

నాలాంటి నీచురాలికి తోటి మానవుల మధ్య జీవించడానికి కూడ హక్కులేదు. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను. నా పాపాలకి అదే సరైన శిక్ష, సరైన పరిష్కారం.

పోలీసులకి చెప్పి కొట్లాడి, స్వామికి జైలు శిక్షపడేలా చేస్తారని భావిస్తున్నాను. ఈ దుర్మార్గుడి నేరాలకి ఉరిశిక్షే సరైన శిక్ష.

ఎప్పటికైనా మీరు చేస్తున్న వుద్యమం విజయవంతం కావాలని మనసారా కోరుకుంటున్నాను.

చేసిన తప్పులకి క్షమించమని అడగటానికి కూడా నాకు అర్హత లేదు. నాకు తగిన శిక్ష ఆ భగవంతుడే విధించాడు.

ఇక మీనించీ, ఈ లోకాన్నించీ సెలవు తీసుకుంటాను.

కానరాని లోకాలకి వెళుతున్న ఒక అభాగ్యురాలు

ఇట్లు

దొంగసుబ్బాయి"

ఉత్తరం చదువుతున్న సమయంలో రాధికకి కళ్లంటనీళ్లు తిరుగుతున్నాయి.

తన భర్తని హత్య చేశారన్న మాట!

ఒక్కసారిగా భోరుమని విలపించింది రాధిక! అరగంటసేపు వరకూ ఏడుపు ఆపుకోలేకపోయింది.

తరువాత కసితో పళ్లు పటపట కొరికింది.

కుమార్ కూడా ఉత్తరం చదివి రాధికని ఓదార్చాడు.

"ఈ ఉత్తరం ఆధారంగానే స్వామి పనిపట్టాలి. వాడికి ఇక శిక్ష తప్పదు" అన్నాడు కుమార్.

"మామూలు శిక్షకాదు, ఉరిశిక్ష పడా,



ల్సిందే" అంది రాధిక.

తక్షణం చేయాల్సిన పని గూర్చి చర్చిం చారు.

ఒరిజనల్ ఉత్తరాన్ని నాలుగు ఫొటో స్టాట్ కాపీలు తీయించారు.

ఇద్దరు స్నేహితుల్ని వెంటపెట్టుకుని నలు గురు కల్సి ఎస్పీ దగ్గరకి వెళ్లారు.

ఎస్పీ నమ్మకాలు ఉన్నవాడే గానీ స్వామి కార్యకలాపాల మీద అనుమానంగానే వుంది. సరైన ఆధారాలు లభించిన పక్షంలో సరైన సమయంలో ఆశ్రమం మీద దాడి నిర్వహించాలని ఎస్పీ కొంత కాలం నించీ అనుకుంటున్నాడు.

రాధిక ఎస్పీకి తనకి వచ్చిన ఉత్తరం అందించింది.

ఎస్పీ ఉత్తరం చదివాడు.

"కంగ్రాచ్యులేషన్స్ రాధికగారూ... మంచి ఆధారం దొరికింది. ఇక చూపెడతాం మా శాఖ ప్రతాపం"

"ఎస్పీ అప్పటికప్పుడే సిబ్బందిని అలర్ట్ చేశాడు.

ఒక డిఎస్పీ, ఇద్దరు సర్కిల్ ఇన్స్పెక్టర్లూ, నలుగురు సబ్ ఇన్స్పెక్టర్లూ 40 మంది సాయుధ పోలీసులతో ఎస్పీ నేతృత్వంలో మూడు జీపులూ, రెండు వ్యాన్లూ, ఒక కారూ రయ్‌మంటూ ఆశ్రమం వున్న గ్రామం వైపు దూసుకుపోయాయి.

ముందుగా ఎస్పీకారు. వెనుక ఇతర వాహనాలు. డిఎస్పీకి సైతం ఎక్కడికి వెళ్తు న్నదీ తెలియలేదు.

బయట గేట్లో వున్న సెక్యూరిటీ వాళ్లకి మాట్లాడే అవకాశం కూడా ఇవ్వకుండా పోలీసులు వాళ్లని ఎత్తి వ్యానులో పడే శారు.





అంతేవేగంతో ప్రాంగణం దాటి ఆశ్రమం లోకి వాహనాలు ప్రవేశించాయి.

పోలీస్ వాహనాలు రావడం గమనించిన స్వామి వెనుకవైపునించి పరుగులంకించుకు న్నాడు.

అది ఒక కానిస్టేబుల్ గమనించి చెప్పాడు. వెంటనే పోలీసులు పరిగెత్తి పోయి స్వామిని పట్టుకుని తెచ్చి సంకెళ్లు వేసి వ్యానులో కూర్చోపెట్టారు.

మొదటగా పోలీసులు ఆశ్రమాన్ని దిగ్బం ధనం చేశారు.

కొంతమంది పోలీస్ సిబ్బంది ఆశ్ర మంలో ప్రతి అంగుళం గాలించారు. వాళ్లకి అనేక ఆధారాలు దొరికాయి.

తరువాత సౌజన్య వుత్తరంలో రాసిన ప్రదేశాన్ని గుర్తించి తవ్వడం ప్రారంభిం చారు.

వాళ్లకి రామక్రిష్ణ కళేబరం, ఆ గోతిలోనే అతనికి సంబంధించిన వస్తువులు లభిం చాయి. మరో గొయ్యిలో అనసూయ కళే బరం లభించింది.

ఎస్పీ చకచకా ఆదేశాలు జారీ చేస్తుంటే స్వామినించి భారీగా ముడుపులు అందు కున్న అధికార్లు కిక్కురుమనకుండా ఆదే శాల్ని అమలు చేశారు.

స్వామినీ ఆశ్రమ కార్యదర్శినీ, ముఖ్యసేవి కల్నీ, కొందరు భక్తుల్ని ఎక్కించుకుని వ్యానులు తిరుగుముఖం పట్టాయి.

పట్టణంలో వున్న కొందరు స్వామి భక్తు లకి విషయం తెల్సింది. వాళ్లు వెంటనే రాజ కీయ నాయకులతోనూ, మంత్రులతోనూ ఫోనుల్లో సంప్రతించడం మొదలుపెట్టారు.

తన కార్యాలయంలో ఎస్పీ ప్రెస్‌మీట్ ఏర్పాటు చేశాడు.

ముందు స్వామి ప్రెస్‌కి ఏం చెప్పడానికీ నిరాకరించాడు. ఎస్పీ తన హీరోయిజం చూపెట్టడంతో స్వామి మరో మాట మాట్లా

డకుండా ప్రెస్‌కి తన అక్రమాలు అన్నీ పూసగుచ్చినట్లు వివరించాడు.

స్వామి చేసిన అక్రమాలు అన్నీ ఆయన నోటితోనే చెప్పించారు.

మరుసటిరోజు స్వామి అక్రమగాధలతో దినపత్రికలు నిండిపోయాయి.

నీళ్లస్వామిని విడిపించాలని ప్రయత్నాలు మొదలుపెట్టి నాయకులు ఇదేదో తమ మెడకి చుట్టుకునేలా వుందని మౌనంగా రంగంనించి తప్పుకున్నారు.

స్వామిని కోర్టుకి హాజరు పరిచారు. విచారణ నిమిత్తం న్యాయమూర్తి స్వామికి పదిరోజుల పోలీస్ రిమాండ్ విధించాడు.

ఎస్పీ ప్రత్యక్ష పర్యవేక్షణలో చాలా పకడ్బందీగా ఛార్జిషీటు తయారుచేసి కోర్టుకి సమర్పించారు.



ఒక సంవత్సరం పది నెలల కాలం గడిచింది.

స్వామిమీద కోర్టు తీర్పు వెలువడే రోజు. కోర్టు హాలంతా కిక్కిరిసిపోయింది.

మీడియా, స్వామి బాధితులు, హేతువాదులతో కోర్టు ప్రాంగణం, హాలు నిండిపోయి కళకళలాడుతోంది.

తీర్పు వినడానికి స్వామి భక్తులు, అనుచరులలో కనీసం ఒక్కరు కూడా రాలేదు.

ఆశ్రమం ఉచ్ఛదశలో వున్న సమయంలో పోలీస్ అధికారులకీ, రెవిన్యూ అధికారులకీ స్వామి కార్యదర్శిద్వారా కట్టలు కట్టలు డబ్బు అందించేవాడు. స్వయంగా స్వామి గాలిలోనించి తెప్పించినట్లు మేజిక్ చేసి ఉంగరాలు, ఆభరణాలు వాళ్లకి సమర్పించేవాడు.

వాళ్లకి అవసరమైన అనేక పనులు చేసి పెట్టాడు.

సమయం వచ్చినప్పుడు తనకి అనుకూలంగా వుంటారనే ముందు చూపుతో స్వామి వాళ్లముందరి కాళ్లకి బంధం వేశాడు.

స్వామికి బెయిల్ కూడా దొరక్కుండా ఖైదులో మగ్గిపోతున్న సమయంలో వాళ్లలో కనీసం ఒక్కరు కూడా స్వామి ముఖం చూడలేదు.

పరోక్షంలో స్వామి చర్యల్ని ఇంకా హాస్యం, అపహాస్యం చేసి మాట్లాడుకున్నారు.

జడ్జి ఒక మహిళ. ఆమె మంచి న్యాయమూర్తి అని అధికారుల దగ్గరనించీ సామాన్య ప్రజల వరకూ అనుకుంటారు. న్యాయవాదులకి కూడా ఆమె అంటే బెరుకే.

కేసులో స్వామికి శిక్షపడే అవకాశం వుందని అక్కడ చేరిన వాళ్లు అనుకుంటున్నారు. ఆ జడ్జి చేతిలో పడిన కేసులో నిందితులు తప్పించుకుపోయే అవకాశం తక్కువ.

జడ్జి తన స్థానంలోకి ప్రవేశించిన వెంటనే గౌరవసూచకంగా న్యాయవాదులు, ప్రజలు లేచి నించున్నారు.

రాధిక తన కొడుకు మూడేళ్ల బుడతడు చార్వాకని వడిలో కూర్చోపెట్టుకుంది. చేతికి గాజులు, తలలో పూవులు, నుదుట తిలకం దిద్దుకుని అందరిలాగే వచ్చింది.

జడ్జి కోర్టుకి వినయంగా నమస్కరించి తన స్థానంలో ఆశీనులయ్యారు.

కొద్దిసేపు తరువాత జడ్జి సుదీర్ఘమైన తీర్పుని చదవడం మొదలుపెట్టారు.

తీర్పు సారాంశం ఇలా ఉంది.

ప్రేమానందస్వామి ఉరఫ్ నీళ్లస్వామి ఉరఫ్ పేరయ్య అనే ఈ నిందితుడు స్వామిగా అవతారం దాల్చి అనేక అకృత్యాలకి పాల్పడ్డాడని కోర్టు భావిస్తున్నది. అమాయక ప్రజల్ని మోసగించడం, చిత్రహింసలు పెట్టడం, మాయమాటలు చెప్పడం, స్త్రీల మానభంగం, హత్య, మృతదేహాల్ని పాతిపెట్టడం ద్వారా సాక్ష్యాల విధ్వంసం తదితర కేసుల్లో పేరయ్యని దోషిగా కోర్టు ప్రకటిస్తున్నది.

నిందితుడుకి రెండు యావజ్జీవ కారాగార శిక్షలు, మరో సంవత్సరం జైలు శిక్ష విధిస్తున్నాను. ఈ మూడు శిక్షలు ఏకకాలంలో గాకుండా ఒకదాని తరువాత మరో శిక్ష అమలు జరపవలసినదిగా ప్రభుత్వాన్ని ఆదేశిస్తున్నాను.

నిందితుడు 88 లక్షల 40 వేల రూపాయల భారీ జరిమానాని చెల్లించవలసినదిగా కూడా ఆదేశాలు జారీ చేస్తున్నాను. నిందితుడు ఈ జరిమానా చెల్లించని పక్షంలో 38 సంవత్సరాల 7 నెలల జైలు శిక్ష అనుభవించవలసి వుంటుందని కూడా కోర్టు ప్రకటిస్తున్నది.

నిందితుడు చెల్లించే జరిమానాని బాధితులైన మృతుల కుటుంబీకులకు పది లక్షల రూపాయలు, అత్యాచారాలకి గురయిన మహిళలకి ఐదు లక్షల రూపాయలు చెల్లించవలసినదిగా ప్రభుత్వానికి తెలుపుతున్నాను.

స్వామి అకృత్యాలకి సహకరించిన ఆశ్రమ సేవికలు, సేవకులు, డాక్టర్ ఈశ్వరమ్మ ఈ దోషులకి మూడు సంవత్సరాల ఒక నెల జైలు శిక్ష విధిస్తున్నాను. ఈ శిక్షలో నిందితులు రిమాండ్‌లో వున్న కాలానికి మినహాయింపు లభిస్తుంది.

ఏదైనా ప్రత్యేక సందర్భాలలో కేంద్రం కానీ, రాష్ట్ర ప్రభుత్వంకానీ ఖైదీలకి క్షమాభిక్ష ప్రకటించడమో, శిక్షకాలాన్ని తగ్గించడమో చేస్తుంటాయి. అలాంటి తగ్గింపులేమీ ఈ కేసులోని దోషులకి వర్తించవని కోర్టు స్పష్టంగా ప్రకటిస్తోంది.

దేశంలో ఇలాంటి దొంగలు స్వాములుగానూ, బాబాలుగానూ అమ్మలుగానూ చలామణి అవుతుండటంపట్ల విస్మయం ప్రకటిస్తున్నాను. ప్రభుత్వం కూడా ఇలాంటి దొంగస్వాముల మీద దృష్టినిలిపి చర్యలు తీసుకోవలసినదిగా కోర్టు సూచిస్తున్నది.

ఉన్నత విద్యలు అభ్యసించిన డాక్టర్లు, ఇంజినీర్లు ఇలాంటి స్వాముల మాయల్లో పడి పోవటం, వాళ్ల మోసాలకి బలిగావడం ఆందోళన కలిగించే పరిణామమని కోర్టు భావిస్తున్నది.

నిందితులు పైకోర్టులకి అప్పీలు చేసుకునే అవకాశంలేదని కూడా ఈ కోర్టు విస్పష్టంగా ప్రకటిస్తున్నది.

కోర్టు తీర్పు చదివిన న్యాయమూర్తి అందరికీ నమస్కరించి తన చాంబర్‌లోనికి వెళ్లిపోయారు.

"గ్రేట్ మమ్మీ! విజయం మనదే మమ్మీ" మూడేళ్ల చార్వాక తల్లి రాధిక మెడచుట్టూ చేతులు వేసి బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఒక విజయం సాధించిన ఉత్సాహ, ఆనంద, ఉద్వేగాలతో స్వీట్లు పంచారు ఆమె మిత్రులూ, సహచరులూ.







# చతుర కథలు

## తోట

మానాపురం ఏమాత్రం ప్రాముఖ్యతలేని చిన్న పల్లెటూరు. నాగులేరిదాటి కొంత దూరం పొలాల గట్లంట నడిస్తేగాని ఆ ఊరు రాదు. ఐదేళ్లకొకసారి రాజకీయ నాయకుల రాకతో హడావిడి సంతరించుకొని అంతలో సద్దుమణిగిపోతుంది. మిగతా సమయాల్లో ప్రభుత్వ ఉద్యోగి అన్నవాడు ఎవ్వడూ వెళ్ళడు. ఈ నాయకులు, వినాయకులు ఉద్యోగులు తమను వేధించకుండా ఉంటే చాలనే అమాయకులు అక్కడివాళ్లు.

వేసవికాలం నాగులేరు పూర్తిగా ఎండిపోయింది. మానాపురానికి జీపు వచ్చింది. ఊళ్ళో కలకలం రేగింది. చిన్నాపెద్దా జీపుచుట్టూ మూగారు. జీపులోంచి కంటికి నల్లకళ్లద్దాలు, నెత్తిమీద హ్యాటు, కాళ్లకు గమ్ బూట్స్‌తో దర్జాగా ఉన్న వ్యక్తి దిగాడు. ఆ వెనకాలే దిగిన బంట్రోతు అందించిన మినరల్ వాటరు తాగి ముందుకు కదిలాడు. అక్కడి జనం ముంతలతో తాటికల్లు తాగడం చూశారు కాని సీసాతో ఇదేదో డాబుగా కొబ్బరి నీళ్లలా బాగానే వుందని ఊరు ఊరంతా ఆ వ్యక్తిని వెంబడించారు.

అంతమంది జనం తనని అనుసరించి రావడం ఆ వ్యక్తికి అపరిమితానందం కలిగించింది. హుందాగా నడుస్తూ ముందుకు కదిలాడు. ఊరి చివరకు వచ్చారు



వాళ్లంతా. రకరకాల తోటలున్నాయి. ఆఫీసరు కళ్లద్దాలు తీసి రుమాలుతో తుడుచుకొని మళ్లా పెట్టుకొన్నాడు. గొంతు సవరించుకొని,

"ఈ తోట ఎవరిది? " అన్నాడు.

"రామయ్యది" అన్నారు వాళ్లంతా.

"ఏడీ! ఆ రామయ్యా? " అన్నాడు ఆఫీసరు.

"చిత్తం బాబయ్యా! నేనే రామయ్యని" ఆఫీసరు ఆ వచ్చిన వ్యక్తిని చూశాడు. ముడుకులు దాటని నీరుకావిపంచె, భుజాన గావంచా. కాళ్లకు చెప్పులు కూడాలేవు. మనిషి మాత్రం దృఢంగా, మంచి బందోబస్తుగా ఉన్నాడు.

"చూడు రామయ్యా! నీ తోటకి ఏ ఫెర్టిలైజరు... ఐమీన్ ఏవేవి ఎరువులు వాడుతున్నావు" అడిగాడావ్యక్తి.

"చిత్తం ఏగత్తం వాడనయ్యా బాబయ్యా"వినయంగా సమాధానం.

"అదే ఈదేశ దౌర్భాగ్యం. మనిషి మూడు పూటలా తిండి తిని తన పబ్బం గడుపుకొంటున్నాడు. కాని అదే ఈ చెట్లు, కన్నకొడుకుల్లాంటి చెట్లకు మాత్రం నరిషింగ్ నమోః... నమోః..." విచారాన్ని వ్యక్తపరిచాడు ఆఫీసరు.

"అది సరే, ఏ క్రిమిసంహారకమందులు వాడుతున్నావు రామయ్యా" మళ్లీ ప్రశ్నించాడు.

రామయ్య తల గోక్కున్నాడు.

తన ప్రశ్న అర్థంకాలేదని "పురుగులు గట్రా చావడానికి పిచికారీ కొట్టించడం లాంటి పనులు చేస్తున్నావా?" ఎలిమెంటరీ స్టాండర్డు కుర్రాడిని ఎడ్యుకేట్ చేస్తున్నాన్న భావన ఆఫీసరులో ప్రతిఫలిస్తోంది.

"చిత్తం, లేదు బాబయ్యా" మళ్లీ బడుగువాడి నోట బదులు పలికింది.

"నో బడీ కెన్ సేవ్ దిస్ కంట్రీ" గొణుక్కుని

"ప్చ్... లాభం లేదయ్యా! ఎరువులు వెయ్యరు, పురుగుల మందులు కొట్టించరు. పంటలెలా పండుతాయి. పంటలు పోతే ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోస్తారు. పోనీ పంటలకు ఇన్స్యూరెన్సు చేశావా రామయ్యా"

"అంటే ఏమిటి బాబయ్యా!" అడిగిన ప్రశ్నలో అమాయకత్వం తప్ప మరేమీ కన్పించలేదాఫీసరుకి.

"ఓ... ఇన్స్యూరెన్సు అంటే తెలియదు కదూ! బీమా... పంటలు పోతే దానికి తగిన ప్రతిఫలం పొందవచ్చు" ఇప్పుడైనా అర్థం అయిందా అన్నట్లు చూసాడాయన.

"లేదు బాబయ్యా!"

రామయ్య నిఘంటువులో అవును అన్న పదం లేనట్లుంది.

"అయ్యో నా ప్రజలారా! వినండి. ఇలా అయితే ఈ దేశం ఎలా బాగుపడుతుంది. అమెరికా, ఇంగ్లాండులాంటి దేశాలు సశాస్త్రీయమైన పద్ధతిలో పంటలు పండించి లాభాలు ఆర్జిస్తున్నాయి. అక్కడి రైతులు కార్లలో వెళ్తారు, ఇళ్లకు టెలిఫోన్లు పెట్టుకొంటారు, సూట్లు వేసుకొని తిరుగుతారు. మీలా సగం బట్టల్తో కనపడరే" విదేశాల్లో తను చూసి వచ్చిన ఉదంతాలు కథలుకథలుగా చెప్తుంటే గ్రామ వాసులు నోరు వెళ్లబెట్టి వింటున్నారు.

"మీరంతా తక్షణమే కదలండి. దారిద్ర్య రేఖ దిగువన ఉండకండి" ఆవేశపడిపోతున్నాడాయన. పల్లె జనమంతా సైడ్‌కి తొలగి తలెత్తి చూశారు. ఆఫీసరు చెప్పిన రేఖ ఎక్కడా కన్పించలేదు. మినరల్ వాటరు బాటిల్ ఖాళీ చేసి మళ్లీ తన ఉపన్యాసం కొనసాగించాడాయన.

"ఇప్పుడు మీకొక మంచి ఉదాహరణ ఇవ్వబోతున్నాను. శ్రద్ధగా వినండి. ఈ తోట చూడండి. ఇందులో పండిన బత్తాయిలుచూడండి. ఎరువులు, మందులు లేని కారణంగా ఎంత నాసిరకంగా పండాయో. ఇవి ఇంకా సైజులో పెద్దవయితే మంచి రసం వస్తుంది. అందుకే ఈరోజు నుండి కాదుకాదు ఈ క్షణం నుండి మంచి మంచి ఎరువులు పెట్టి చెట్లకు ఇంజక్షన్స్ ఇచ్చి మీ పంట దిగుబడిని రెండింతలు చేసుకోండి"

"చిత్తం బాబయ్యా!" రామయ్య చేతులు కట్టుకొని అడ్డొచ్చేడు.

"క్షమించాలి బాబయ్యా! ఈ తోట బత్తాయి తోటకాదు. ఇది నిమ్మతోట. మా ఏరియాలో బత్తాయి పండదు"

–ఆనందరావ్ పట్నాయక్





# కులవృత్తి

ఎమ్మెల్యే గుర్నాథం తన ఆఫీస్‌లో కొలువు తీరి వున్నాడు. ఉద్యోగాలకోసం, వ్యాపార లైసెన్సులకోసం రకరకాల రికమండేషన్లకోసం అనేకమంది ఆయన వద్దకు వస్తున్నారు. రాబోయే ఎలక్షన్లలో గెలవాలంటే అందరినీ ఏదోవిధంగా సంతృప్తిపరచాలి కనుక రికమండేషన్ లెటర్లమీద సంతకాలు పెట్టి ఇస్తున్నాడు.

ఇంతలో ఇద్దరు వ్యక్తులు గుర్నాథాన్ని చూడ్డానికి వచ్చారు. వాళ్ళిద్దరూ తండ్రీకొడుకులు.




గుర్నాథం వాళ్ళను చూసి "ఏంటిపని? " అనడిగాడు.

దానికి తండ్రి బదులిస్తూ, "అయ్యా, వీడు నా కొడుకు. ఏదో నా శక్తికొద్దీ వీడిని చదివించాను. ఇప్పుడు మావాడు ఉద్యోగాలు చేసి ఊళ్ళేలుదామనుకుంటున్నాడు. అయితే వీడు ఉద్యోగం చెయ్యడం నాకిష్టంలేదంటే వినటం లేదయ్యా" అన్నాడు.

గుర్నాథం ఆశ్చర్యపోతూ, "ఏం, నీకెందుకు ఇష్టంలేదు" అనడిగాడు.

"అందరూ ఉద్యోగాలకోసం ఎగబడితే ఇక కులవృత్తులు ఏమైపోవాలయ్యా. అందుకే మా వాడిని హాయిగా మన కులవృత్తి చేసుకుని దర్జాగా బతకరా అని చెపుతుంటే వినడం లేదయ్యా. ఏదో నాలుగక్షరం ముక్కలు నేర్పిస్తే జ్ఞానం పెరిగి వృత్తిలో కొత్తపద్ధతులు ప్రవేశపెడతాడన్న ఆశతో చదివించాను. తీరా వీడు చదివిన తర్వాత కులవృత్తి చెయ్యను, ఉద్యోగమే చేస్తానని శివాలెత్తుతున్నాడు. మీరైనా కాస్త బుద్ధి చెప్పండయ్యా" అని ఆ తండ్రి మొరపెట్టుకున్నాడు.

అది విన్న గుర్నాధానికి తమ ప్రభుత్వ పాలసీ గుర్తుకొచ్చింది. ప్రభుత్వం చేతివృత్తులవారికి అనేకవిధాల సహాయపడేందుకు అనేక పథకాలు ప్రవేశపెట్టింది. వాటి ద్వారా చాలామంది లాభం పొందుతున్నారు. అందుకే ఎమ్మెల్యే గుర్నాథం ఆ యువకుడి మనసు మార్చాలనుకున్నాడు.

"అబ్బాయ్, మీ నాన్న చెప్పింది కరెక్టోయ్. చదువుకున్న ప్రతివాడూ ఉద్యోగాల కోసం వెంపర్లాడితే మా ప్రభుత్వం మాత్రం ఏం చెయ్యగలదు! ఎంతమందికని ఉద్యోగా

లిప్పిస్తాం చెప్పు. చదువుకున్నావని కుల వృత్తి చేసుకోడానికి చిన్నతనం ఫీలైతే ఎలా గోయ్! మీ నాయన మాటవిని కులవృత్తి చేసుకుని స్వతంత్రంగా బతుకు. నీకేమైనా సాయం కావలిస్తే నేను చేస్తాను" అని హితబోధ చేశాడు.

సాక్షాత్తు ఎమ్మెల్యేగారే తమ కులవృత్తిని గౌరవించి అది చేసుకోమని సలహా ఇస్తుంటే ఆ కుర్రాడు కాదనలేకపోయాడు.

"మీరు చెప్పినట్లుగానే చేస్తాను. నన్ను ఆశీర్వదించండి" అని గుర్నాధం పాదాలకు మొక్కబోయాడు.

అది చూసి గుర్నాధం హృదయం ఉప్పొంగిపోయింది. వచ్చినవాడు ఎటు వంటి రికమండేషన్ లెటరూ అడక్కుండా కాళ్ళకు దండం పెట్టబోతుంటే అతడికి పిచ్చి సంతోషం కలిగింది. ఒక యువకుడు అందులో తన నియోజకవర్గ ఓటరు తన మాటను గౌరవించి తను చెప్పినట్లు చెయ్యడానికి అంగీకరించాడన్న ఆనందంతో తన కాళ్ళకు మొక్కబోతున్న అతడ్ని పైకిలేపి ఆప్యాయంగా కౌగిలించుకుని వెన్నుతట్టి పంపించాడు.

కొడుకుని తనదారికి వచ్చేలా చేసిన ఎమ్మెల్యే గుర్నాధానికి ఆ తండ్రి కృతజ్ఞతలు చెప్పుకుని బయటకు నడవబోయాడు.

ఇంతలో గుర్నాధానికి ఏదో గుర్తొచ్చి "అన్నట్లు అడగడం మర్చిపోయాను. ఇంతకీ మీ కులవృత్తేమిటి? " అనడిగాడు.

ఆ యువకుడి తండ్రి కాసేపు తటపటాయించి "జేబులు కొట్టడం బాబూ..." అని చెప్పి వెళ్ళిపోయాడు.

"వార్నీ" అని పెద్దగా నవ్వుకున్న గుర్నాధం "మనం చేసేదీ అదేగా" అనుకుంటూ ఎందుకో అనుమానమొచ్చి తనజేబులో చెయ్యిపెట్టి తడుముకున్నాడు.

జేబులో ఉండవలసిన బరువైన మనీ పర్సు చేతికి తగలలేదు.

**–తురాగో**

---

## పార్కింగ్ ప్రోబ్లమ్

రామనాథం ఓ ఆధ్యాత్మిక సభకు బయలుదేరాడు. ఆఫీసులో ఆఫీసర్ల బాసిజం, పై అధికారుల సాధింపులు, పబ్లిక్‌నుంచి పిటీషన్లు... బారినపడి విలవిలలాడే మనసుకో ఓదార్పు కోసం ఆ మీటింగ్‌కు వెళ్లాడు.

తన మధ్యతరగతి జీవితానికో గుర్తింపుగా సైకిలు వేసుకెళ్లాడు. అక్కడ మారుతీల దగ్గర్నించి మామూలు సైకిళ్లవరకు పార్క్ చేసి వున్నాయి. తను పార్క్ చేద్దామంటే స్థలంలేదు.

చిన్నప్పట్నించి అతనికి 'పార్కింగ్ ఈజ్ ఎ ప్రోబ్లమ్. తను ఎక్కడికి సైకిలు వేసుకెళ్లినా అక్కడ కుప్పలు తెప్పలుగా వాహనాలు పార్క్ చేయబడి వుండేవి. తను ఖాళీ దొరికినచోట పార్క్ చేయడం, సదరు కానిస్టేబుల్ గారు జరిమానా వసూలు చేయడం లేదా సైకిల్‌ని రావణాసురుడు సీతాదేవిని ఎత్తుకెళ్లి లంకలో దాచినట్లు స్టేషన్లో దాచేయడం, రామనాధమ్ అపర శ్రీరామచంద్రుడిలా వెళ్లి విడిపించుకురావటం లాంటివెన్నో చేసి విసిగివేసారిపోయి ఉండడంవల్ల పార్కింగ్ అంటే మొదట్నించీ భయమే.

ఎలాగోలా సంకీర్ణ ప్రభుత్వంలో కాస్త చోటు దొరకబుచ్చుకున్న చిన్న ప్రాంతీయ పార్టీలా సైకిళ్ల గుంపులో తన దానికీ స్థానం కల్పించాడు.

లోపల మీటింగ్‌లో నేల ఈనినట్లు జనం... ఒకప్పుడు తత్వచింతనతో అలరారిన మనదేశానికి అన్ని కరువులతోపాటు ఆత్మచింతనకి కూడా కరువు కాలం వచ్చిందా? అని కాసేపు బాధపడ్డాడు.





లోపలకూడా తనకు పార్కింగ్ ప్రోబ్లమ్. కాటికి కాళ్లు జాపుకున్న వాళ్ల దగ్గర్నుంచి కాలేజీలకు వెళ్లే వాళ్లదాకా జనం కిక్కిరిసి పోయి వున్నారు. బలిచక్రవర్తి గూర్చి చెబు తున్నాడాయన.

"ఆ చక్రవర్తిగారు వామనుడి మూడో అడుగుకి పార్కింగ్‌ప్లేస్ చూపించలేకపో యాడు. అతి మర్యాదకు పోయి అథఃపా తాళానికి చేరుకున్నారు. అంచేత పార్కింగ్ ప్రోబ్లమ్ ఈనాటిది కాదు అనాదిగ వస్తు న్నదే" అనుకొన్నాడు రామనాథం. కాసేప టికి బోర్‌కొట్టి బయటకొచ్చాడు.

ఆకాశంలో పిట్టలు హడావుడిగా అటూ ఇటూ ఎగురుతున్నాయ్. చెట్లు తగ్గిపోవడం వల్ల పక్షులకీ పార్కింగ్‌ప్లేస్ కొరత ఏర్ప డింది కాబోలని నిట్టూర్చాడు రామనాథం.

స్కూల్ వదిలిపెట్టారు కాబోలు పిల్ల లంతా హాపీగా బయటికొస్తున్నారు. ఇంకా కొంతమంది పిల్లలు రిక్షాలెక్కి బళ్లోకెళుతు న్నారు. స్కూల్లో పిల్లలకి తగినంత చోటు లేక షిఫ్ట్ పార్కింగ్ పద్ధతి పెట్టారని బాధ పడ్డాడు.

ఆ పక్కనే గవర్నమెంట్ హాస్పిటల్ అక్కడా పార్కింగ్ ప్రోబ్లమే. కాళ్లు, కీళ్లు విరిగిన వాళ్లని కూడా బయటే వుంచారు. చెట్లకింద ప్రసవాలు జరుగుతున్నాయి. అంతా పార్కింగ్ లేమి అని వైరాగ్యంలో పడ్డాడు రామనాథం.

ఇంతలో "టెలిగ్రామ్ సార్" అంటూ పోస్టుమేన్ వచ్చాడు. మిసెస్ రామనాథం పంపించిన టెలిగ్రామ్ అది.

'న్యూలీ మేరీడ్ కపుల్' వాళ్లిద్దరూ. ప్రస్తుతం ప్రెగ్నన్సీ టెస్టులకని పుట్టింట్లో వుంది. వెళ్లేముందు ఇద్దరికీ గొడవచ్చి పడింది. రామనాథానికి పిల్లలు త్వరగా కావాలి. ఆవిడేమో ఇంకొంత కాలం ఆగుదా మంది.



టెలిగ్రామ్ విప్పి చూశాడు.

'నో ప్రోబ్లమ్.. ప్రెగ్నన్సీ పోస్ట్‌పోన్డ్' అని వుంది. అంటే ఆవిడకు వాళ్లింట్లో కావా ల్సినంత పార్కింగ్ ప్లేస్ అన్నమాట! ఫర్వా లేదు అనుకున్నాడు రామనాథం.

—డాక్టర్ కె.శివసుబ్బారావు

# ఏరిన ముత్యాలు

★ జీవితంయొక్క ముఖ్య ఉపయోగం దాని తరువాత కూడా నిలిచే పనులు చేయడమే.

-విలియం జేమ్స్

★ ఆశలను తీర్చుకోవడం ద్వారా కాకుండా వాటిని తగ్గించుకోవటం ద్వారానే శాంతి, సౌఖ్యాలు లభిస్తాయి.

- హెబర్

★ సహృదయత, కారుణ్యం ఈ రెండూ గలవ్యక్తి ఎలాంటి సమాజాన్ని అయినాసరే జయిస్తాడు.

-ఎమర్సన్

★ ఒకరిని శాసించే ముందు విధేయులుగా వుండడం నేర్చుకోండి.

-సోహన్

★ తెలివి తక్కువకంటే అజాగ్రత్త ఎక్కువ హానికరం.

-ఫ్రాంక్లిన్

★ శ్రమ మూడు దురదృష్టాలను- (సోమరితనం, వ్యసనం, లేమి) మననుండి దూరంగా వుంచుతుంది.

-వోల్టేర్

★ తప్పుడు ఆలోచనలు ఆలస్యంగానైనా సరే చెడు ఫలితాలనిస్తాయి.

-జూలియస్ హక్స్లీ

★ మనిషి ప్రవర్తన అద్దంలాంటిది. ఆ అద్దంలో ప్రతివాడి నిజరూపం ప్రతిబింబించి తీరుతుంది.

-గెథే

★ తన భయాలను, కోరికలను, ఆలోచనలను అదుపులో పెట్టుకోగల వ్యక్తి రాజుకన్నా గొప్పవాడు

-మిల్టన్

★ కావాలని కోరేముందు ఇవ్వగల ఔదార్యం కూడా ఉండాలి.

-స్టీ ఫెన్

★ మితిమీరిన ఆశలకు పోయేవారే మోసాలకు గురి అవుతుంటారు.

-అరిస్టాటిల్

★ పరిస్థితులు బలహీనులను మాత్రమే శాసిస్తాయి. కాని విజ్ఞులకు అవి సాధనాలు మాత్రమే.

-శామ్యూల్ లవర్

★ ఇతరుల పాపాలు ఎప్పుడూ మనకళ్ళముందే కనబడుతూ వుంటాయి. కాని మన పాపాలు మన వెనకాలే వుంటాయి.

- సెనాకా

సేకరణ: డి. వెంకటేశ్వరరావు

# 'అబలాయానం' పై సమీక్షలు

జూన్ 'చతుర'లో ప్రచురితమైన పొత్తూరి విజయలక్ష్మి రచన 'అబలాయానం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## స్త్రీ జీవన సర్వస్వం

(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

**జూ**న్ నెల 'అబలాయానం' నవల అబలల జీవన వైవిధ్యాన్ని అద్దంపట్టి చూపింది. ఉత్తమ పురుషలో సాగిన ఈ నవలలోని ప్రధాన భూమిక తన బాల్యం నుంచీ చరమదశదాకా జరిగిన విషయాలను, అందులో తన పరిధిలోకి వచ్చిన స్త్రీలను, వారి జీవన స్థితులను, ఆర్థిక, సామాజిక పరిస్థితులు వారిని ఏవిధంగా ప్రభావితం చేసిందీ, అందువల్ల వారెదుర్కొన్న నిస్సహాయత మొదలైన విషయాలను చక్కగా చెప్పుకొచ్చింది. రోజువారీ జీవితంలో కూడా వివక్షకు గురౌతున్న స్త్రీ ప్రతిసంఘటనకూ స్పందించే విధానాన్ని బట్టి ఆమెమీద ఎలాంటి ముద్రపడేదీ, ఆమె జీవితం ఎలా మలుపులు తిరిగేదీ చక్కగా విశ్లేషించి తన మనుమరాలు భారతితో చర్చల రూపంలో సూచించింది. అత్తగారి తల్లి దగ్గరనుంచీ మనుమరాలి కూతురిదాకా ఇది దాదాపు 5 తరాల కథ. నాటి నుండీ నేటిదాకా సమాజంలో స్త్రీ జీవితంలో వచ్చిన మార్పులను చెప్పుకొచ్చింది. నిరక్షరాస్యత, బాల్యవివాహాలనుండి, అక్షరాస్యత ఉద్యోగసాధన, ఆర్థిక స్వాతంత్ర్యం (?)దాకా ప్రతి విషయాన్నీ ఆమె తన సునిశిత దృష్టితో తిలకించి నిర్మొహమాటంగా విడమరచి సాదాసీదాగా చెప్పి మనస్సును ఆర్ద్రపరచింది.

ఒక సాంఘిక ఆచారం స్త్రీల ఆత్మగౌరవాన్ని ఎంతగానో కించపరచి భావి సంఘ జీవితంలో ప్రతివారికీ ఒదిగిఒదిగి బతికేట్లు చేస్తుందని తెలుసు. కానీ ఈ ఆచారాన్ని గురించిన మంచి చెడ్డలను విమర్శించకుండా అబలలు అందులోకి ఎలా కూరుకొని పోతుంటారో కూడా చూపించారు. "అర్హత పొందిన దాన్నికాబట్టి ఆ తెల్లవారుఝాము కార్యక్రమానికి చాకలిదానికి సాయంగా నేనే నిలబడ్డాను" అనే వాక్యం అర్థంలేని ఆచారాలపట్ల స్త్రీలు ఎంత పట్టుదలగలవాళ్లో, స్వతంత్రులో చెప్పుంది. కానీ మరి రెండు వాక్యాలు పూర్తికాగానే కోడలు తనను మరికొన్నాళ్లు ఉండమన్నప్పుడు మాత్రం నేను స్వతంత్రురాలినా? కొడుకు నడిగి చెపుతాను అంటుంది.

ఇలా స్త్రీలోని సంతోషం, దుఃఖం, ఆచారం, పట్టుదల, అస్వతంత్రం, దాస్యం, స్వేచ్ఛాభావాలు, ఆలోచన ఇలా ఒకటనేమిటి? బాల్యంనుండి వృద్ధాప్యం దాకా సజీవచిత్రణను చూపిన నవల 'అబలాయానం'అయినా ఆడపిల్ల రెండవ తరగతి పౌరసత్వంగల నిస్సహాయురాలేనని చెప్పక చెప్పే వాక్యం ఆఖర్న భారతి అడిగే ప్రశ్న "మామ్మా! నేను మగపిల్లవాడిగా పుట్టి ఉంటే నా జీవితం బాగుండేదా? " అన్నది.

శీర్షికకు పూర్తి న్యాయం చేసిన నవల ఇది.

-అందుకూరు సత్యవతమ్మ
చిత్తూరు- 517004



## అబల అంతర్మథనం

(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)

**త**రతరాల స్త్రీ జీవన గమనంపై చక్కని నవల అబలాయానం

ఓనమాలు కూడా దిద్దుకోని దశనుండి చదువుల సరస్వతిగా మారినా వంటింటికే పరిమితమైన స్థాయినుండి బాధ్యతాయుత మైన ఉన్నతోద్యోగాలు చేసి విదేశాలకు వెళ్లే స్థాయికి ఎదిగినా స్త్రీ వైవాహిక జీవనంలో మాత్రం మార్పులేదు. ఆమె సుఖసంతోషాలు భర్త మంచితనంపైనా, సమర్థతపైనా మాత్రమే ఆధారపడి వున్న పరిస్థితిలోనూ మార్పులేదు.

ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యముంటే చాలు ఆమె సమస్యలన్నీ హుష్‌కాకి అయిపోతాయనుకునేవారికి ఈ నవల ఒక కనువిప్పు. ప్రధాన పాత్రద్వారా తరతరాల స్త్రీల అంతర్మథనాన్నీ, ఆవేదననూ, ప్రతికూల పరిస్థితులనెదుర్కోవాలన్న తపననూ ఎదుర్కోలేని నిస్సహాయతనూ కళ్లకు కట్టినట్లు వర్ణించారు రచయిత్రి.

స్త్రీల సమస్యల పట్ల రచయిత్రికున్న అవగాహన ఈ నవలద్వారా వ్యక్తమవుతోంది. ఈ నవలా నాయిక ఇంకా అదృష్టవంతురాలేనని చెప్పవచ్చు ఆమెకున్నంత ఆసరా, ఆదరణ కూడా లేనివాళ్లు మన సమాజంలో ఎందరో.

ఆద్యంతమూ ఆసక్తితో సానుభూతితో చదివించిన రచనా శిల్పం రచయిత్రిది. ప్రతి స్త్రీ, పురుషుడూ చదివి తీరాల్సిన నవల ఇది. ఈ నవల చదివాక కొద్దిమంది పురుషుల్లోనైనా మార్పువస్తే రచయిత్రి ప్రయత్నం సఫలమైనట్లే. ఆవిడకు నా హృదయపూర్వక అభినందనలు.

–రాజేశ్వరి, ఖమ్మం- 507001

## బాధల పల్లవి

(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

**ఆ**త్మకథలా సాగిన పొత్తూరి విజయలక్ష్మి గారి 'అబలాయానం' నేటి స్త్రీల దౌర్బల్యస్థితికి దర్పణం లాంటిది. ప్రత్యేకంగా చెప్పుకోవలసిన కథావస్తువు కాకపోయినా, అడుగడుగునా అనుభవిస్తూన్న అబలల ఆవేదనల్ని చాలా సహజంగా చిత్రీకరించడంలో రచయిత్రి కృతకృత్యురాలైనారు. బాధలతోనే పుడుతూ, బాధలతోనే బతుకుతూ బాధలతోనే చనిపోయే స్త్రీల హీన, దైన్యస్థితిని వాస్తవికంగా చూపించారు. ఒకపక్క బాధల్ననుభవిస్తూనే బాంధవ్యాలనీ, మమతల్నీ పెంచుకుంటూ, మరోపక్క తన జన్మపట్లే విసుగూ, అసహ్యం, నిర్లిప్తత స్త్రీలో చోటు చేసుకోవడం ఎంత దౌర్భాగ్యం! "మామ్మా! నేను ఆడపిల్లగా కాకుండా, మగవాడిగా పుట్టివుంటే నా జీవితం ఇంకా బాగుండేదా? " అని భారతి అడిగే ఈ ప్రశ్న, సుమారుగా ప్రతీ భారత స్త్రీ గొంతుకలో కొట్టుమిట్టాడుతున్నదేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

అణచబడటం, అణగదొక్కడం అనేవి చాలా మంది స్త్రీ పురుషులలో హక్కులుగానో, బాధ్యతలుగానో, సాంఘిక నియమాలుగానో, ఏవీ గాకపోతే కర్మగానో సరిపెట్టుకుని బతుకుతో రాజీపడిపోవడం సర్వసామాన్యం అని రచయిత్రి తన నవల ద్వారా పరోక్షంగా తెలియజేశారు. అయితే కథనంలో రచయిత్రి ఎక్కడా కనిపించకుండా పాత్రలే కథని నడిపించే తీరు చూస్తుంటే ఒక ప్రధానమైన (అబలల) సమస్య పట్ల తన రచనలో రచయిత్రి





పాత్రేమిటనే సందేహం కలుగుతుంది.

-మాచర్ల సూర్యనారాయణ
ఎం. సింగుపురం- 532 462

## ఆదినుంచి అంతంవరకు...

**(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

**ఆ**దినుంచీ అంతంవరకూ అబలాయానాన్ని అలవోకగా అక్షరీకరించారు పొత్తూరి విజయలక్ష్మిగారు జూన్ '99 'చతుర'లో. అయిదు తరాల చరిత్రను అతిసామాన్యపు కథతో కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించారు. ఆనాడూ ఈనాడూ అతివ జీవనగమనం గతుకుల మార్గాన సాగుతోందన్నది ముంజేతి కంకణం. కావలసిందల్లా పూల బాట కాకపోయినా కంటకమార్గం కాకుండా ఉండేదెలా అన్న ఉపశమన మార్గం చూపించగలగటం. అది ఎవరూ చెప్పకపోవడం విచారకరం. ఆ పంథాలోనే నడిచారు విజయలక్ష్మిగారు కూడా. అన్ని రంగాల్లో ముందంజ వేస్తున్నాం, పురుషునితో దేనిలో తీసిపోమంటున్న నేటి ఆధునిక స్త్రీ పరిస్థితి ఏమంత గొప్పగా ఉంది? ఆనాడూ పురుషాధిక్యతకు బలయింది. ఈనాడూ పురుషాహంకారానికి ఆహుతి అవుతూనే వుంది. విచిత్రమేమిటంటే ఆ పురుషుణ్ణి కని, పెంచి పెద్దచేసేది ఆ స్త్రీనే. తన చేతిలో పెరుగుతున్న తన శత్రువుని తనకనుగుణంగా మలుచుకోలేకపోతోంది. అందునా పిల్లల పెంపకంలో ముప్పాతిక వంతు పైగా బాధ్యత తనే వహిస్తూ కూడా!

ఒకామె తొంభైఏళ్ల వయసులో ఇటీవలే తనువు చాలించింది. ఆమెకు ఆరుగురు కొడుకులు. భర్త బతికుండగా ఏం సుఖమనుభవించిందో తెలియదు. చిన్న వయసులో భర్తను కోల్పోయి ఎన్నో కష్టనష్టాలు పడి పిల్లలందర్నీ పెంచి ఎవరి జీవితాల్ని వారికి తనకయినంతలో ఏర్పాటు చేసింది. తన పుట్టింటివారిచ్చిన ఆస్తిని తెగనమ్మి తన భర్త ఆస్తిని భద్రంగా కొడుకులకే అప్పగించింది. అయినా ఏ ఒక్క కొడుకు ఆదరించి ఆమెకు ఇంత అన్నం పెట్టలేదు. కూతుళ్ళ పంచనే వయోభారాన్ని వెళ్లదీసి, వాళ్ళ దగ్గరే కన్ను మూసింది. ఇది ఆ తరం స్త్రీ జీవితం. నేటితరం వనిత కథ మరొక తీరు. భర్త, అత్త ఆరళ్ళు పడిపడి ఒక అనూహ్య పరిస్థితిలో పుట్టింట చేరింది పోలీసుల సహాయంతో. ఆనాటినుంచి భర్తతో పోరాడుతూనే వుంది న్యాయస్థానంలో. ఆమెతో వచ్చిన ఇద్దరాడపిల్లలకి పెళ్ళీడు వచ్చింది. కాని ఆ న్యాయపోరాటం అంతం కాలేదు. ఆ పిల్లల పెళ్ళిళ్ళ కోసం మరింకెంతకాలం పోరాడాలో ఆ భర్తతో న్యాయవాదుల ద్వారా! ఆధునిక కాలంలోనూ స్త్రీ జీవిత గమనంలో ఎలాంటి మంచి మార్పులూ రాలేదన్నదానికి నిదర్శనం ఇంకేం కావాలి?

ఎంత చదువు చదివినా, ఎన్ని ఉద్యోగాలు చేసినా ఎంత ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించినా ప్రతి స్త్రీకి పురుషుని సాంగత్యం అవసరం అన్న విషయాన్ని రచయిత్రి స్పష్టీకరించారు. అలాగే ఆ అవసరం పురుషునికి తప్పనిసరే. బయలాజికల్ నీడ్ అయిన శారీరక సంబంధాన్ని 'పెళ్లి' పేరుతో పవిత్రంచేసి ఇరుజీవితాల్ని ఒకటి చేసి కుటుంబం అనే వ్యవస్థ ద్వారా సమాజంలో ఒకస్థాయిని, గుర్తింపుని కలుగజేసింది మన వ్యవస్థ. అలాంటి వ్యవస్థలో సమాన భాగస్వాములైన స్త్రీ పురుషులిద్దరిలో ఏ ఒక్కరూ ఎక్కువా కాదు, తక్కువా కాదు. మరప్పుడు స్త్రీ ఒక్కతే ఎందుకు బాధపడాలి. అది మగవాడి దురహంకారం కాకపోతే. మగవాణ్ణి పెంచే తల్లిగా అతడిలో

స్త్రీపట్ల గౌరవం పెరిగేవిధంగా పెంచగల గాలి. స్త్రీ కూడా సాటిమనిషేనన్న ఇంగితం అతడిలో కలిగించే విధంగా వుండాలి ఆమె పెంపకం. ఇందుకోసం స్త్రీ చదువుకోవాలి. దైనందిన జీవితంలో ఏవిధంగానూ మోస గించబడకుండా ఉండే తెలివిని పెంపొందిం చుకోవడం కోసం స్త్రీ చదవాలి. కానిపరిస్థి తులలోనో, కుటుంబ భారాన్ని తానే వహిం చవలసివస్తేనో తప్ప ఉద్యోగావసరాలకోసం తన చదువును వినియోగించకూడదు. ఇందువల్ల సమాజంలో నిరుద్యోగ సంఖ్య పెరగడం, కుటుంబ విచ్ఛిన్నతతో ఒంటరిజీ వితాలు పెరగడం జరుగుతోంది. స్త్రీ పురు షులిద్దరికీ చదువు ఉద్యోగార్హతనిచ్చేది మాత్రమే కాకూడదు!

సమాజంలో అందరూ మంచివాళ్ళే ఉండరు. అలాగే అందరూ చెడ్డవాళ్ళూ ఉండరు. మంచిపాలు కొంచెం ఎక్కువగా ఉంటే చాలు. ఎదుటివాడు ఏంచేస్తే మనం బాధపడతామో ఆ పనిని ఎదుటివారిపట్ల చెయ్యకుండా ఉండమన్న మహాభారత సూక్తిని ప్రతిఒక్కరూ ఆచరిస్తే సమాజంలో అందరూ సుఖసంతోషాలతో జీవించడం అందరాని చందమామేం కాదు.

—సువర్చలా జ్యోతి, తణుకు-534 211

## సబలాయానమే!

(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

**పొ**త్తూరి విజయలక్ష్మిగారి 'అబలాయానం' స్త్రీ మనసుకూ, మనోభావాలకూ అద్దంపట్టిన సజీవ చిత్రం. బాల్యంనుండీ వృద్ధాప్యం వరకూ ఓ స్త్రీ జీవితాన్ని కళ్లకు కట్టినట్లు చూపడంలో రచయిత్రి కృతకృత్యుల య్యారు. నవలంతా ఫస్ట్‌పర్సన్ నేరేషన్‌లో సాగినా కథాగమనం సహజంగా వుండ టంతో ఎక్కడా విసుగన్పించక ఆద్యంతం ఆసక్తిని కల్గించింది.

నవలలో పేరు పెట్టని ఈమె స్త్రీ జాతికి, ముఖ్యంగా మనదేశంలోని సగటు స్త్రీకి ప్రతి రూపం. ఆడుకునే వయసులో తండ్రి వయసు వ్యక్తితో వివాహమయినా, తన తల్లిదండ్రుల అశక్తతనూ, భర్తనూ, అత్తగా రినీ, అత్తగారి అత్తగారినీ అర్థంచేసుకొని మసలుకోవడంలో ఆమె ఔన్నత్యం తెలు స్తుంది. భర్త మరణించాక పుట్టింటికి వెళ్ళక తన సవతి కొడుకు దగ్గిరవుండి తన ఇద్దరు పిల్లల్ని తీర్చిదిద్దుకోవడం ఆమె తెలి విని నిరూపిస్తుంది. ఈ వయసులో నాకు చదువేమిటని తీసిపారెయ్యక సరదాగా మొదలెట్టి మనవడు, మనవరాలిచే అక్షరా భ్యాసం చేయించుకొని విద్య నేర్వడం ఆమె విజయం. కోడలితో సంయమనంతో వ్యవ హరించడం, చివరికి మనవరాలు భారతితో వెళ్ళడం తన కాలం వెళ్ళబుచ్చుకోవడానికి కాక, ఆమెకు తోడుగా, ఆమె వంటరితనం దూరం చెయ్యడానికిగాను అని చెప్పడం ద్వారా రచయిత్రి ఈ పాత్రను ఎంత చక్కగా పటిష్టంగా వూహించారో తెలు స్తుంది. సర్దుకుపోవడమే గగనమైపోతున్న ఈ రోజుల్లో తన ముందుతరం, తనతరం, తన తర్వాతి రెండుతరాల వ్యక్తులతో ఆరో గ్యకరమైన బాంధవ్యాలు కలిగి జీవించడం ఓ పరిపూర్ణ స్త్రీత్వానికి నిదర్శనం. ఆమె జీవనం అభినందనీయం, ఆదర్శప్రాయం. అందుకే యిది అబలాయానం కాదు సబ లాయానమే!

—ఉమ్మెత్తాల శ్రీనివాసరావు.
బొబ్బిలి- 535 558

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78